ఓం శ్రీరామ ఓం

# ❀ శ్రీ సువర్చలాంజనేయ కథా నిధి ❀

గబ్బిట దుర్గాప్రసాద్



ప్రచురణ

సరసభారతి

సాహిత్య సాంస్కృతి సంస్థ

ఉయ్యూరు - కృష్ణా జిల్లా

**శ్రీ సువర్చలా ఆంజనేయస్వామి వార్ల ఆలయంలో జరిగిన పూజా కార్యక్రమాల చిత్రమాలిక**












# శ్రీ సువర్చలాంజనేయ కథా నిధి

గబ్బిట దుర్గాప్రసాద్

## అంకితం



కీ॥శే॥ పవని రాధాకృష్ణ



కీ॥శే॥ పవని సరోజినీ దేవి
(రాధాకృష్ణ గారి తల్లిగారు)

ప్రచురణ
సరసభారతి
సాహిత్య సాంస్కృతి సంస్థ
ఉయ్యూరు - కృష్ణా జిల్లా

# శ్రీ సువర్చలాంజనేయ కథా నిధి

Sree Suvarchalanjaneya Kadha Nidhi

ప్రధమ ముద్రణ - 600 ప్రతులు
శ్రీ నందన - చైత్రమాసం
మారి - 2012
రచన - గబ్బిట దుర్గా ప్రసాద్
ఎం . ఎ . బి . యస్ .సి , బి .ఇ డి .
ప్రచురణ - సరస భారతి
సాహిత్య సాంస్కృతిక సంస్థ
ఉయ్యూరు .
ప్రతులకు - గబ్బిట దుర్గా ప్రసాద్
అధ్యక్షులు - సరస భారతి
ఇ . నెం : - 2 - 405
శివాలయం వీధి, రాజా గారి కోట దగ్గర
ఉయ్యూరు - 521165. కృష్ణా జిల్లా.
ఫోన్ నెం : - 08676 - 232797
9989066375
ఇ . మెయిల్ : - gabbita.prasad @ gmail.com
sarasabharathi.vuyyuru@ gmail.com
hptt // sarasabharathi.wordpress.com
hptt // suvarchalanjaneya swami.wordpress.com
వెల - అమూల్యం
డి . టి . పి. - చింతా గౌరి నాగ శిరీష
కవర్ పేజి డిజైన్ - సిరి గిరిజా ఎంటర్‌ప్రైజెస్.
ముద్రణ - సిరి గిరిజా ఎంటర్‌ప్రైజెస్.

# శ్రీ సువర్చలాంజనేయ కథా నిధి

## సరసభారతి కార్యక్రమాల చిత్రమాలిక







## కృతజ్ఞతలు

పుస్తక ప్రచురణకు సహకరించిన దాతలు :

| | | |
|---|---|---|
| శ్రీ తుమ్మలపల్లి రాజేశ్వరరావు, భాగ్యలక్ష్మి దంపతులు | - | రూ. 5,000/- |
| శ్రీ వేలూరి రామకృష్ణ, వేదవల్లి దంపతులు | - | రూ. 1,000/- |
| శ్రీ టివి సత్యనారాయణ, సుందరీ దంపతులు | - | రూ. 1,116/- |
| శ్రీ చతుర్వేదుల మధుసూదనమూర్తి, రాజ్యలక్ష్మి దంపతులు | - | రూ. 500/- |
| శ్రీ మార్తి వెంకట సత్యనారాయణ | - | రూ. 500/- |
| శ్రీమతి మేరుగ భద్రకాళి | - | రూ. 500/- |

# శ్రీ సువర్చలాంజనేయ కథానిధి

## అంకితం

## స్వర్గీయ శ్రీ పవని రాధాకృష్ణ గారికి

## స్మృత్యంజలి

శ్రీ పవని రాధాకృష్ణగారు 16-10-1946 లో అనంతపురంలో శ్రీరామచంద్రరావు, శ్రీ మతి సరోజినీ దేవి దంపతులకు జన్మించారు. అక్కడే విద్యాభ్యాసం చేశారు. బి. టెక్. లో ఉత్తీర్ణులై ఏ. పీ. పీ. ఎస్. ఇ. బి. లో ఇంజినీర్ గా ఉద్యోగం ప్రారంభించి సూపరింటెండెంట్ ఇంజినీర్‌గా పదోన్నతి పొందారు. వీరి అర్ధాంగి శ్రీమతి ప్రమీలా రాణి. అనుకూలమైన దాంపత్యం.

రాధాకృష్ణ గారి తండ్రి గారికి వున్న ఏడుగురు సంతానంలో వీరు మూడవ వారు. వీరికి 5గురు సోదరులు, ఒక అక్క గారు వున్నారు. అందరితో మంచి సయోధ్య వుండేది. 2001 లో రాధాకృష్ణ గారు తిరుపతిలో ఉద్యోగం చేస్తూ స్వచ్ఛంద పదవీ విరమణ చేశారు. కడపలో స్వగృహం నిర్మించుకొని హాయిగా, ఆనందంగా వున్నారు.

రాధాకృష్ణ దంపతులకు ఇద్దరు అబ్బాయిలు, ఇద్దరమ్మాయిలు. పెద్దబ్బాయి రాజశేఖర్, కోడలు చి॥సౌ ఈశ్వరి, మనుమడు చి॥ రిషిక్ అమెరికాలో వుంటాడు. చిన్నబ్బాయి మురళీకృష్ణ, కోడలు చి॥ సౌ కామాక్షి సుప్రియ బెంగుళూర్‌లో వున్నారు. వీరు అంతా మంచి ఉద్యోగస్తులే. పెద్దమ్మాయి చి॥సౌ మాధవి, అల్లుడు చి॥ సుధీంద్ర, మనుమడు చి॥ఆశుతోష్, మనుమరాలు చి॥ అమూల్యలు అమెరికాలో మిచిగాన్ రాష్ట్రంలో వున్నారు. అల్లుడు గొప్ప ఉద్యోగి. చిన్నమ్మాయి చి॥సౌ అనూరాధ, అల్లుడు చి॥ జానకిరాం, మనుమరాలు చి॥ శాయి (అఖిల) అమెరికాలోని చికాగోలో వుంటారు.

రాధాకృష్ణ గారు గొప్ప ఆధ్యాత్మిక జీవితాన్ని సన్మార్గంలో గడుపుతూ, పిల్లల వివాహాలన్నీ పూర్తి చేసి, మనుమల్లు, మనుమరాళ్ళుతో, కడపలో ఆనందంగా వున్నారు. వారిల్లు ఎప్పుడు బంధు మిత్రుల రాకతో సందడిగా వుండేది. అందరికీ తలలో నాలుకగా వ్యవహరించే వారు. ప్రజలకు సన్నిహితంగా మెలిగి వీలైన సహాయసహకారాలు అందించి కడపలో పేరు ప్రఖ్యాతులు పొందారు. సంధ్యా వందనం, నమక చమకాలతో శివునికి అభిషేకం చేసుకొనే వారు. వారింట్లో అమూల్యమైన గ్రంథాలయం వుంది. ఎన్నో విలువైన పుస్తకాలను కొని చదివేవారు. సంతానంపై అవ్యాజమైన అనురాగం. ఇంకా ఆధ్యాత్మికంగా ఉన్నతి సాధించాలని తపన చెందేవారు. తగిన గురువు వద్ద జీవిత పరమార్ధాన్ని సాధన చేయాలని ఆరాటం చెందేవారు.

మా అమ్మాయి విజయలక్ష్మి, అల్లుడు అవధా, మనుమళ్ళు అమెరికాలోని మిచిగాన్ లో వుండగా మేము మూడోసారి అమెరికా వెళ్ళినప్పుడు రాధాకృష్ణ గారి అమ్మాయి మాధవి కుటుంబంతో బాగా పరిచయం ఏర్పడింది. ప్రతి వారం కలుసుకుంటూ వుండేవాళ్ళం. ప్రతిరోజూ ఫోన్ సంభాషణ తప్పనిసరి. ఆ కుటుంబం కూడా ఆప్యాయతకు మారుపేరు.

మేము ఇండియా తిరిగి వచ్చింతర్వాత హైదరాబాద్ లో మా అమ్మాయి వాళ్ళ ఇంటికి రాధాకృష్ణ గారు ఒకటి రెండు సార్లు వస్తే కలిసి మాట్లాడటం జరిగింది. అదే తొలి పరిచయం. నేను “ శ్రీ సువర్చలాంజనేయ కథా నిధి ” ని

నెట్‌లో రాస్తుంటే మాధవి చదివి బాగున్నాయని ప్రశంశించింది. మాధవి అప్పుడప్పుడు ఫోన్ ద్వారా, మెయిల్ ద్వారా తండ్రి గారి ఆరోగ్యం బాగాలేదని చెబుతుండేది. ఆమె కోరిక విధంగా వారి పేరుమీద ఇక్కడ మా శ్రీసువర్చలాంజనేయ స్వామికి అర్చన చేయించేది. ఎందుకో రాధాకృష్ణ గారి ఆరోగ్యం క్రమంగా క్షీణిస్తున్నట్లు మా అమ్మాయికి చెబుతూ ఉండేదని మా అమ్మాయి మాకు చెప్పేది. ఆందోళన చెందేది మాధవి.

ఇది ఇలా వుండగా 2011 డిసెంబర్ ఎనిమిది నాడు , మా దేవాలయం లో " శ్రీ హనుమద్ వ్రతం " చేస్తుండగా శ్రీ రాధాకృష్ణ గారు కడప నుంచి ఫోన్ చేశారు. ఎన్నో ఆధ్యాత్మిక విషయాలు మాట్లాడారు. హనుమ కథలు చదువుతున్నానని బాగున్నాయని పుస్తక రూపంలో వస్తున్నందుకు అభినందనలని అన్నారు. ముద్రణకు అయ్యే ఖర్చు తానే మొత్తం ఇస్తానని నాలుగు రోజుల్లో బ్యాంక్ ద్వారా పంపిస్తానని, తమ తల్లి పవని సరోజినీ దేవి గారికి అంకితం చేయమని చెప్పారు. కృతజ్ఞతలు తెలియ జేశాను. గుడిలో వున్న అశేష భక్త జనానికి ఈ విషయం తెలియజేయగానే, వారంతా హర్షధ్వానాలతో రాధాకృష్ణ గారికి అభినందనలు తెలియజేసారు.కొన్ని రోజుల తర్వాత మాధవి ఫోన్ చేసి తండ్రి గారు అస్వస్తులవటం వల్ల డబ్బు పంపలేక పోయారని, ఏమీ అనుకోవద్దని, త్వరలోనే పంపిస్తానని, బ్యాంక్ ద్వారా పంపిస్తున్నానని పుస్తక ముద్రణకు ఉపయోగించమని తన తండ్రి గారు కోరినట్లు అంకితమివ్వమని కోరి, వెంటనే డబ్బు ఏర్పాటు చేసింది. తండ్రి గారు పేరు మీద ప్రత్యేక అర్చన చేయించమని కోరగా అలానే చేయించాము. విధి బలీయం. రాధాకృష్ణ గారు అకస్మాత్తుగా గుండెజబ్బుతో నూతన సంవత్సర ప్రారంభదినంనాడు అంటే 01-01-2012 న పరమపదించారని ఆ రాత్రి మా అమ్మాయి ద్వారా తెలిసింది. ఆ కుటుంబానికి సానుభూతి తెలియజేశాం. కుటుంబానికి పెద్ద దిక్కు, అందరి వాడు అని పించుకొన్న రాధాకృష్ణ గారు, కుటుంబానికి తీరని వ్యధను మిగిల్చి, పరమాత్మలో లీనమయ్యారు. వారి ఆత్మ కు శాంతి కలగాలని భగవంతుని ప్రార్థిస్తూ స్మృత్యంజలి ఘటిస్తున్నాం.

సరస భారతి ప్రచురిస్తున్న ఆరవ పుస్తకమైన " శ్రీ సువర్చలాంజనేయ కథా నిధి " ని స్వర్గీయ శ్రీ పవని రాధాకృష్ణ గారికి వారి తల్లి సరోజినీ దేవి గారికి అంకితం ఇస్తూ, ఆ కుటుంబానికి సానుభూతి ని తెలియజేస్తున్నాము. ఆమె హిందీ, తెలుగు, కన్నడ, తమిళ్, ఇంగ్లీష్‌లలో ప్రావీణురాలు. 35 ఏళ్ళ వయసు లోనే భర్తను కోల్పోయినా, కుటుంబానికి అన్నీ తానే అయి, ట్యూషన్స్ చెప్పి, ఆ సంపాదన తో కుటుంబం పోషించారు. కష్టజీవి-సంతానం లో అందరూ బాగా విద్యార్జన చేసి, ఉన్నత పదవులు పొందారు. మనో నిబ్బరం, గుండె ధైర్యమే ఆమెకు ఆభరణాలు. అందర్నీ తీర్చిదిద్దిన ఆ మహా ఇల్లాలు. స్వర్గీయ పవని సరోజనీ దేవి గారి లోని అమ్మతనానికి ఈ పుస్తకం అంకితమిస్తున్నాం.

# శ్రీ సువర్చలాంజనేయ కథా నిధి

## శ్రీ హనుమాన్ దివ్యచరితం

### " శ్రీ సువర్చలాంజనేయ దివ్య చరితం "

" ఒక భూతంబున కుద్భవించి, మరి యింకోదానిపైకేగి, యింకొక దానిన్ దరియాడ్చి, వేరొకట రక్షోదేశమున్ గాల్చి, వేరొక భూతంబు తనూజ గురైరిగి, పేరుంగాంచి, భూతప్రపంచక రూపాత్మకుడైన మారుతి సమస్తారాధ్యదైవంబగున్"

ఆంజనేయుడు పంచభూత స్వరూపుడు. రామాయణం మహా మాలామంత్రం. హనుమాన్ యీ మహా మంత్రమాలలో రత్నం. అందుకే 'రామాయణ మహామాలా రత్నం వందే అనిలాత్మజం' అంటారు. ఇలాంటి మహిమాన్వితుడైన మారుతి ని గురించి మనం పూర్తిగా తెలుసుకోవాలి.

ఎందుకు తెలుసుకోవాలి ?

మన సమాజం నిస్తేజంగా వుంది. యువత శక్తి సామర్థ్యాలన్నీ వ్యర్థం అవుతున్నాయి. సంఘంలో భద్రత లేదు. నడిపించే నాయకులకు ధర్మదృష్టి, శీలం లేవు. కనుకనే దుష్టాచారం. అక్రమాలు, అవినీతి తాండవం చేస్తున్నాయి. ఈ పరిస్థితి నుండి బయట పడాలంటే అందరం శక్తి సంపన్నులం కావాలి. భక్తి, శక్తి, బ్రహ్మచర్యం, శీలం, యోగం, బుద్ధిబలం, చాతుర్యత, ప్రవర్తన వున్నవాడు.

శ్రీ ఆంజనేయ స్వామి దాస్యం, స్నేహం, పరోపకారం మూర్తీభవించిన వాడు. అందుకనే ఆయన్ను స్మరిస్తే, ఆరాధించి సేవిస్తే ఆలక్షణాలు మనకూ అలవడుతాయి. పూర్ణ శక్తి గలవారమైతే సంఘం శక్తి కూడా పెరుగుతుంది. దేశం బల సంపన్నమవుతుంది. శత్రువులకు భయం కలుగుతుంది. దేశం తన కాళ్ళపై నిలబడగల్గుతుంది. శత్రు భీకరుడు స్వామి. మనల్ని చూసినా శత్రు భీకరంగా కన్పించి మన జోలికి రారు. ఉపాసనలో మొదటి సూత్రం " దేవోభూత్వా

దేవం యజేత్ ” అని వుంది. ఉపాసన అంటే దగ్గరలో వుండటం. ఈఉపాసన ద్వారా ఏ యిష్ట దేవతలోని గుణం, రూపం, శక్తి కలగాలని మనం కోరుకుంటామో, ఆ శక్తులన్నీ మనలో ప్రవేశిస్తాయని పై మంత్రం అర్థం. సర్వలక్షణ సంపన్నుడు హనుమాన్ కనుక ఆయనకు సమీపంగా చేరితే, ధ్యానిస్తే ఆ లక్షణాలన్నీ మనలో చేరతాయి.

అందుకని ఆయన్ను గురించి పూర్తిగా తెలుసుకోవాలి.తెలుసుకొని చేసే ప్రతీ పని మంచి ఫలితాన్నిస్తుంది. రామ రావణ యుద్ధం అయిన తర్వాత శ్రీరాముడు ఆంజనేయుని “నీ పరాక్రమం, యమ, ఇంద్ర, ఉపేంద్ర, కుబేరుడు మొదలైన లోకపాలకులలో కూడా లభించదు.” అని కీర్తించారు. హనుమంతుని వంటి పరాక్రమశాలి, నిస్కామ కర్మ యోగి మాత్రమే ధర్మాన్ని రక్షించగలడు, సమర్పణ, త్యాగం,కర్తవ్యనిష్ఠ ఆయన్నుంచే మనం పొందగలం.లౌకిక సమస్యలు ఎదురైతే శ్రీ రామ భక్త హనుమాన్ ని స్మరిస్తే చాలు పరిష్కారం లభిస్తుంది.“ లౌకికే సమనుప్రాప్తేమాం, సర్వేద్రామ సేవకం ” అని రామరహస్యోపనిషత్తు చెప్తోంది. సర్వశక్తి సమన్వితుడైవుండి కూడా హనుమ సదా శ్రీ రామనామ సంకీర్తనలో గడుపుతాడు.ఆకీర్తనలో ఉన్మత్తుడౌతాడు. కళ్ళనుంచి ఆనందబాష్పాలు జలజల కారుతాయి. అతని శరీరం గగుర్పొడుస్తుంది.“ ఓ నాలుకా ! నీకు శుభం కావాలంటే శ్రీ జానకి జాని అయిన శ్రీరాముని మధురాతి మధురమైన నామాన్ని ఎప్పుడూ స్మరించు. క్షణం కూడా వ్యర్థం చేయవద్దు.” అని హనుమ అంటాడట తన నాలుకతో. శ్రీరామ నామాన్ని తన జీవిత సర్వస్వంగా భావించి తరించిన మహా భక్తుడు రామదాసుడైన హనుమ. సముద్రం పై వారధి కట్టేటప్పుడు నలునికి, నీలునికి శ్రీరామ నామం ఉపదేశించినట్లు ‘ఆది రామాయణం’ చెబుతోంది.సాక్షాత్తు శ్రీరామునిలో హనుమంతుడు “దేహం దృష్టిలో మీదాసుడిని. జీవరూపంలో మీ అంశను. పరమార్ధ దృష్టితో చూస్తే నేను, మీరు ఒక్కటే” అని నిశ్చయంగా చెప్పగల ధీమంతుడు. వేద, ఉపషత్తు సారాంశాన్ని గ్రహించిన వాడు పావని.



సర్వానికి ఆధారం వేదం.భగవంతుడు వేదస్వరూపుడు.అలాంటి వేదాల్లో కూడా శ్రీహనుమంతుని గురించి ప్రస్తావన ఉంది.“ ఓం ఆంజనేయ విద్మహే వాయుపుత్రాయ ధీమహి. తన్నో హనుమాన్ ప్రచోదయాత్ ” అని మంత్ర మహార్ణవం వివరిస్తుంది. వేదప్రతిపాదితుడు కనుక ఆయన్ని గురించి తప్పక తెలుసుకోవాలి.

వేదాలకు చివరిదైన ఉపనిషత్తులలో కూడ హనుమత్ ప్రస్తావన వుంది. రామ పూర్వోత్తర పనిషత్, ముక్తోపనిషత్, శ్రీరామ రహస్యోపనిషత్ లలో శ్రీ ఆంజనేయ తత్వం వర్ణించబడింది.రామ తత్వాన్ని పూర్తిగా తెలుసుకొన్న వాడిగా వీటిలో హనుమను చెప్పారు. హనుమ అంటే మూర్తీభవించిన వేదాంతమని, అన్నీ తెలిసిన పూర్ణజ్ఞాని అనీ వివరించారు. స్కంధ పురాణంలో హనుమంతుని పేర ”హనుమత్కపీశ్వర” శివలింగం నర్మదానది తీరంలో ప్రతిష్టించినట్లుంది. దీన్ని ’కపి తీర్థం’ అంటారు.

శ్రీరాముడు రామేశ్వరంలో శివలింగాన్ని ప్రతిష్టించాలని భావించి, కైలాసం నుంచి శివలింగాన్ని తీసుకు రమ్మని హనుమంతుని పంపాడట.ముహూర్త సమయానికి ఆయన తేలేదట. ఇసుకలో సీత శివలింగం చేస్తే శ్రీరాముడు ముహూర్త సమయంలో ప్రతిష్టించాడట.అప్పుడు హనుమ కైలాస లింగంలో వచ్చాడట.ప్రతిష్ట జరిగిపోయి నందుకు కోపంవచ్చి రామ ప్రతిష్టితసైకత లింగాన్ని సముద్రంలోకి ఎత్తి పారెయ్యాలని ప్రయత్నించి విఫలుడయ్యాడట. మూర్ఛపోయాడు. అందరూ స్తోత్రం చేస్తే చాలు, శ్రీరాముని ఆదేశానుసారం రామేశ్వరానికి ఉత్తరంగా కైలాసలింగాన్ని తానే స్వయంగా ప్రతిష్టించాడు హనుమ, దానినిహనుమత్లింగంఅంటారు. అంతటి కార్యదక్షుడు, స్వామి కార్య నిర్వాహకుడు కనుక హనుమ లీలలను తెలుసుకోవాలి. తరించాలి. శక్తి, బుద్ధి, యుక్తి, ధైర్యం, కార్యసాధన ప్రేమ, స్నేహం, త్యాగం, సేవ, మంత్రత్వం, జ్ఞానం, విద్య మొదలైనవన్నీ శ్రీ ఆంజనేయస్వామి అనుగ్రహం వల్ల మనం సంపాదించుకోవాలి.

కార్య సాధన చేయాలి. కష్టాలకు లొంగడం, సుఖాలకు పొంగడం పనికిరాదు. కర్మ ఫలత్యాగబుద్ధి పొందాలి. సన్మార్గంలో నడిచి జీవితాన్ని సార్ధకం చేసుకోవాలి.

"మనోజవం మారుత తుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్టం
వాతాత్మజం వానరయూధముఖ్యం
శ్రీరామ దూతం శిరసానమామి".

శ్రీ మాన్ సర్వ గుణసంపన్నో శ్రీ హనుమత్ సూక్తం

## శ్రీ హనుమత్ సూక్తం

శ్రీమాన్ సర్వలక్షణ సంపన్నో జయప్రద: సర్వాభరణ భూషిద ఉదారో మహోన్నత ఉష్ట్రాడూఢ: కేసరీప్రియ నందనో, వాయుతనూజో యధేచ్ఛం పంపాతీరవిహారీ, గంధమాదన సంచారీ హేమప్రాకారాం చితకనక కదళీ వనాంతీరనివాసీ పరమాత్మా మకరీ శాపవిమోచనో హేమవర్ణో నానారత్నఖచిత మమూల్యం మేఖలాం స్వర్ణోపవీతం కేశీయ వస్త్రం చ బిభ్రాణాం సనాతనో మహాబల అప్రిమేయ ప్రతాపశాలీ రజితవర్ణ శుద్ధ స్పటిక సంకాశ: పంచవదన: పంచదశనేత్రస్సకల దివ్యాస్త్రధారీ సువర్చలా రమణో మహేం ద్ర దృష్ట దిక్పాలక త్రయస్త్రింశద్గీర్వాణ మునిగణ గంధర్వ యక్షకిన్నెర పన్నగాసుర పూజిత పాదపద్మయుగళో నానావర్ణ: కామరూప: కామచారీ యోగిధ్యేయ: శ్రీహనుమాన్ ఆంజనేయ: విరాడ్రూప: విశ్వాత్మ పవననందన: పార్వతీ పుత్ర: ఈశ్వర తనూజ: సకల మనో రధాన్నోదదాతు.



## సర్వవ్యాపి

త్రేతాయుగంలో శ్రీరామ కార్య దురంధరుడు, ద్వాపరయుగంలో అర్జునుని రధం పై కపి కేతనంలో స్తిరంగా వున్నవాడు,కలియుగంలో ప్రతీ గ్రామంలోను హనుమత్ ఆలయాలలో వెలసి సర్వజగద్రక్షకుడై, సర్వాభీష్ట ప్రదాతయై అందరకు సన్నిహితుడు,హితుడు అయిన వాడు పవన సుతుడైన హనుమంతుడు.భవిష్యత్తులో వచ్చే మన్వంతరంలో ఏర్పడే బ్రహ్మాండంలో హిరణ్యగర్భుడుగా ఆవిర్భవిస్తాడు. భవిష్యత్ బ్రహ్మ కూడా ఆయనే. నవ బ్రహ్మ స్వరూపుడు, దశ విష్ణురూపుడు, ఏకాదశ రుద్రావతారుడు, ద్వాదశ ఆదిత్య తేజస్వి, త్రయోదశ సోముడుగా ఆయనను వర్ణిస్తారు.

హనుమంతుడు శైవులకు, వైష్ణవులకు, స్మార్తులకే కాకుండా యిప్పుడు సర్వ మతాల వారికి ఆరాధనీయుడైనాడు. ఆయనంటే అందరికీ అభిమానమే, భక్తియే. రుద్రవీర సముద్భవుడు కనుక శైవులకు, శ్రీ రామపాద సేవాదురంధరుడై నందున వైష్ణవులకు, సాక్షాత్ పరబ్రహ్మ తత్వ స్వరూపుడు కనుక స్మార్తులకూ ఆరాధ్యదైవం అయ్యడు. తన తప: ప్రభావంతో బ్రహ్మభావం పొంది, సర్వబ్రహ్మాండ సృష్టిని చేయగల సమర్ధుడైనాడు. రాబోయే సర్వ చరాచర ప్రపంచ సృష్టికీ శ్రీహనుమత్విరాడ్ మూర్తియే కర్త–భవిష్యత్ చతురాననుడు–అంటే భవిష్యత్ బ్రహ్మ .

ఆయన త్రిమూర్తి స్వరూపుడు,సర్వ దేవతా మయుడు. ఆయన నామం ఉచ్చరిస్తే చాలు సర్వ పాపాలు తొలగిపోతాయని అందరి విశ్వాసం.సర్వారిష్టాలు పటాపంచ లౌతాయని నమ్మకం. తెల్ల గురివింద చెట్టు వేరును శుభ్రంచేసి, బంగారంలో చుట్టి హనుమంతుని ముద్రికను చేసి, హనుమంతుని మూల మంత్రంతో పూజిస్తే జనాకర్షణ కల్గుతుంది. హనుమంతుని విగ్రహం ముందు ఆయన వాహనమైన ఒంటెను వుంచి పూజిస్తే కోరిన కోరికలు తీరుతాయి.

తెల్ల జిల్లేడు వేరుతో హనుమంతుని విగ్రహం చేసి ఉపాశిస్తే శతృ సంహారం తేలిక. ఇలా పూజించే శంకరుడు త్రిపురాసురులను సంహరించాడు.

హనుమాన్ సాలగ్రామ మూర్తి చాలా వింతగా వుండే ప్రతిమ. శిరస్సు దక్షిణ భాగంలో గుండ్రని చక్రం, దానికి ఎడమ వైపు బాణం దెబ్బ తగిలిన ఆవు గిట్టచే ఏర్పడ్డ నీటి పాయ, మూలికా రూపంగా వుండే తోక,అనేక శిఖరాలు,సూక్ష్మమైన విల్లు ఆకారం,ముఖం పై రెండు చక్రాలు,చిన్న పుష్కరం కలిగి, శ్రీహనుమంతుని సాలగ్రామం ప్రకాశిస్తుందట. దీన్ని అర్చిస్తే సర్వఫలప్రదం. " ఓం హరి మర్కటాయ నమ: " అని జపిస్తూ హనుమను సేవించాలి. పూర్వం వృత్రాసురుడిని సంహరించటానికి దేవేంద్రుడు యుద్ధానికి వెళ్ళి అతని మాయాజాలానికి మూర్ఛపోయాడు. బృహస్పతి వచ్చి హనుమత్ స్తోత్రం ఉపదేశించాడు. దాన్ని పఠించి, మూర్ఛ నుంచి లేచి దేవేంద్రుడు వృత్రాసురుణ్ణి సంహరించాడు. హనుమంతుడు పంచ భూతాత్ముడే కాదు, పంచ ముఖ మూర్తి కూడా. వానర, నారసింహ సూకర, అశ్వముఖాలలో అనేక అలంకారాలలో, కాంతిలో దేదీప్యమానంగా వున్న 15 నేత్రాలతో, పద్మాల వంటి చేతుల్తో, ఖడ్గం, డాలు, పుస్తకం, అమృత కలశం, అంకుశం, పర్వతం, నాగలి,మంచం కోడు, మణులు ధరించి, పాములకు శతృవైన గరుత్మంతుని గర్వాన్ని అపహరించిన రూపంతో హనుమంతుడు దర్శన మిస్తాడు. ఈ పంచముఖ ఆంజనేయుని స్మరిస్తే చాలు సర్వ రోగాలు ,భయాలు ,పాపాలు నశిస్తాయి. ఆయుష్షు, ఆరోగ్యం,ఐశ్వర్యం లభిస్తాయి. " వందే ,వానర, నారసింహ, ఖగ రాట్, క్రోడాశ్వ, వక్త్రాన్వితం నానాలంకరణం, త్రి పంచ నయనం, దేదీప్య మానం రుచా హస్తాబ్జైరసి, ఖేట, పుస్తక, సుధా కుంభాం, కుశాద్రీన్ హలం ఖట్వాంగం, మణి, భూరుహం, చ దధతం సర్వారి గర్వా పహం ".



## నవవ్యాకరణ వేత్త - సువర్చలా విభుడు

ఆంజనేయునికి నవ వ్యాకరణాలు నేర్చుకోవాలన్న కోరిక కల్గిందట. ఆ విద్యలు చెప్పగల వాడు సాక్షాత్తు సూర్య భగవానుడొక్కడే. ఆయన దగ్గరకు వెళ్ళి వినయంగా విద్య నేర్పమని అర్థించాడు. " నేను ఉదయం ఒక వైపు, సాయంత్రం యింకో వైపు వుంటాను. ప్రతి క్షణం ప్రయాణం చేస్తూ వుంటాను. నువ్వు ఎలా విద్య నేర్చు కోగలవు ?"అని ప్రశ్నించాడు సూర్యుడు. దానికి సమాధానంగా "ఒక కాలు తూర్పు కొండమీద, రెండవది పడమటి కొండ మీద వుంచి, అనుక్షణం మిమ్మల్ని అనుసరిస్తూ నేర్చు కుంటాను" అని హనుమ చెప్పాడు. అతని ఆసక్తి కి, దీక్షకు మెచ్చి విద్య నేర్పటం ప్రారంభించి 5 రకాల వ్యాకరణాలు నేర్పాడు. మిగిలిన 4 కూడా నేర్పమని శిష్యుడు కోరాడు.

అవి వివాహితులకు మాత్రమే నేర్పబడేవి అని చెప్పాడు గురువు. దానికి శిష్యుడు విచారించాడు. గురువునే పరిష్కారం చెప్పమన్నాడు. అప్పుడాయన తన కుమార్తె సువర్చలను వివాహం చేసుకుంటే నేర్పుతానన్నాడు. సరే నంటూ ఒక షరతు విధించాడు హనుమ, "వివాహం చేసుకుంటాను కాని, దాంపత్యం వుండదు. దానికి మీ అమ్మాయి అంగీకరిస్తే, నేను సిద్ధం " అన్నాడు. కూతురు మనస్సును గ్రహించి ఆమె ఆ షరతును ఒప్పుకోవడంతో సువర్చలకు ఆంజనేయస్వామికి వివాహం జరిపించారు. సూర్యుడు, ఆయన భార్య ఛాయాదేవి. ఆ తర్వాత శిష్యుడికి మిగిలిన నాలుగు వ్యాకరణాలు శ్రద్ధగా నేర్పించాడు. అందుకే ఆంజనేయుడు ' నవ వ్యాకరణ పండితుడు ' అయ్యాడు. చక్కగా, శుద్ధిగా, నేర్పుగా మాట్లాడాడు మొదటి సారిగా శ్రీ రాముడు కిష్కింధలో కలిసినప్పుడు ఆయన మెప్పునూ పొందాడు. అలాగే లంకలో సీత ను దర్శించి ఆమెలోనూ చాలా శాస్త్ర బద్ధంగా ఆత్మీయంగా మాట్లాడి సీతమ్మ దీవెనలూ పొందాడు. ఇలా నేర్చిన విద్యను సార్ధకం చేసుకొని ప్రశంసల నందు కున్నాడు. అలాంటి వారిని ' వాజ్మి ' అంటారు. ఆ కోవలో చేరినవాడు బుద్ధి మంతుడు, మతి

మంతుడు, సంస్కారి అయిన హనుమంతుడు. " శ్రీ సువర్చలా ధిష్టిత వామ భాగం – నిరస్త కందర్ప సురూప దర్పణం – భాను ప్రభం – రాఘవ కార్యదక్షం అస్మత్కులేశం శ్రీ హనుమంత మీడే " అని స్తుతిస్తే మనకు రక్షగా నిలబడగలుగుతాడు పావని.

## హనుమద్ వ్రతం

మార్గశిర శుద్ధ త్రయోదశి నాడు హనుమద్ వ్రతం చేస్తారు.పంపా నది ఒడ్డున కాని, కలశంలో పంపాజలాన్ని ఆవాహన చేసి కాని చేస్తారు. 13 ముళ్ళు గల తోరణాన్ని పూజించి,మంత్రం తో చేతికి కట్టు కుంటారు.వ్రత కథలను చదివి, నైవేద్యం పెట్టి ప్రసాదాన్ని తింటారు. ఈ రోజుననే లంకలో సీతా దేవిని హనుమంతుడు దర్శించాడని చెప్తారు.కనుక హనుమత్ వ్రతం రోజున హనుమను అర్చించితే సమస్త దు:ఖాలు పోతాయి.కోర్కెలు అన్నీ తీరుతాయి. సర్వ సంపదలు లభిస్తాయి. రావణ సంహారం ముందు శ్రీరాముడు, అరణ్యవాస, అజ్ఞాత వాసాలు నిర్విఘ్నంగా జరిగి, కౌరవులపై చేసే యుద్ధంలో పాండవులకు జయం కలగాలని శ్రీ కృష్ణుని సలహాతో ద్రౌపదీ హనుమద్ వ్రతాన్ని చేసారు, ఫలితాలను పొందారు. హనుమజ్జయంతి వైశాఖ మాసంలో కృష్ణ పక్షంలో దశమి నాడు శనివారం నాడు ఆంజనేయుడు జన్మించినట్లు భావిస్తారు. ఆరోజును హనుమజ్జయంతిగా నిర్వహిస్తారు. ఆయన కదళీ వన విహారుడు. కనుక అరటి చెట్లతో ఆలయాలను అలంకరిస్తారు. నాగవల్లి పూజ హనుమకు యిష్టం కనుక అశేషమైన తమలపాకులతో భక్తిగా పూజిస్తారు.పానకం, వడపప్పు, అప్పాలు నైవేద్యం పెట్టి ప్రసాదంగా స్వీకరిస్తారు. ఆరోజే హనుమత్ సువర్చలా కళ్యాణమూ వైభవోపేతంగా చేసి, గ్రామోత్సవం నిర్వహించి, అందరికి ఆ పుణ్యమూర్తుల దర్శన భాగ్యాన్ని కల్పిస్తారు. మామిడి పండ్ల కాలం కనుక పండ్లతో ఒక రోజు, గంధ సింధూరంతో యింకోరోజు, తమల పాకులతో జయంతి నాడు త్రయాహ్నికంగా పూజించటం అలవాటుగా వుంది. హనుమకు 'లడ్డు' అంటే మహా ప్రీతి కనుక వాటినీ నైవేద్యంగా సమర్పిస్తారు.



## భీమస్వరూపుడు

హనుమంతుడు, భీముడు యిద్దరూ వాయుదేవుని కుమారులే.భీముడికి తన కంటే బలవంతులు లేరని గర్వం. ఆంజనేయుడు ముసలి కోతి వేషం వేసుకొని, దారికి అడ్డంగా కూర్చున్నాడు భీముడు వెళ్ళే దారిలో. దాటటం ఇష్టం లేక తోక ముడవమన్నాడు భీముడు. తను ముసలి వాడనని, తోకను కదల్చలేనని, ఎత్తి ప్రక్కన పెట్టి వెళ్ళమని ఆంజనేయుడు కోరాడు. ఎంత ప్రయత్నించినా ఎత్తలేక పోయాడు, పైగా తోక క్రింద పడి నలిగిపోయాడు. అప్పుడు తెలుసుకున్నాడు ఆ కోతి సాక్షాత్తు ఆంజనేయుడేనని. ఇలా భీముని గర్వాన్ని అణచాడు.

వాలిని సంహరించటానికి సుగ్రీవునికి శ్రీ రాముని స్నేహం కూర్చాడు. సీతాన్వేషణ చేసి రామునికి సీత జాడ చెప్పాడు. రావణ సంహారంలో శ్రీ రామునికి సాయం చేశాడు. సుగ్రీవుని మంత్రిగా మంచి సలహాలనిచ్చాడు. సుందరకాండలో తన లీలా వైభవం అంతా చూపాడు. విశ్వరూపాన్ని ప్రదర్శించాడు. రావణుని గర్వభంజనంగా లంకాదహనం చేశాడు. విభీషణుడు రాముని శరణు కోరినపుడు అందరూ వద్దన్నా, సూక్ష్మ బుద్ధి గల హనుమ శరణు జొచ్చిన వాడిని రక్షించాలని రామునికి సలహా యిచ్చాడు. తన గుండెలో సీతారాములు ఎప్పుడూ కొలువై వుంటారని, గుండె చీల్చి చూపాడు. లక్ష్మణాదులు మూర్ఛపోతే సంజీవ పర్వతాన్ని తెచ్చి అపాయం నుంచి కాపాడాడు.

»dŸ+<Š dŸ+<Š s eT: dŸ+<Š dŸ+<Š ¿£‘
dŸ+<Š dŸ+<Š dÔ dŸ+<Š dŸ+<ŠÁ eq+
dŸ+<Š dŸ+<ŠÁ ¿±e«+ dŸ+<Š dŸ+<ŠÁ¿£¾
dŸ+<Š dŸ+<ŠÁ eT+çÔá dŸ+<Š ¿î+ q dŸ+<ŠÁµ

n“ dŸ+<ŠÁ¿±+&ƒdŸ Ç>·dŸ+<ŠÁ>±¢ dŸ¾Š‹, <‘“ bÍs j ãD dŸ Ç; óŸ¼‘j ã¿£. V¯qTeT+ÔáT ~e« yîÛé+ n+Ô sTÖ ¿±+&ƒÉ y ©ˆ¿ì n<ŠÕÔá>±e]¹+# &ƒT.

# మంత్రోపాసన

హనుమన్మంత్రాన్ని ఉపాశించాలంటే బ్రహ్మచర్యం, కామ క్రోధాదుల దూరం చేసుకోవటం, సత్యం, శాంతం, దయ, ప్రేమ, మధురంగా మాట్లాడటం, ఏకాగ్రత వుంటే చాలు, మంచి ఫలితాలు కలుగుతాయి.హనుమంతుని పై అచంచల భక్తి విశ్వాసాలుంటే చాలు,నిరంతర రామ నామస్మరణ చేస్తే చాలు అవే ఆ మంత్రాలకు శాంతి. సుందరకాండ పారాయణ, హనుమాన్ చాలీసా, ఆంజనేయదండకం ను భక్తి శ్రద్ధలతో పఠిస్తే సర్వత్రా జయం. భయం వుండదు.అభయ ప్రదుడు ఆంజనేయుడే మనకు కొండంత అండ,దండ.శుచి,శుభ్రతలను శారీరకంగా, మానసికంగా అలవరచుకొని హనుమను పూజిస్తే సర్వ కార్య సిద్ధి కలుగుతుంది. సర్వోత్తమ స్థితి కల్గుతుంది.ముక్తి లభిస్తుంది. ఏక శ్లోకి సుందరకాండ " తీర్త్వా క్షార పయోనిధిం, క్షణ మథోగత్వా శ్రియ : సన్నిధిం దత్త్వారాఘవ ముద్రికా మపశుచం, కృశ్యాప్రవిశ్యాటవీం భజ్యాలానేకత రూపం,నిహత్యబహుళాం, రక్షాగణాం స్తత్పురీం దగ్ధ్వా దాయమణిం, రఘూద్వహ మగా ద్వీరో హనుమాన్ కపి : "



# ప్రార్ధనా శ్లోకాలు

1. సుగ్రీవ సచివాయాచ కపి శ్రేష్టాయ మంత్రిణే
   స్వామి భక్తాయ శాంతాయ, హనుమంతాయ నమోనమః.
2. వాయు పుత్రాయ మహావీరం అంజనానందవర్ధనం
   సీతారామ ప్రియం భక్తం తం కపీశం నమామ్యహం.
3. అంజనా నందనం వీరం. జానకీ శోక నాశనం
   కపీశమక్షహంతారం వందే లంకా భయంకరం.
4. ఆంజనేయం మహావీరం బ్రహ్మవిష్ణు శివాత్మకం
   తరుణార్క ప్రభం శాంతం రామదూతం నమామ్యహం
   ( ప్రదక్షిణ స్తోత్రం )
5. అదౌ రామ తపో వనాది గమనం – హత్వామృగంకాంచనం
   వైదేహీ హరణం – జటాయుమరణం – సుగ్రీవ సంభాషణం
   వాలీ నిగ్రహణం – సముద్రతరణం – లంకాపురీదాహనం
   ( ఏకశ్లోకి రామాయణం )
   పశ్చాద్రావణ కుంభ కర్ణ హననం – యేతద్ధి రామాయణం

# దేవాలయ చరిత్ర

## శ్రీ సువర్చలాంజనేయ స్వామి దేవాలయం

సాధారణంగా ఆంజనేయ స్వామి దేవాలయాలు భక్తాంజనేయంగానో దాసాంజనేయంగానో వీరాంజనేయంగానో ఎక్కువగా వుంటాయి. సువర్చల తో కూడిన ఆంజనేయ దేవాలయాలు చాలా అరుదు. అలాంటి అరుదైన శ్రీసువర్చలాంజనేయ దేవాలయం ఆంధ్రప్రదేశ్‌లో కృష్ణాజిల్లాలో ఉయ్యూరు మండలం లోని ఉయ్యూరు గ్రామంలో రావిచెట్టు బజారు చివర పుల్లేరు కాలువకు సమీపంలో వుంది. అది గబ్బిట వారి దేవాలయంగా ప్రసిద్ధి చెందింది. ఆ ఆలయాన్ని మా తండ్రి గారు గబ్బిట మృత్యుంజయ శాస్త్రిగారి మాతా మహులు అంటే మా నాయనమ్మ నాగమ్మగారి తండ్రిగారు గుండు లక్ష్మీ నరసింహా వధానులు గారు సుమారు రెండు వందల సంవత్సరాల క్రితం స్వంత ఖర్చులతో ఆ దేవాలయాన్ని నిర్మించి, ధూప, దీప, నైవేద్యాలకు ఏర్పాటు చేసారు. ఉత్సవ మూర్తులను కూడా ఏర్పాటు చేసి ధ్వజస్థంభ ప్రతిష్ట చేసారు.

వైశాఖ బహుళ దశమి ఆంజనేయ స్వామి జన్మదినంనాడు శ్రీహనుమజ్జయంతిని సువర్చలాంజనేయ కళ్యాణాన్ని చాలా వైభవంగా జరిపేవారట. కోరిన కోర్కెలు తీర్చే దైవం. స్వామి అందరికి అండగా వుండేవారు. ఆవరణలో ఈశాన్య భాగాన ఎత్తైన కళ్యాణ మండపం వుండేది. అర్చక స్వాములు శ్రద్ధగా స్వామి సేవ చేస్తూ తరించేవారు. నరసింహావధానుల మరణం తర్వత వారి దౌహిత్రుడిగా మా నాన్న గారు వంశ పారంపర్య ధర్మ కర్తగా వున్నారు. కార్యక్రమాలన్నీ బాగానే జరిగేవి. ఆలయం బాగా ముందుకు వుండటం, వెనుక ఖాళీ ఎక్కువగా వుండటం వల్ల ఎక్కువ మందికి దర్శనభాగ్యం కష్టంగా వుండేది. కళ్యాణం, జయంతి తప్పక జరిగేవి.రోడ్డు ఎత్తు పెరగటం ఆలయం లోతుగా వుండటం ఇంతలో ఆ రోడ్డు చివర వంతెన నిర్మాణం అయింది. అప్పుడు మా కుటుంబ సభ్యులకు, శ్రేయోభిలాషులకు, గ్రామస్తులకు బలీయమైన ఆలోచన



కలిగి, స్వామి ఆశీర్వాదబలం తోడై, ఒక కమిటీగా ఏర్పడి ఆలయ నిర్మాణం చేయాలని ధ్రుఢమైన సంకల్పం కలిగింది. వరుసగా సమావేశాలు జరపటం, చందాలు వసూలు చేయటం వసూలైన ధనాన్ని బ్యాంకులో వేయడం రసీదులు ఇవ్వటం చేసాము. దీనికి నాకు పూర్తి సహకారాన్ని అందించిన వారు స్వర్గీయ మండా వీరభద్ర రావు, సంజీవరావు, కాలికి బలపం కట్టుకొని మేము ముగ్గురం తిరిగాము. మంచి సహకారం లభించింది. ధనం పోగయింది. స్వచ్ఛందంగా ముందుకు వచ్చి ధనం అందించారు శ్రీ సుబ్బారావుగారు నిర్మాణ పర్య వేక్షణ చేసారు. స్వస్తిశ్రీ చాంద్రమాన పరాభవ నామ సంవత్సర నిజ జ్యేష్ఠ నవమీ గురువారం హస్తా నక్షత్ర యుక్త కర్కాటక లగ్న పుష్కరాంశ యందు అనగా 23-06-1988 న స్వామివారి పున: ప్రతిష్ట కార్యక్రమం వైఖానస ఆగమ విధానంలో శ్రీ వేదాంతం శ్రీ రామాచార్యులవారి ఆధ్వర్యంలో నేను నా భార్య ప్రభావతి దంపతులం స్వామివార్ల విగ్రహ ప్రతిష్ట చేసాము.

ఆ నాటి కె.సి.పి. ప్లాంట్ మేనేజర్ స్వర్గీయ ఇంజేటి జగన్నాధరావు గారు, శాసన సభ్యులు స్వర్గీయ అన్నే బాబూరావు గారు ముఖ్యులుగా విచ్చేసి కార్యక్రమానికి ఘనత చేకూర్చారు. కే.సి.పి. వారి వదాన్యత, ఉయ్యూరు చుట్టుపక్కల గ్రామస్తుల దాతృత్వం, సహాయం మరువలేము. పువ్వాడ వారు వెంట్రప్రగడవారు, ఊరవారు, చోడవరపువారు, మండావారు ఒకరేమిటి అందరూ పెద్ద మనసుతో ఈ పవిత్ర భగవత్ కార్యానికి సహకరించారు. ఉత్సవ విగ్రహాలతో, ఆలయం శోభిల్లింది. ఉచితంగా ఇసుక తోలారు కొందరు, సిమెంట్, ఇచ్చారు కొందరు. స్వామి మీద వున్న అచంచల విశ్వాసమే ఇంత పని మా అందరితో చేయించింది. మా కుటుంబ సభ్యులు ధనంతో, సేవతో సహకరించారు. అదొక పండగ గా జరిగింది.

ఆలయం బాగా ముందుకు ఉండటం, వెనుక ఖాళీ ఎక్కువగా ఉండటం వల్ల వర్షా కాలంలో నీరంతా లోపలికి చేరి చాలా ఇబ్బందిగా వుండేది. 1961 లో మా తండ్రి గారి నిర్యాణం తరువాత నేను వంశ పారంపర్య ధర్మకర్తగా

ఉంటున్నాను. ఆలయం శిథిలమై పోతోంది, ఇరుకుగా కూడా వుండటం బాధాకరంగా వుండేది. ఎన్నో సార్లు మంచి ఆలయాన్ని అక్కడే నిర్మించాలని అనుకున్నాము. మా ఒక్కరి వల్ల అయ్యే పని కాదు. అందరి సహకారం కావాలి. ప్రయత్నం చేసాం కాని స్వామి అనుగ్రహం లేనిదే ఏపనీ కాదు.

ఇంత వున్నా ధనలోపం వల్ల ధ్వజ స్థంభ నిర్మాణం చేయలేకపోయాం. అయితే ప్రతి సంవత్సరం హనుమజ్జయంతిని వైభవోపేతంగా చేసి, స్వామి వారి కళ్యాణం చేస్తూ తరించాము. భక్తులు పెరిగారు. ధనుర్మాస కార్యక్రమాలు ప్రారంభించాము. హనుమద్వ్రతం ప్రతి సంవత్సరం జరుపుతున్నాము. చిన ఓగిరాల వాస్తవ్యులు వదాన్యులు స్వర్గీయ పాలడుగు నాగేశ్వర దాసుగారు ధ్వజ స్తంభాన్ని ప్రదానం చేసారు.

స్వస్తిశ్రీ శ్రీముఖ నామ సంవత్సర జ్యేష్ట బహుళ నవమి 13-06-93 ఆదివారం ఉదయం 07-29 గంటలకు ఉత్తరాభాద్ర నక్షత్ర యుక్త మిధున లగ్న పుష్కరాంశ లో ధ్వజ ప్రతిష్ఠా మహోత్సవం అత్యంత వైభవంగా జరిగింది. శ్రీ దొడ్డా వెంకట రత్నం దంపతులు, శ్రీ పరాశరం రామ కృష్ణ మాచార్యుల వారి ఆధ్వర్యంలో ధ్వజ ప్రతిష్ట జరిపారు. ఎందరో వదాన్యులు సహకరించారు. ఇత్తడి తొడుగు కూడా వేయించాము. మండా వీరభద్రరావు, సంజీవరావు గార్ల, అవిశ్రాంత కృషి అనుక్షణ పర్యవేక్షణ నాకు కొండంత బలం. వారి సేవలు మరువ లేనివి. నిత్యం వందలాది భక్తులు శ్రీ సువర్చలాంజనేయ స్వామి వార్లను సేవించి తరిస్తున్నారు.

తమలపాకుల పూజ, పండ్లతో పూజ గంధ సింధూరంతో అర్చనా, విశేషంగా జరుగుతాయి. ధనుర్మాసం నెలరోజులు వేలాది మంది ప్రదక్షిణలు చేసి, తమ మనోభీష్టాన్ని స్వామి వారికి నివేదించుకొని సఫల మనోరధులవు తున్నారు. భక్తుల పాలిటి కొంగు బంగారం స్వామి, భోగినాడు శాంతి కళ్యాణం జరుగుతుంది. ఒంటె వాహనంలో ఊరేగింపు చేస్తాము. లడ్డులతో ప్రత్యేక పూజ, కాయ గూరలతో విశేష అర్చన చూడ ముచ్చటగా వుంటుంది. భజనలు,



హనుమాన్ చాలీసా పారాయణ, విష్ణు, లలితా పారాయణ సామూహిక కుంకుమ పూజలు ఈ ఆలయంలో ప్రత్యేకత. మన్యు సూక్తంతో స్వామివారికి అభిషేకం జరుగుతుంది. మూడు సంవత్సరాల క్రితం పదకొండు రోజులు ప్రత్యేక కార్యక్రమం నిర్వహించాము, పునర్నిర్మించి ఇరవై ఏళ్ళు అవుతున్న సందర్భంగా ప్రతి రోజు ఉదయం మన్యుసూక్తం స్వామి వారికి అభిషేకం, హెూమం, సహస్ర నామార్చన, సాయంత్రం మళ్ళీ హెూమం, శాంతి, కళ్యాణం అపూర్వ స్పందన లభించింది.

శ్రీ స్వర్ణ నాగేశ్వరరావు గారి నేతృత్వంలో, ఏలూరు వేద పండితుల ఆధ్వర్యంలో మహత్తరంగా పదకొండు రోజుల కార్యక్రమాలు జరిగాయి. మంచి సహకారం లభించింది. రోజు మా దంపతుల తో పాంటు ఒకరిద్దరు దంపతులు కూర్చుని స్వామివార్ల కళ్యాణం చేయటం మహద్భాగ్యంగా భక్తులు భావించారు. ఆలయంలో అన్ని సౌకర్యాలు కలిగించటానికి భక్తులు సహకరిస్తున్నారు.

ఈ విధంగా ఉయ్యూరులోని శ్రీసువర్చలాంజనేయస్వామి ఆలయ ధర్మకర్తగా స్వామివారి సేవలో నా జీవితాన్ని పండించుకుంటున్నాను. సర్వజనా సుఖి:నోభవంతు. విశ్వశాంతిరస్తు. లోకకళ్యాణమస్తు.

మీ

**గబ్బిట దుర్గాప్రసాద్**

ఆలయ ధర్మకర్త

# సువర్చలాంజనేయం -I

శ్రీ ఆంజనేయుడు అంజనాదేవికి, కేసరికి జన్మించిన కుమారుడు. బుద్ధిమంతుడు, బలవంతుడు, ప్రతాపశాలి .ఆయనకు చిన్నతనంలోనే వ్యాకరణం నేర్చుకోవాలని కోరిక కలిగింది.వ్యాకరణం అంటే ఒక్కటేకాదు. నవ విధ వ్యాకరణాలున్నాయి అవి పాణినీయం, కలాపము, సుపద్మము, సారస్వతము, ప్రాతి శాఖ్యము, కుమారవ్యాకరణము, ఇంద్రము, వ్యాఘ్రభౌతికము శకటాయనము. ఇవన్నీ నేర్చుకున్న వాడిని నవ వ్యాకరణ పండితుడు అంటారు. వీటిని పూర్తి అధ్యయనము చేసి అధ్యాపనం (నేర్చుకోవటం, బోధించటం) చేయగల నేర్పు వున్న వాడు సాక్షాత్తు ఆ సూర్య భగవానుడే, హనుమంతుడు సూర్యుని దగ్గరకు వేళ్ళి తనకు వ్యాకరణాలు బోధించమని వేడుకున్నాడు. సూర్యుడు “నేను ఉదయం నుంచి, సాయంత్రందాకా తూర్పు నుంచి పడమరకు ప్రయాణం చేస్తుంటాను. నిలకడగా ఒక చోట ఉండును. నీకు నేర్పడం ఎలా సాధ్యం ? ” అన్నాడు. దానికి మహా మతిమంతుడైన హనుమాన్ “స్వామీ ! నేను ఒక కాలు తూర్పు కొండమీద, రెండోకాలు పడమటి కొండమీద వుంచి మీతోనే వుంటాను. కనుక నేర్పండి.” అన్నాడు సరేనని అయిదు వ్యాకరణాలు నేర్పాడు. మిగిలినవి కూడా నేర్పమని అడిగాడు. మారుతి మిగిలినవి వివాహం అయినవారికే నేర్పాలి అన్న నియమం వుంది అన్నాడు గురువు. నేను బ్రహ్మచారిని కదా ఎలా సాధ్యం ?” అని అడిగాడు వాయు సుతుడు. అయితే దీనికి ఒక పరిష్కారం వుంది.

“ మా అమ్మాయి సువర్చలాదేవిని నీకు ఇచ్చి వివాహం చేస్తాను. అప్పుడు మిగిలిన వ్యాకరణాలు నేర్పుతాను ” అన్నాడు రవి. ఇంతకీ సూర్యుని కుమార్తె ఎవరు ? ఎలా పుట్టింది ? అని అనుమానం వచ్చింది. హనుమకు అప్పుడు సూర్యుడే సందేహ నివృత్తి చేసాడు. తాను చాలా తీవ్ర తేజంతో జ్వలిస్తుంటే తన భార్య ఛాయాదేవి భరించలేక పోయిందని ఆమె తండ్రి ,తమ మామగారు మయుడు తనను సాన పట్టాడని తీవ్రత తగ్గిందని, సాన పట్టగా వచ్చిన రజను ఒక రాశిగా ఏర్పడిందని దేవతల వర ప్రభావంతో ఆ రాశి నుంచి మంచి వర్చస్సు, దేహ కాంతి, తేజస్సుకల అపురూప సౌందర్య రాశి ఆవిర్భవించిందని, ఆమెయే తమ కుమార్తె సువర్చల అని వివరంగా చెప్పాడు సూర్యుడు. మంచి వర్చస్సు వుండటం చేత సువర్చలగా నామకరణం చేసామని చెప్పాడు. ఆమెను వివాహం చేసుకోమని కోరాడు. సరేనని ఒక షరతు పెట్టాడు హనుమ.తాను వివాహం అయినా, బ్రహ్మచారిగానే ఉంటానని దాంపత్యసౌఖ్యం ఉండదని తన కుమార్తెకు విషయం చెప్పి ఆమె అంగీకరిస్తే తాను వివాహం చేసుకుంటానని నిర్మోహమాటంగా చెప్పాడు. సువర్చలకు, బలశాలి, మతి మంతుడు, బుద్ధి మంతుడు తనకు భర్తగా లభించటం తన అదృష్టమని దాంపత్య సుఖం లేకపోయినా ఆయన్నే వివాహం చేసుకుంటానని చెప్పింది. ఆమెతో హనుమకు వివాహం జరిపించి మిగిలిన నాల్గు వ్యాకరణాలు నేర్పాడు సూర్యుడు. హనుమ నవ వ్యాకరణ పండితుడు అయ్యాడు .

# శ్రీ హనుమ గుణగానం

**01 – సుందర హనుమాన్**

"సుందరే సుందరే రామ: సుందరే సుందరీ కథా
సుందరే సుందరీ సీతా సుందరే సుందరం వనం
సుందరే సుందరం కావ్యం సుందరే సుందర: కపి:
సుందరే సుందరం మంత్రం సుందరే కిం న సుందరం".

**02 – సీతా రామ ప్రియ హనుమాన్**

సీతా రామ పదాంబుజే మధుపవత్ యన్మానసం లీయతే
సీతారామ గుణా వళీ యజ్జిహ్వాయాపీయతే
ఆంజనేయం మహావీరం బ్రహ్మ విష్ణు శివాత్మకం
తరుణార్క ప్రభం శాంతం రామదూతం నమామ్యహం

**03– ఏక శ్లోకి రామాయణం**

అదౌ రామ తపోవనాది గమనం –హత్వా మృగం కాంచనం
వైదేహీ హరణం జటాయు మరణం –సుగ్రీవ సంభాషణం
వాలీ నిగ్రహణం సముద్ర తరణం –లంకాపురీ దాహనం
పశ్చాద్రావణ కుంభకర్ణ హననం – ఏతద్ధి రామాయణం.

**04– ఏక శ్లోకి సుందర కాండ**

తీర్త్వా క్షార పయోనిధిం – క్షణ మధో గత్వా శ్రియ:సన్నిధిం
దత్వా రాఘవ ముద్రికా మపశుచం – కృత్వా ప్రవిశ్యాటవీం
భంక్త్వామ్ అనేకతరూం నిహత్య బహుళం రక్షో గణం తత్పురీం
దఘ్వాదాయ మణిం రఘూద్వాహ మహద్వీరో హనూమాన్ కపి:



**05– ఆంజనేయ స్తుతి**

ఆపదామపహర్తారం దాతారం సర్వ సంపదాం
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహం

06– అతులిత బల ధామం స్వర్ణ శైలాభ దేహం
దనుజ వరక్రుశానుం జ్ఞానినామగ్రగణ్యం
సకల గుణ నిధానం వానరాణామధీశం
రఘుపతి ప్రియభక్తం వాత జాతం నమామి

07– గోష్పదీకృత వారాశిం మశకీకృత రాక్షసం
రామాయణ మహా మాలా రత్నం వందే అనిలాత్మజం

08– యత్ర యత్ర రఘునాధ కీర్తనం
తత్ర తత్ర కృత మస్తకాంజలిం
బాష్ప వారి పరిపూర్ణ లోచనం
మారుతిం నమత రాక్షసాంతకం

# శ్రీఆంజనేయ స్తుతి

01 – కపివరేశ్వరం, కామితార్ధదం, త్రిపురహాత్మజం, దీన పోషకం
విపుల వక్షసం, విమల చేతసం, కామితార్ధదం, కమల లోచనం

02 – పవననందనం, పావకప్రభం, భవ విదారణం, భాగ్య కారణం
ప్లవగానాయకై ర్భావితోద్యమం, నవకవిత్వవాజ్ఞాయకం భజే.

03 – అంజలి గ్రహేణాత్మ దైవతం, మంజు భాషి తైర్మానవోత్తమం
రాజయన్ సదా, రామభూపతిం, అజ్ఞనాయశ: పుజ్ఞమాశ్రయే

04 – సుందరాననం, సూర్యతేజసం నందినాథ వన్నందితాఖిలం
మందరాద్రి వద్బంధు రాక్రుతిం వందితం భజే వానరోత్తమం.

05 – కనక కుండలం, ఘనతరాన్గకం దనుజ నాశనం, ధర్మ విగ్రహం
జనకకన్యకా చరిత మంగళం, మనుమహోజ్జనా మారుతాత్మజం

06 – శృతి రసాయనం, స్తుతి పరాయణం, అతుల విక్రమం, ఆర్త త్రారణం
కృతజగత్త్రితం, కేసరీప్రియం, మతిమతాం వరం మానదం భజే.

07– నిబిడముష్టినా, నిహతరావణం, ప్రబల భావనాభావి పద్మజం
కబళితారుణం, గాన లోలుపం, వి బుధతోషకం, వీరమాశ్రయే.

08 – పరమపావనం, పార్వతీ సుతం, నిరుపమాజసం, నిర్జితేంద్రియం
ఖరనఖాయుధం, కామరూపిణం, సురపతిస్తుతం, శూరమాశ్రయే.

# శ్రీ హనుమద్రప్మి మాలా

స్ఫటిక రజత వర్ణం, మేఖలా బ్రహ్మ సూత్రం
కర ద్రుత జప మాలం, బద్ధ పద్మాసనస్తం
హృది రఘువర, వర మూర్తిం, సుస్తిరీ కృత్య విశ్వం
క్రుతమివ గణ యంతం, చింతయే ద్వాయు పుత్రం



# హనుమంతుని వాహనమ్ ఒంటె (ఉష్ట్రం)

శ్రీ హనుమాన్ విగ్రహం ముందు ఒంటె ను వుంచి పరమ ప్రీతి తో పూజ చేసే అతనికి అన్ని కోరికలు తీరుతాయని పరాశర సంహిత లో వుంది.

" హనుమత్పురో దివ్యం ఉష్ట్రం సంస్తాపాయో ద్విజ:
పూజయేత్పరమ ప్రీత్యా, సంప్రాప్నోతి మనోరధాన్
చక్ర ప్రాణ ప్రతిస్టాయై కర్మ నిర్వర్త్య విధి పూర్వకం
అంగుస్టం, చక్ర మధ్యేతు, నిక్షిప్య విధి పూర్వకం
ప్రజపే న్మంత్ర గాయత్రీ మస్టోత్తర శతం ద్విజ: ".

# స్వేతార్క హనుమాన్

" శ్వేతార్క మూల ప్రతిమా, పూజ్యతే హనుమన్మయా
గృహే తస్యా చిరేనైవ సుసిద్ధా సర్వ సంపద: "

భావం -- శ్వేతార్క ( తెల్ల జిల్లేడు ) వేరుతో హనుమను ఉపాశించి శంకరుడు త్రిపురాశుర సంహారం చేశాడట. కనుక వీలున్నప్పుడు తెల్లగన్నేరు వేళ్ళతో (108) పూజ చేస్తే కోరిన కోరిక తీరుతుంది.

# పంచ భూతాత్మక హనుమ

"ఒక భూతంబున (వాయువు) కుద్భవించి, మరి ఇంకో దాని ( ఆకాశం) పై కేగి, ఇంకొక దానిన్ (నీరు – సముద్రం) దరి ఈడ్చి, వేరొకట ర క్షోదేశమున్ గాల్చి (అగ్ని), వేరొక భూతంబు (భూమి) తనూజ గుర్రైరిగి (సీత) పేరుంగాంచి, భూత ప్రపంచక రూపాత్మకుడైన మారుతి, సమస్త్రారాధ్య డైంబగున్ .

**రచన – ఆచార్య ఎస్వీ .జోగారావు.**

# శ్రీ పంచముఖ ఆంజనేయ స్వామి స్తోత్రం

వందే, వానర, నారసింహ, ఖగ రాట్, క్రోడాశ్వ, వక్రాంన్వితం
నానాలంకారణం, త్రి పంచ నయనం, దేదీప్య మానం రుచా
హస్తాబ్జై: అసి, ఖేట, పుస్తక, సుధా కుంభాం, కుశాద్రీన్ హలం
ఖట్వాంగం, మణి, భూరుహం, చ దధతం సర్వారి గర్వా పహం ".

భావం – వానర, నారసింహ, గరుడ, సూకర (వరాహం), అశ్వ అనే అయిదు ముఖాలతో, అనేక అలంకారాలతో, దివ్య కాంతి తో, దేదీప్యమానమైన 15 నేత్రాలు, పద్మాలవంటి హస్తాలు, ఖడ్గం, డాలు, పుస్తకం, అమృత కలశం, అంకుశం, పర్వతం, నాగలి, మంచంకోడు ( ఖట్వాంగం ), మణులు, ధరించిన వాడు, సర్ప శత్రువు అయిన గరుత్మంతుని గర్వాన్ని హరించిన వాడు అయిన హనుమంతునికి నమస్కారం.

# సాలగ్రామ శిలా మూర్తి

" శ్రీ హనుమాన్ సాలగ్రామ మూర్తి చాలా ఆశ్చర్యం కలిగించే ప్రతిమ, శిరస్సు దక్షిణ భాగం లో గుండ్రని చక్రం, దానికి ఎడమ వైపు బాణపు దెబ్బ తగిలిన, ఆవు గిట్ట చే ఏర్పడ్డ నీటిపాయ, సూక్ష్మ పంజరం, మాలికా రూపం మైన వాలం (తోక), అనేక శిఖరాలు సూక్ష్మమైన విల్లు ఆకారం, ముఖం పై రెండు చక్రాలు, చిన్న పుష్కరం (ఆకాశం, తామర ) కల్గి మంత్ర స్వరూపం గల శ్రీ హనుమానుని సాలగ్రామ మూర్తి ప్రకాశిస్తుంది " అని పరాశర సంహిత లో వుంది.

" శిరసో దక్షిణే భాగే పృధు చక్ర సమన్వితం
తద్వామే,శర ఘాతేన ,గోఖుర హ్రద బంధురం
సూక్ష్మ పంజర సంయుక్తో ,మాలికా వాల సంయుతం
బహు శ్రుంగ యుతశ్చైవ,సూక్ష్మ కార్ముక రేఖక:
ముఖ చక్ర ద్వయం ,సూక్ష్మ పుష్కరో మనురా క్రుతిహ్ "



# శ్రీ రాముడు స్తుతించిన హనుమ

రామ రావణ యుద్ధం అయిన తర్వాత శ్రీ రాముడు శ్రీ ఆంజనేయ పరాక్రమాన్ని కీర్తిస్తూ " నీ సహాయం యమ, ఇంద్ర, ఉపేంద్ర, కుబేర, మొదలైన లోక పాలకులలో కూడా కన్పించదు " అన్నాడు.

" న కాలస్య, న శక్రశ్య, న విష్ణో ర్విత్త పశ్యచ
కర్మాణి తాని శ్రూయంతే, యాని యుద్ధే హనూమత: "

శ్రీ రామునికి, హనుమకు భేదం లేదు

శ్రీ రామునితో హనుమ ఇలా చెప్పాడు " రామా ! దేహ దృష్టితో చూస్తే నేను నీ దాసుడను. జీవ రూపం లో చూస్తే నేను మీ అంశను. పరమార్ధ దృష్టి తో చూస్తే నేనూ మీరు ఒకటే " అని నిశ్చయం గా చెప్పిన మహాయోగి పుంగవుడు హనుమ.

" దేహ ద్రుష్ట్యాతు దాసోహం – జీవ దృష్ట్యా త్వదంశక:
వస్తు తస్తు " త్వమే వాహం " ఇతి నిశ్చితా: మతి: "

# ఆంజనేయ స్తుతి సుప్రభాతం

వాత్సల్య మూర్తిం అవనీ తనయాపతిం తం
వాతాత్మజంచ పరిభావ్య ముదాస్తవేన
సంభావయే సకలలోక సుఖానుభూతి సంధాయకం
భవతు మారుతి సుప్రభాతం

రామాయణస్య పఠనే రఘునాథ నామ సంకీర్తనే
సవిధమేష్యతి వాయు సూనుహు
సంభావయం మనసి భక్తి యుతస్తువేతం
శ్రీరామ భక్త భావ తాదిహ సుప్రభాతం

ఇయం వాయు సూను మనిషం విభుదాభజన్తీ
కామాద్య రాదిచయ నాశకరం సుభక్త్యా
సంస్తాపయం మనసి భావనయా స్తువేతం
శ్రీరామ భక్త భవ తాదిహ సుప్రభాతం.

శ్రీ గంధ మాదన మహాగిరి శృంగవాసం
శ్రీరామనామ్ని ధృతమానస మాన్జనేయం
భక్తాగ్రిమం హ్రుదినిధాయ ముదాస్తువేతం
శ్రీరామ భక్త భవ తాదిహ సుప్రభాతం .
పాదానతేషు కరుణార్ద్ర మతీవ శాంతం
తేభ్యస్తు అభీష్ట వరదం రఘునాథ భక్తం
తమ్ లోకయం మనసి భావనయాస్తువే భో
శ్రీరామ భక్త భవ తాదిహ సుప్రభాతం

శ్రీ మారుతి ర్విజయతే వినతాత్మ జాత
దుర్గర్వ హుంకృతి వినాశక సత్వభూమ
తం స్వాత్మవాస మభివీక్ష పురస్తు తే భోహ్
శ్రీరామ భక్త భవ తాదిహ సుప్రభాతం.



ధర్మాత్మ జానుజ నిజానుజ బాహువీర్య
సంశోధకో విజయతే పవమాన పుత్ర:
సంస్తౌమి దాశరధి నిష్టమతిం ముదాత్తం
శ్రీరామ భక్త భవ తాదిహ సుప్రభాతం.

యే వాతరోగ వివశా నితరాం ప్రతప్తా:
తే మారుతిం స్పదుధ భక్తి భరా భజంతు
తాంపాహి గంధవహ పుత్ర భజే భవంతం
శ్రీరామ భక్త భవ తాదిహ సుప్రభాతం.

భూమౌ విమాన గమనే తరణీ ప్రయాణే
సుప్రభాత మిహ జాయతా మయి సుచీంద్ర వాస హనుమన్ విభో
దక్షిణాబ్ధి మతి లంఘ్య రావణ పురీం ప్రవిస్య తర సా భవాన్
తాం అశోక వనికా స్థితాం అతిద్రుశాం దదర్శ దరణీ శుతాం
సాంజలిహి త్వమవ దస్చుతా రఘువరస్య దూత ఇతి సాదరం
సుప్రభాత మిహ జాయతా మయి సుచీంద్ర వాస హనుమన్ విభో

వాచికం తదనుతాం నివేద్య రమనాస్గులీయకం అదా తత:
తం నిరీక్ష్య రుదతీ భవంత మవదచ్చ సా నిజమనోవ్యధాం
స్వంప్రదాయచ వతం సమాశు విససద్య దూతవరం అంజసాం
సుప్రభాత మిహ జాయతా మయి సుచీంద్ర వాస హనుమన్ విభో

తత్ర రాక్షసపురే నిజా గమనం ఆసరేశ మవ బోధయన్
మర్దితాం అకృత తాం అశోక వనికాం అవైచ్చ తచ రావణం
రాక్షసేస నగరం భవాన్ అదహ దిత్యహూ విజయతే తరాం
సుప్రభాత మిహ జాయతా మయి సుచీంద్ర వాస హనుమన్ విభో

ఉత్ప్లుతస్తదను తత్ పురన్నాను మహేంద్ర శైల తద మాగత:
తోషితైస్చ కపి సత్తమైహి దినకరాత్మజస్య సవిధం గత:
తత్ర రాఘవమపి ప్రణమ్య నిజగాధ వృత్తం అఖిలం భవాన్
సుప్రభాత మిహ జాయతా మయి సుచీంద్ర వాస హనుమన్ విభో

రాక్షసీయ పుర మర్దకో జనక నందనాస్తితి నివేదకో
దాయకో ధరణి జావతంశం అథ వాచికం రహసి బోధక:
సర్వవేవ విజయవహం తవహి ప్రప్రధే జగతి సంస్థువే
సుప్రభాత మిహ జాయతా మయి సుచీంద్ర వాస హనుమన్ విభో

ఆకాశ మార్గ చారి వేదాంత బ్రహ్మచారి ॥
దిగ్మాంశు కుల తిలక పదయుగళ భక్త:
సూర్యాత్మజస్య మంత్రీ సుగ్రీవ సఖ్య ముఖ్య:
నిగమగణ విద్యార్థీ నిరుపమో నిర్గుణ:

ఘోరే వనేచ కృపయా పరి రక్షకం తం
భక్త్యా ప్రణమ్య పవమాన సుతం స్తువే భోహూ
శ్రీరామ భక్త భవ తాదిహ సుప్రభాతం.
వేదోక్త తత్వ మఖిలం మనసా స్మరంతం

సత్యం వదంత మధ సత్వగుణ ప్రధానం
భక్త ప్రియంచ హనుమంత మహం స్తువేభోహూ
శ్రీరామ భక్త భవ తాదిహ సుప్రభాతం.
సూతికా భవన శాయతోపి ససమీక్ష్య వాలరవి మండలం
ఖాలితుం తమభిలాషు కో గగన ముత్కుతస్య ఫల సంగయామి
తత్ర శక్రపవినా నికృత్త హనుమాన్జనేయ మిహ భావయే
సుప్రభాత మిహ జాయతా మయి సుచీంద్ర వాస హనుమన్ విభో.

బాలినా సపది ధావితేన రవి శూనున సభయ లోకితౌ
రామ లక్ష్మణ సహూదరౌ తదను నీతవాం రవి సుతాందికం
తత్ర రామ కపి ముఖ్య సఖ్య విషయే వ్యరాజతా పురోహిత:
సుప్రభాత మిహ జాయతా మయి సుచీంద్ర వాస హనుమన్ విభో.

రావణం నిజబలిష్టవాల నిగళే బబంధ మఖ వత్సుత:
తం తుకీశం అతి రంభసం లఘు జఘాన మిత్ర సుత రక్షక:



తాద్రుశే రఘువరే సదా నిహిత మానసం పవనజం భజే
సుప్రభాత మిహ జాయతా మయి సుచీంద్ర వాస హనుమన్ విభో.

ఆజ్ఞాయా కపివరాం దిశాస్య ధనియుక్తవాం సవిత్రు నందన:
సాదరం నిజక రాంగులీయక మదాత్త దాతవ రఘూత్తమ:
పూచి వానపిచ వాచికం రహసి కర్ణయోహూ తవ హరే భజే
సుప్రభాత మిహ జాయతా మయి సుచీంద్ర వాస హనుమన్ విభో.

మైధిలీపతి కరాంగులీయ మధ ధారయం త్వ మనుగైస్సమం
సంచరం వత జటాయు పూర్వజ మవైక్ష తాస్చ జలధేస్తటే
తస్య వాచ మనుస్మృత్య హోతరితు ముద్యతో జలనిధిం భవాని
సుప్రభాత మిహ జాయతా మయి సుచీంద్ర వాస హనుమన్ విభో.

తత్రైకసీ జనక వాక్యం తథాహితతరం కుంభ కర్ణ కధితం
గృత్వా నిరర్థమితి యుద్ధాయ రాక్షస గణాన్ ప్రై శ్ర యద్దశ ముఖ:
యుద్ధేబహూన్ నిశిచరాన్అంత్య ప్రుత్తి మనయత్ మారుతే ఖలు భవాన్
బిల్వాద్రినాధ పదభక్త ప్రభో వితనుతాత్ సుప్రభాత మనిషం

అఘ్నుం దశాస్యభట వీనాం అమాత్య బల ముఖ్యా: చవానర వరా:
తం కుంభ కర్ణ మపి యుద్ధాంగణే అర్కజపురం నీత వాం రఘుపతిహి
శేషాం దశానన కనిష్టానుగాం త్వమమధీహి మారుతే విజయసే
బిల్వాద్రినాధ పదభక్త ప్రభో వితనుతాత్ సుప్రభాత మనిషం

శ్రుత్వా సమేఖ నినదహ కుంభ కర్ణ వధవృత్తాంత మాశు కుపితో
బ్రహ్మాస్త్ర మంత్రం ఉపయుజ్య అఖిలైహి కపి సమూహైహి అహన్
రఘువరౌ యేతౌ కపీనపి తథారక్షితుం తం వృషభాద్రిం గత: ఖిల భవాన్
బిల్వాద్రినాధ పదభక్త ప్రభో వితనుతాత్ సుప్రభాత మనిషం

తం పర్వతంతు మృత సంజీవనీ సహితం ఉధృత్య సంఘ రఘువం
నీత్వా అస్త్ర బంధన విముక్తాం జగారచ భవాన్ రాఘవౌ కపివరాం
ఆరూహ్యా తావక గళం లక్ష్మణ స్తమవ దీహి రావణంకృత మతిహి
బిల్వాద్రి నాధ పద భక్త ప్రభో వితనుతాత్ సుప్రభాత మనిషం

యమ ధర్మ లోక గమనం నిషమ్య తనయస్య రాక్షస పతిహి
పరితప్య భూమి తనయాం నిహంతు అగ మధ్య కోప కలుష:
అధయోద్ధు మాగతం అవేక్షతం సమవ బోధయం రఘువరం
హనుమన్ విదేహి రఘునాధ భక్త వర సుప్రభాత మనిషం

దశ కంధరం త మభి వీక్ష్య సంగతలే రధే రఘుపతి
శర సంజయైహి నిచిత మాడతాన లఘు తస్య గాత్ర మఖిలం
అధిరూహ్యా వాయు సమగా మిన: తవగళం హరే రధసమం
హనుమన్ విదేహి రఘునాధ భక్త వర సుప్రభాత మనిషం

తద నంతరం విజయహోమ కర్మణి సముద్యతే దశ ముఖే
సహసా భవాం కపి వరైరపి పకృత హోమ విఘ్నం అకరోత్
నతజన శుభంకర: భక్తి నత శీర్షక:
లౌకికాతీత మూర్తి: శ్రీరామ భక్తా గ్రిమ:
తం భజే దైనందినం సుప్రభాతం సంస్మరం – సుప్రభాతం సంస్మరం
త్రైలోక్య పూజ్య మానో వాతాత్మజా విజయతే
వాతాత్మ జాదఖిలం ఆకర్ణ్యతాం జనక జాయా: స్థితిం రఘువర:
సుగ్రీవ ముఖ్య కపివీరే ర్విచింత్య కరణీయం తదా నిరచినోత్
రామాజ్ఞయా తదను లంకాపురీ వివరణం విస్తరేణచ కృషే
బిల్వాద్రినాధ పదభక్త ప్రభో వితనుతాత్ సుప్రభాత మనిషం

ఉత్తంత్వ యేర్ధమధ లంకాపురస్య దహనానంతరం ద్రుతత రం
శిల్పిమయో రచిత వాన్ తత్పురం పునర తీవాద్భుతం ద్యుతిమయం
నక్తంచరేశ పుర రక్షా విధానమపి సమ్యన్ని వేదిత మహోహ్
బిల్వాద్రినాధ పదభక్త ప్రభో వితనుతాత్ సుప్రభాత మనిషం

ఆరూఢవాన్ రఘువరోంశే తవాంగద గళే లక్ష్మణ: కపిపరైహి
సాగం తతో లవణ స్సింధోస్థటే అధ్వ పరిఖేదస్య శాంతి మకరోత్
రామస్య వాచ మనుదూతం శుకం సపతి బధ్వ భవాన్ విజయతే
బిల్వాద్రినాధ పదభక్త ప్రభో వితనుతాత్ సుప్రభాత మనిషం



రత్నా కరాధిపతి వాక్యేన తేన నళ ముఖ్యో వలీ ముఖ గణ:
సేతుం బబంధచ సముద్రే దశానన పురీం ప్రాప్తుమాశు సృదుఢం
కాకుస్థ పాద శరణాప్తిం విభీషణ మహూ నీతవాన్ నను భవాన్
బిల్వాద్రినాధ పదభక్త ప్రభో వితనుతాత్ సుప్రభాత మనిషం

దృష్ట్వా వలీ ముఖ బలీహి రాఘవం నిజపుర ద్వారీ రాక్షస పతిహి
లంకా వినాశన నిమిత్తం సఖీశ ఇతి నిక్షిబ్ధ రోష కలుష:
ఆజ్ఞాపయం నిజభటాన్ హంతు మేవ హనుమంతం కపీం రఘువరౌ
బిల్వాద్రినాధ పదభక్త ప్రభో వితనుతాత్ సుప్రభాత మనిషం

రామో దశానన పురీం ఆగత: ఖలు విధాతుం నిశాట నిధనం
పౌత్రాయ యుక్త మధవక్తుం తధా పురమగాత్ మాల్యవాన్ శమధన:
మార్గే సవైక్షత భవంతం స పశ్చిమ పుర ద్వారీ సైన్య సహితం
బిల్వాద్రినాధ పదభక్త ప్రభో వితనుతాత్ సుప్రభాత మనిషం

రణ భూతలం ప్రతి సమాగతో దశముఖస్తత: అతి కుపితో
హనుమన్ విదేహి రఘునాధ భక్త వర సుప్రభాత మనిషం

రఘు రామ రావణ రణే దశస్య మవ ధీత్తతో రఘుపతిహి
దహన ప్రవేశ పరి పావనీ జనక నందినీ చ జగృహే
తవ దూత్య సేవన మతీవ భాతి భువనే సదాపి సుమతే
హనుమన్ విదేహి రఘునాధ భక్త వర సుప్రభాత మనిషం

వనవాస కాల పరమావధో ప్లవక పుంగవై రఘువరో
రజనీ చరేశ్చ సహిత: స్వరాజ్య మగమత్ ధరా తనయయ
రహిత స్స్వ మంత్ర సకలం నివేదయింతు ఆంజనేయ భరధం
హనుమన్ విదేహి రఘునాధ భక్త వర సుప్రభాత మనిషం

సహోదరై సమంతత: పురం ప్రవిస్య రాఘవో
రరాజ రాజ్య రక్షణాత్ ప్రజా స్సదాపి రాజయన్
భవాన ముష్య చాగ్ర స్థితిం స్థితా కరుత్యహూ
మరుత్త నూజ దూత వర్య సుప్రభాత మర్ధయే

అధిగతా సువాసరే ధరా సుతా దధౌఛతే
రఘుత్తమ ప్రదత్న రత్న మాలికాం సుశౌభనాం
గళేముదా తయాహరే విభూషితం విభావయే
మరుత్త నూజ దూత వర్య సుప్రభాత మర్ధయే

తవ ప్రమాష్టమే వదుర్మదం హినేతు సంగమే
ప్రతిష్టిత పురాంతకొ రఘూత్త మేన మారూతే
స్మరం రఘుత్తమం భవంత మప్యముం పురాంతకం
మరుత్త నూజ దూత వర్య సుప్రభాత మర్ధయే

యతో నరా రాఘూత్తమం ప్రకీర్త యంతి భక్తి త:
త తో భవాన్ విభాతి భూతలే మహాన్ మహా మతే
విదేహ జావరం స్మరం భవం తమప్య నారతం
మరుత్త నూజ దూత వర్య సుప్రభాత మర్ధయే
యస్య కుక్షౌ సమా విష్టా: లోకావై భూర్భు వాదయ:.



# శ్రీ హనుమ గుణ గానం

పరాశర సంహిత నుండి సంగ్రహింపబడింది.

01- నమస్సు మణి కుండలం, నయన పుష్ప వన్మండలం
హృది ప్రేణత వాతాంజలిం, శ్రిత సురాసు రేంద్రామ్జలిం
సహార మణి భూషణం, సరస భక్త సంతోషణం
హనుమ దభిదం, హరం, హరిం, విరించి స్వయం భజే ."

02 - " సీతా రాఘవ దత్త మౌక్తిక, లసద్ధారా వళీ శోభితం
హస్తాంభోజ పరాభయాంకిత, మనేకాకల్ప రత్నోజ్వలం
వాలా వేష్టిత మౌళి మీశ్వర తనుం, భాక్తాన కల్ప ద్రుమం
రాజన్మౌంజి, యజనోప వీత మనిషం, శ్రీ ఆంజనేయం భజే.

03 - "బాలార్క యుత తేజసం, త్రిభువన ప్రక్షోభకం సుందరం
సుగ్రీవాది సమస్త వానర గణై, స్సంసేవ్య పాదాంబుజం
నాదేనైవ సమస్త రాక్షస గణా స్సంత్రాస యంతం
శ్రీ మద్రామ పదాంబుజ, స్మృతి రతం ధ్యాయామి వాతాత్మజం .

04- నిత్యం వా సుఖితా స్సంతి, తం నమామి జగద్గురుం
యస్య ప్రాసాదా న్మర్త్యా వై, మృత్యుం జయతి మానవ:.

05- తమేవాహం నమస్కుర్యాం, జరామరణ వర్జితం -
హనూమన్మూర్తాయే, తస్మై నర నారాయనాత్మనే.

06- అంజనా గర్భ సమ్భూతో, రాక్షసం, విధ హేతవే
పంపా తీర నివాసాయ, మారుత్యై చ నమోనమ: .

# శ్రీ ఆంజనేయ దండకము

శ్రీ ఆంజనేయ దండకము విని తరించండి

శ్రీ ఆంజనేయం ప్రసన్నాంజనేయం, ప్రభాదివ్య కాయం, ప్రకీర్తిప్రదాయం భజే వాయు పుత్రం, భజే వాలగాత్రం, భజేహం పవిత్రం, భజే సూర్య మిత్రం భజే రుద్రరూపం, భజే బ్రహ్మతేజం బటంచున్ ప్రభాతంబు సాయంత్రమున్, నీనామ సంకీర్తనల్ చేసి నీరూపు వర్ణించి, నీమీద నే దండకం బొక్కటిం జేయ నూహించి, నీమూర్తినిన్ గాంచి, నీ సుందరం బెంచి, నీదా సదాసుండ నై, రామ భక్తుండనై, నిన్ను నే గొల్చెదన్, నన్ కటాక్షంబునన్ జూచితే, వేడుకల్ జేసితే, నామొరాలించితే, నిన్ను రక్షించితే, అంజనా దేవి గర్భాన్వయా ! దేవ ! నిన్నెంచ నేనెంత వాడన్ దయాశాలి వైచూచితే, దాతవై బ్రోచితే, దగ్గరన్ నిలిచితే, తొల్లి సుగ్రీవుకున్ మంత్రి వై, స్వామి కార్యార్థ మందుండి, శ్రీ రామ సౌమిత్రులం జూచి, వారిన్ విచారించి, సర్వేశు పూజించి, యబ్బానుజున్ బంటు గావించి, యవ్వాలినిన్ జంపి, కాకుస్థతిలకున్ దయాదృష్టి వీక్షించి, కిష్కింధకే తెంచి, శ్రీ రామ కార్యార్థి వై, లంకకే తెంచియున్, లంకిణిం జంపియున్, లంకయున్ గాల్చియున్, భూమిజన్ జూచి, యానంద ముప్పొంగ, నాయుంగరం బిచ్చి, యారత్న ముందెచ్చి, శ్రీ రాముకున్నిచ్చి, సంతోషనున్ జేసి, సుగ్రీవుడా యంగదా జాంబ వంతాది వీరాదులన్ గూడి, యా సేతువున్ దాటి, వానరామూక పెన్మూకలై, దైత్యులన్ ద్రుంచగా, రావణుండంత కాలాగ్ని రూపోగ్రుడై, కోరి బ్రహ్మాండమై నట్టి యా శక్తినిన్ వేసి, యా లక్ష్మణున్ మూర్ఛ నందించగా, నప్పుడే పోయి సంజీవినిన్ దెచ్చి, సౌమిత్రి కిన్నిచ్చి ప్రాణంబు రక్షించగా, కుంభ కర్ణాదులన్ వీరులన్ బోరి, శ్రీ రామబాణాగ్ని వారందరిన్ రావణున్ జంపగా, నంత లోకంబు లానందమై యుండు నవ్వేళన్, నవ్వీ భీషణున్ వేడుకన్ దోడుకన్వచ్చి, పట్టాభి షేకంబు చేయించి, సీతా మహాదేవినిన్ దెచ్చి, శ్రీ రాము తో చేర్చి, అయోధ్యకున్ వచ్చి, పట్టాభిషేకంబు సంరంభమై యున్న నీకన్న నాకెవ్వరున్ గూర్మిలేరంచు



మన్నించినన్, శ్రీ రామభక్తి ప్రశస్తంబు గా నిన్ను నీ నామ సంకీర్తనల్ చేసితే, పాపముల్ బాయవే, భయములున్ దీరవే, భాగ్యముల్ గల్గవే, సకల సామ్రాజ్యముల్, సకల సంపత్కరముల్ గల్గవే, వానరాకార ! యో భక్త మందార ! యో పుణ్య సంచార ! యో ధీర ! యో వీర ! నీవే సమస్తంబు నీవే మహాఫలంబు గా వెలసి, యా తారకబ్రహ్మ మంత్రంబు సంధానమున్ చేయుచున్ స్థిరముగా వజ్ర దేహంబునున్ దాల్చి, శ్రీ రామ శ్రీ రామ యంచున్ మన: పూతమై యెప్పుడున్ తప్పకన్ తలచు నా జిహ్వా యందుండి యున్, నీదీర్ఘ దేహంబు త్రైలోక్య సంచారివై, రామ నామాంకిత ధ్యానివై, బ్రహ్మవై, బ్రహ్మ తేజంబునన్ రౌద్రాణి జ్వాల కల్లోల హావీర హనుమంత ! ఓంకార శబ్దంబులన్ క్రూర సర్వ గ్రహ భూత ప్రేత పిశాచ, శాకిని, ఢాకిని, మోహినీ, గాలి దయ్యంబులన్, నీదువాలంబులన్ జుట్టి నేలం బడంగొట్టి, నీ ముష్టి ఘాతంబులన్ బహు దండంబులన్ రోమఖండంబులన్ ద్రుంచి, కాలాగ్ని రుద్రుండవై, బ్రహ్మ ప్రభా భాసితంబైన నీ దివ్య తేజంబులన్ జూచి, రారా నా ముద్దు కుమార యంచున్, దయా దృష్టి వీక్షించి, నన్నేలు నా స్వామీ ! నమస్తే సదా బ్రహ్మచారీ ! నమస్తే వ్రత పూర్ణకారీ ! నమస్తే ! వాయు పుత్ర నమస్తే ! నమస్తే నమో నమ:

నేను నీ బంటునునని తేలికగా చూడక నా వ్రతం చేసి ఫలితం పొందు. త్వరలో సీతా దర్శనం కలిగి రావణ సంహారం చేసి అయోధ్యా పతివి అవుతావు అని విన్నవించాడు హనుమ. అప్పుడు ఆకాశవాణి " హనుమ చెప్పినదంతా సత్యమైనదే" అని పలికింది వ్రత విధానం చెప్పమని హనుమను రాముడు కోరాడు. మార్గశిర శుక్ల త్రయోదశినాడు హనుద్వ్రతం చేయాలని హనుమ చెప్పాడు. పంపా నదీ తీరంలో శ్రీరాముడు సుగ్రీవాదులతో వ్రతం చేసాడు. పదమూడు ముళ్ళ తోరం ను పూజించి కట్టుకొన్నాడు. తరువాత కథ అందరికీ తెలిసిందే. కనుక సందేహం లేకుండా ధర్మ రాజాదులను ఈ వ్రతం వెంటనే చేయమన్నాడు వ్యాసుడు. వ్యాస మహర్షి మాటలకు సంతృప్తులై ధర్మరాజు భార్య సోదర్లతో వ్రతాన్ని విధి విధానంగా చేసి అంతా తోరణాలు భక్తి శ్రద్ధ లతో కట్టుకొన్నారు. తరువాత కురుక్షేత్ర యుద్ధంలో కౌరవులని సర్వ నాశనం చేసి రాజ్యాన్ని పాండవులు పొందిన విషయం మనకు తెలుసు. అని సూతుడు మహర్షులకు హనుమద్ వ్రత వైభవాన్ని, ఫలితాన్ని తెలియజేశాడు.

# శ్రీ హనుమ కథానిధి - 6

## నీలుని కథ - 1

విభీషణుని కుమారుడు నీలుడు. ఆయన ఒక రోజు తండ్రి తో "లంకలో సంపద అనంతంగా వుంది. భోగ భూమిగా లంక వెలిగిపోతుంది. ప్రజలంతా సుఖసంతోషాలతో వున్నారు. అయితే ఒక లోపం నాకు కన్పిస్తోంది. మన దగ్గర చింతామణి, కామధేనువు, కల్ప వృక్షం లేవు. మీరు శ్రీ రాముని భక్తులు కదా. వాటిని ఎందుకు పొందలేదు ? నాకు అనుమతి నిస్తే వాటిని సాధించి తెచ్చి మన లంకకు అనంత వైభవం తెస్తాను " అన్నాడు. అప్పుడు విభీషణుడు " నాయనా ! నీ బల పరాక్రమాలు నాకు తెలుసు. సాధించే సామర్థ్యం నీకు వుంది. నాకు నా రాముడే చింతామణి, కామధేనువు, కల్పవృక్షం.



శ్రీ రామ పాద సేవ తప్ప నాకు ఏది ఆనందాన్ని ఇవ్వవు రామ కృప వల్ల దేవేంద్రుడు మొదలైన దిక్పాలకులు నాకు వశులై వున్నారు. ఇంకా మానవుల గురించి చెప్పక్కర లేదు కదా ? అల్పమైన ఆ మూడిటితో నాకు పని లేదు . అయితే నీకు వాటి మీద ఆశ కలగటం సహజం. అని ఎప్పుడు దేవతల చేతనే అనుభవింప బడుతున్నాయి. వాటిని పొందాలంటే గురు శుశ్రూష, దేవతాను గ్రహం ముందుగా సంపాదించు కోవాలి. వారి అనుగ్రహం వల్లనే పొంద గలవు. ముందు మన కులగురువు శుక్రాచార్యుల వారి అనుగ్రహం పొందు. ఆయనే దారి చూపిస్తారు. నీ కోరిక నెర వేరు గాక " అని దీవించి కొడుకు నీలుడిని పంపాడు. నీలుడు శుక్రాచార్యులను దర్శించి పన్నెండు ఏళ్ళ శుశ్రూష చేసి మనసు మెప్పించాడు. సంతోషించిన శుక్రుడు నీలుని కోరిక ఏమిటో తెలుసు కొన్నాడు. " నలుడా ! నీ కోరిక తీరి చింతామణి లాంటి అపూర్వ వస్తువులు పొందాలంటే నువ్వు పంచ వక్త్ర హనుమాన్ వ్రతం చెయ్యాలి. ఆయన అనుగ్రహం వుంటే నీకు అన్నీ సిద్ధిస్తాయి. రేపు మృగశిరా నక్షత్రం వుంది. ఆ నక్షత్రమ్ లో హనుమద్ వ్రతం చెయ్యి . " అని ఆ వ్రత విధిని ఉపదేశించాడు.

తాను తెచ్చిన అపార ధన రాసులు గురువుకు సమర్పించి ఆయన సన్నిధానం లో హనుమద్ వ్రతాన్ని భక్తి శ్రద్ధలతో చేశాడు నీలుడు. సంతోషించిన హనుమ మూడు వేల కోట్ల సేవకా గణంతో నీలుడికి ప్రత్యక్షమైనాడు. నీలుడు పరమానందం తో లేచి నిలబడి శ్రీ హనుమను పరవశం తో స్తోత్రం చేసాడు. " ఓం జయ జయ జయ – శ్రీ ఆంజనేయ – కేసరి ప్రియనందన – వాయు కుమార – ఈశ్వరపుత్ర – పార్వతీ గర్భ సంభూత – వానర నాయక – భక్త మనోరథ దాయక – భక్త వత్సల – దీన మందార – సర్వ స్వతంత్ర – శరణాగత రక్షక – ఆర్తత్రాణ పరాయణ – ఏక అసహాయ శూరా – వీర – హనుమాన్ – విజయీభవ – దిగ్విజయీభవ – దిగ్విజయీ భవ " అని, శరణాగతుడై ప్రార్థించాడు. వాయుసుతుడైన హనుమ సంతృప్తి చెంది ప్రత్యక్షమై నాడు."నీలా ! నీ భక్తికి మెచ్చాను. నీ తండ్రి విభీషణుడు నాకు పరమ ఆప్తుడు. అమూల్య వస్తువులను నువ్వు కోరావు. అవి తప్పక నీకు లభిస్తాయి. దేవతలలో అపురూప

సౌందర్యవతి నీకు భార్యగా లభిస్తుంది నువ్వు కోరక పోయినా వరం అనుగ్రహిస్తున్నాను. నీకు వెంటనే ఫలితం లభిస్తుంది. నీకు మృగశిరా నక్షత్రం సకల శ్రేయస్సును అందిస్తుంది.

నువ్వు తపస్సు చేసిన ఈ క్షేత్రం ఇక నుంచి " పురుషోత్తమ క్షేత్రం" అనే పేరుతో పిలువబడుతుంది. " అని ఆశీర్వదించి హనుమ రుద్ర రుషి గణాలతో అంతర్ధానమైనాడు. తరువాత నీలుడు లంకకు చేరి తండ్రికి, గురువుకు జరిగినది అంతా చెప్పాడు.

## శ్రీ హనుమ కథానిధి - 07
## నీలుని కథ - 2

చింతామణి , కామ ధేనువు , కల్పవృక్షం లను సాధించి తెచ్చుకోవాలనే సంకల్పం తో విభీషణుని కుమారుడు నీలుడు గురువు, శుక్రాచార్యుల, తండ్రి విభీషణుల దీవెనలతో శ్రీ హనుమద్ వ్రతం చేసి, ఆ స్వామి అనుగ్రహం పొంది మళ్ళీ లంకకు చేరాడని చెప్పుకొన్నాం. అందర్నీ సంప్రదించి దేవలోకం మీద దండ యాత్ర చేయాలనే సంకల్పంలోకి వచ్చాడు. ఒక దూతను ఇంద్రుని దగ్గరకు రాయబారిగా పంపాడు. " ఇంద్రా నువ్వు మా రాక్షసులకు చాలా కష్టాలు కల్గిన్చావు. నిన్ను మా సోదరుడు జయించి లంకకు తెచ్చిన సంగతి గుర్తుంచుకో. అప్పుడే అతనికి ఇంద్రజిత్ అనే పేరు వచ్చిందన్న సంగతి నీకు గుర్తుండి వుంటుంది. ఇంకా నీకు మాతో యుద్ధం చేసే ధైర్యము, శక్తి లేవని మాకు తెలుసు. నీ దగ్గరున్న చింతామణి, కామధేనువు, కల్పవృక్షం మొదలైన అపూర్వ సంపద అంతా మాకిచ్చేయి.లేకపోతే పరిణామాలు తీవ్రంగా వుంటాయి". అని తన సందేశాన్ని ఇంద్రునికి తెలియ జెప్పమని తెలియచేసాడు.

దూత మాటలు విన్న ఇంద్రుడు కోపంతో " నేను దేనినీ ఇవ్వను " అని తేల్చి చెప్పాడు. యుద్ధభేరి మోగింది. ఇంద్ర, నీలులకు ఘోరయుద్ధం



జరిగింది. యుద్ధ భూమిలో ఇద్దరు తారసపడ్డారు. నీలుడు ఇంద్రునితో " గౌతమ భార్యను చేరబట్టిన నీకు వావి వరుసలు లేవు.ఇంద్రజిత్ చేతిలో ఓడిపోయావు. ఇప్పుడు నన్ను జయించు దమ్ము వుంటే " అన్నాడు ఇంద్రుడు కూడా రావణాసురుణ్ణి వాలి చంకలో బంధించి అన్ని సముద్రాలలో ముంచిన సంగతి ఎత్తి పొడుపుగా చెప్పాడు. ఇద్దరు పెద్ద యుద్ధం చేసారు.నీలుని బాణాలను ఇంద్రుడు వమ్ము చేసాడు. ఇంద్రుని వజ్రాయుధాన్ని నీలుడు పనికిరాకుండా చేసాడు.ఇద్దరు కత్తులు దూసి చంపుకోబోయారు. అప్పుడే బ్రహ్మ ప్రత్యక్షమై "నీలుడా ! నీ తండ్రి విభీషణుడు విష్ణు భక్తుడు. ఇంద్రుడు విష్ణువుకు సోదరుడు యుద్ధం వద్దు" అనీ ఇంద్రునితో "ఇంద్ర ! వజ్రాయుధం వుపసంహరించు". స్నేహంతో మెలుగు నీలుడు అడిగినవన్నీ ఇచ్చేయి. అని నచ్చజెప్పాడు. ఇద్దరు అంగీకరించారు.ఇంద్రుడు నీలుడు అడిగిన అమూల్య వజ్రాలు, మాణిక్యాలు, చింతామణి, కామధేనువు, కల్పవృక్షం ఆనందంగా ఇచ్చివేసాడు. వనకన్య అనే దేవకన్యను కూడా ఇచ్చివేసాడు. వాటిని తీసుకొని నీలుడు లంక చేరాడు. రాక్షసగణం అంతా సంతోషించింది. నీల వన కన్యలకు వైభవంగా వివాహం జరిపించాడు. అప్పటినుంచి నీలుడు ప్రతి సంవత్సరం శ్రీ హనుమద్ వ్రతం చేస్తూ జీవితాన్ని ధన్యం చేసుకొని చివరికి సాయుజ్యం పొందాడు.

## శ్రీ హనుమ కథానిధి - 08
## వ్రత విధానం

శ్రీ పరాశర మహర్షి మైత్రేయునికి హనుమ కధను వివరించారు. మాఘమాసంలో రుద్రునికిష్టమైన ఆరుద్రా నక్షత్రంలో, ఫాల్గుణమాసంలో పునర్వసు నక్షత్రంలో, చైత్రంలో పుష్యమి నక్షత్రంలో సూర్యుడికిష్టమైన హస్తా నక్షత్రంలో శ్రీ హనుమద్ వ్రతాన్ని చేయాలి. జ్యేష్ట మాసంలో మృగశిర, ఆరుద్ర, పునర్వసు, పుష్యమి, హస్తా నక్షత్రాలలో వ్రతం చేయవచ్చు. ఒక్క పూట మాత్రమే భోజనం చేయాలి. నేల పై పడుకోవాలి. ఇంద్రియాలను అదుపులో వుంచుకోవాలి.

హనుమాన్ మహా మంత్రాన్ని నూట ఎనిమిది సార్లు జపించాలి. అయిదుగురు సద్బ్రాహ్మణులకు శక్తి కొలది దానం ఇవ్వాలి. అయిదు అప్పాలు, అయిదు పండ్లతో వాయనం ఇవాలీ. అయిదుగురు బ్రహ్మచారులకు సమారాధన చేయాలి.హనుమద్ సహస్రనామ, అష్టోత్తరాలతో, సువర్చల అష్టోత్తరంతో పూజించాలి. పంపా తీరంలో వ్రతం చేస్తే ఫలితం బాగా వుంటుంది. లేకపోతే ఒక కలశంలో పంపా జలాన్ని ఆహ్వానించి, పంపా నది కి అష్టోత్తర పూజ చేయాలి.

కలశం మీద పదమూడు ముళ్ళుగల తోరాలను వుంచి దాన్ని పూజ చేయాలి. ధూప దీప నైవేద్యాలు సమర్పించి మగ వాళ్ళు కుడి చేతికి, ఆడ వాళ్ళు ఎడమ చేతికి తోరం కట్టుకోవాలి." ఏ పుత్ర పౌత్రాది సమస్త భాగ్యం – వాన్ఛంతి వాయోస్తనయం ప్రపూజ్య – త్రయోదశ గ్రంధి యుతం తదంకం – బధ్నంతి హస్తే వర తోర సూత్రం" అనే మంత్రాన్ని పఠిస్తూ భార్య భర్తకు, భర్తకు భార్య తోరం కట్టాలి. ఆంజనేయుని వాహనమైన ఒంటెను కూడా పూజించాలి. "గంధ మదన శైలాగ్ర – స్వర్ణ రంభావనాశ్రయం – ఉష్ట్రం ధ్యాయేత్ సదా వంద్యం – హనుమద్ వాహనోత్తమం" అని ఉష్ట్ర ధ్యానం చేయాలి.

వ్రతం ప్రారంభంలో కలశ ప్రతిష్ట చేయాలి. అష్టదిక్పాల పూజ చేయాలి. నవగ్రహ పూజ కూడా చేయాలి. అంతా అయిన తర్వాత ప్రసాదం నైవేద్యం పెట్టాలి. అందులో అప్పాలు, పులిహోర పరవాన్నం వుండాలి, నీరాజనం ఇవ్వాలి. తర్వాత మంత్ర పుష్పం ఇవ్వాలి.వ్రతం రోజు ఇల్లుకాని, ఆలయం కాని, రంభావనంతో అంటే అరటి పిలకలతో అలంకరించాలి. ఆయన్ను రంభావన విహారి అంటారు కదా అందుకు. పూజలో తమలపాకులు ఎక్కువ వినియోగించాలి. వీటినే నాగవల్లీ దళాలు అంటారు. చివరికి భక్తి శ్రద్ధలతో ప్రసాదం తినాలి. అంతకు ముందు తీర్ధం తీసుకోవాలి. శటారి పెట్టిన్చుకోవాలి. ఇలా శ్రీ హనుమద్ వ్రతాన్ని భక్తి శ్రద్ధలతో చేస్తే తీరని కోరికలు తీరుతాయి. చివరికి మోక్షం లభిస్తుంది. ఇవన్నీ మన మహర్షులు చెప్పిన మాటలు కనుక విశ్వాసంతో చేయాలి.



# శ్రీ హనుమ కథానిధి - ౦౨
# లడ్డు హనుమంతుడు

ఒరిస్సాలో పూరి జగన్నాధ క్షేత్రం వుంది.అక్కడ శ్రీ కృష్ణ , బలరామ, సుభద్రాదేవి ల కర్ర విగ్రహాలున్నాయి. దీనినే దారుకావనం అంటారు.అక్కడ దేవుని ప్రసాదాలను మట్టి కుండలతో వండి నైవేద్యం పెట్తారు. చూడముచ్చటగా వుంటుంది. సముద్రం ఆలయానికి దగ్గరగా వుంటుంది. చాలా అల్లకల్లోలంగా వుంటుంది. ఆషాఢ శుద్ధ తదియనాడు రధోత్సవం అత్యంత వైభవంగా జరుగుతుంది. లక్షలాది జనం వస్తారు. ఇక్కడి ప్రసాదాలు అంటూ, ఎంగిలి లేకుండా అంతా కలిసి తినడం ప్రత్యేకత.అందుకనే ఎవరింట్లోనైనా అంటూ సొంటూ లేకుండా వుంటే "సర్వం జగన్నాధం" అంటారు.

అది సామెతగా నిలిచి పోయింది.మహా భక్తుడు చైతన్య మహా ప్రభువు ఇక్కడి నుంచే తన శ్రీ కృష్ణ తత్వాన్ని దేశం అంతటా ప్రచారం చేసాడు.ఆయన ఆశ్రమం వుంది. శ్రీ ఆది శంకరాచార్యులు " జగన్నాధ స్వామీ నయన పదగామీ భవతుమే ". అనే మకుటం తో జగన్నాధ స్తోత్రం రాశారు. చాలా అద్భుతమైన రచన చదువుతుంటే మనసు పులకరిస్తుంది. " కదా చిత్ కాళిందీ " అని ప్రారంభం అవుతుంది. భక్త కవి జయదేవుడు ఇక్కడి వాడే. ఆయన రచించిన గీత గోవిందం మధుర భక్తి కి నిదర్శనం అలాంటి మహా పుణ్య క్షేత్రానికి దగ్గరలోనే కోణార్క సూర్య దేవాలయం వుంది.దాని దగ్గర సముద్రం మీద సూర్యోదయ అస్తమయాలు చూడటం వింత అనుభూతి .

ఈ పూరీ క్షేత్రంను ఒకప్పుడు సముద్రుడు తన ఉత్తుంగ కెరటాలతో ముంచి వేశాడు. జగన్నాధ మందిరం మునిగి పోయింది. ఆయన ఏమి చేయలేక శ్రీ రాముని దగ్గరకు వెళ్ళి జరిగిన విషయం చెప్పి సముద్రుడు శ్రీ రాముని వంశం వాడు కనుక అతనికి చెప్పి మళ్ళీ ప్రమాదం రాకుండా చూడమని చెప్పాడు. రాముడు సముద్రుణ్ణి పిలిపించి అలలతో ఆలయాన్ని ముంచవద్దని

హితవు చెప్పాడు. సరేనని వెళ్ళి పోయాడు సముద్రుడు. కొంతకాలం బాగానే వున్నాడు. మళ్ళీ కెరటాలతో అలజడి సృష్టించాడట. పాపం జగన్నాధుడు

శ్రీ రామునికి విషయం తెలియజేసాడు. ఆయన అంజనేయుడిని పిలిచి సముద్ర తీరంలో ఉండి, సముద్రుడు ముంచెత్తకుండా కాపలా కాస్తూ ఉండమన్నాడట. రామాజ్ఞగా భావించి హనుమ కాపలా కాస్తున్నాడు. హనుమకు భయపడి జాగ్రత్తగానే వున్నాడు. కొంతకాలానికి హనుమ రాత్రి పూట కాపలా కాయకుండా తనకు ఇష్టమైన లడ్డులు తినటానికి అయోధ్య వెళ్ళి తిని, పొద్దున్నే వచ్చేవాడు. ఇది గమనించిన సముద్రుడు మళ్ళీ విజృంభించి కెరటాలతో అంతా ముంచేసాడు. మళ్ళీ శ్రీ రామునికి నివేదించాడు స్వామి.

రాముడు హనుమను పిలిపించి జిహ్వా చాపల్యంతో విధిని సరిగ్గా నిర్వహించక పోయినందుకు హెచ్చరించి సముద్ర తీరం లో ఎల్లవేళలా నిలిచి ఉండేట్లు చేసి కాళ్ళకు ఇనుపగొలుసులతో బంధింప చేసాడట. మరి హనుమకు లడ్డులు అంటే మహా ప్రాణం కనుక రోజూ జగన్నాధునికి లడ్డులు చేయించి నైవేద్యం పెట్టే ఏర్పాటు చేసాడట అప్పటినుంచి. సముద్రం అతి జాగ్రత్తగా వుంది ఏరకమైన ఇబ్బంది ఆలయానికి, పూరీకి కల్గించలేదట. పూరి సముద్రపు ఒడ్డున ఇప్పటికి కాళ్ళకు గొలుసులతో వున్న హనుమ దర్శనమిస్తాడు. ఆయన్ను ఇక్కడ " బేడీ హనుమాన్ " అంటారు. బేడీలు అంటే సంకెళ్ళు. జిహ్వా చాపల్యం హనుమకే ఇబ్బంది కలిగించింది అంటే మనం ఎంత జాగ్రత్తగా వుండాలో తెలిపే కథ ఇది. దీనిని శ్రీ శ్రీ ప్రభు దత్త బ్రహ్మచారి గారు చెప్పారు.

కృష్ణా జిల్లా లోని ఉయ్యూరు లో వేంచేసి వున్న మా సువర్చలాంజనేయ స్వామి వార్ల దేవాలయంలో ధనుర్మాసంలో ప్రాత:కాల పూజ లో ప్రతి జనవరి ఒకటవ తేదీన 1116 లడ్డులు చేయించి, వాటితో సహస్రనామ పూజ చేసి, నైవేద్యంగా భక్తులకు పంచిపెడతాము. ఆంగ్ల సంవత్సర శుభాకాంక్షలు చెబుతాము. దీనికి భక్తుల స్పందన అద్భుతంగా వుంటుంది.



# శ్రీ హనుమ కథానిధి - 10
# శ్రీరాముడు మెచ్చిన హనుమ

లంకా పట్టణంలో సీతా సాధ్విని దర్శించిన హనుమ సుగ్రీవునితో వున్న రామ లక్ష్మణులను చేరి తాను సీతా దేవి దర్శనం చేసానని ముందుగా ఒక్క మాటతో చెప్పాడు. ఆ తరువాత వివరంగా తాను సముద్రానిన దాటటం, దారిలో ఏర్పడిన ఆటంకాలను అధిగమించటం, లంకిణి అనుమతితో లంకను ప్రవేశించటం, రావణుని దురహంకారం, సీతా దేవి తల్లడిల్లిన విధానం, ఆడ రాక్షసులు సీతను బాధ పెట్టిన తీరు, త్రిజటా స్వప్న వృత్తాతం, తాను సీతా మాతతో సంభాషించిన తీరు, ఆమె ఆవేదన, ఆమె జ్ఞాపకం చేసిన కాకాసుర వృత్తాంతం, లంకకు తాను చేసిన విధ్వంసం, ఇంద్రజిత్ బ్రహ్మాస్త్రానికి పట్టుబడిన వైనం, రావణుని కొలువు చేరి అతనిని హెచ్చరించిన విధం, రావణుడు తనను చంపాలనుకొన్నపుడు మతి మంతుడైన విభీషణుడు రావణునికి చేసిన హితోప దేశం, చివరికి తన తోకను కాల్చమని రావణుడు ఆదేశించడం, తోకకు రాక్షసులు నిప్పు అంటించడం, తాను రెచ్చిపోయి, ఆ అగ్ని తోనే లంకా దహనం చేయటం, అగ్ని హోత్రుడు తనకు అండగా నిల్చి శరీరానికేమీ అగ్ని ప్రమాదం లేకుండా కాపాడటం, సీతా దేవి, విభీషణుడు వున్న ప్రదేశాలు తప్ప లంక అంతా భస్మీ పటలం అవటం, తాను సముద్రజలంతో, తోకను చల్లార్చు కోవటం, మళ్ళీ సీతా దర్శనం చేసి చూడామణిని గుర్తుగా పొందటం, రెండు నెలలు గడువు లోపల తనను రక్షించక పోతే తాను దక్కనని రామునికి సీత ఇచ్చిన సందేశం వివరించాడు హనుమ.

సాధారణంగా చాలా ముక్తసరిగా మాట్లాడే శ్రీ రామచంద్రుడు, వివశు డై, సీతా దేవి పొందుతున్న వేదనకు విహ్వలుడై హనుమచేసిన ఉపకారానికి చలించి ఇలా స్తుతి చేశాడు. " ఆంజనేయా ! నీవల్లనే ఈ కార్యం సఫలం

అయ్యింది. ఇంకెవ్వరి వల్ల కాని పని నువ్వు చేసి క్రుతక్రుత్యుడివి అయినావు. రఘువంశాన్ని నువ్వే ఇప్పుడు రక్షించావు.అందు కోసమే మారుతిగా అవతరించావు అని నాకు అనిపిస్తోంది. సముద్రాన్ని లంఘించటం మామూలు వాళ్ళ వల్ల అయ్యే పని కాదు. ఒకవేళ దాటినా, మహా భయంకరుడైన దశగ్రీవుని లంకను చేరటం సాధ్యం కాదు. అంతేనా అక్కడి శత్రువు ఆను పాను లన్నీ తెలుసుకోగలిగావు.లంకా దహనం చేసి వాళ్ళ గర్వాన్ని ఖర్వం చేసావు. గరుత్మంతుడు, వాయువు లంకను దాటగలరేమో కాని ఇంతటి స్వామి కార్యాన్ని వాళ్ళు చేయలేరు. కార్య సాధకులు కాలేరు వాళ్ళిద్దరూ .లంకలోకి ప్రవేశించటమే ప్రాణాంతక మైన పని. ప్రవేశించి దిగ్విజయంగా తిరిగి వచ్చావు. ఇది రుద్రునికైనా అసాధ్యమైన విషయం. రుద్ర వంశ సంభూతుడివి. కనుక నీకు సాధ్యమైంది.

ఈ పని నీకే చెల్లింది. నిన్ను కీర్తించటానికి నాకు మాటలు రావటం లేదు, చాలటమూ లేదు. ఇతరులకు అసాధ్యమైన దానిని సుసాధ్యం చేసావు. నీబుద్ధి, ధీ శక్తి ,సాహసం, ధైర్యం,వివేకం, విచక్షణ, పరిపూర్ణ భక్తీ, విశ్వాసం, కార్యం చేయగలను అనే నమ్మకం అహంభావం లేకపోవడం, అకుంఠిత దీక్ష, కష్ట సహిష్ణుత, నిన్ను మహానుభావుడిని చేసాయి. దీనికి నేను ప్రత్యుపకారంగా ఏమీ ఇచ్చుకోలేని స్థితి లో వున్నాను. ఒక్కసారి నిన్ను ఆలింగనం చేసుకోని నా కృతజ్ఞతను నీకు తెలుపుకొంటాను. అంతకంటే నేనేమీ చేయలేను.అని కీర్తించి హనుమను శ్రీ రాముడు గాధ ఆలింగనంతో తన కృతజ్ఞతను వెల్లడించాడు. హనుమకు అదొక దివ్య అనుభూతిగా అనిపించింది. అంతటి మహానుభావుడు, లోకోద్ధారకుడు, అసహాయ శూరుడు, రావణ సంహారి తనకు గాధ ఆశ్లేషణ చేయటం తన పూర్వ జన్మ సుకృతంగా, మహద్భాగ్యంగా భావించాడు. కృతజ్ఞతతో మారుతి కూడా పులకాంకురాలతో చలించి పోయాడు.అదొక అనిర్వచనీయ అనుభూతి. భగవద్, భక్తుల సమ్మేళనం.



అసలు భగవంతునికీ భక్తునికీ భేదం లేదు. ఇద్దరు ఒకరే " త్వమేవాహం" . అదో అపూర్వ సన్నివేశం.ఇద్దరూ ఇద్దరే. మర్యాదా పురుషోత్తములు. ఎవరి కార్యం వారే నెరవేర్చారు. లోకానికి ఆదర్శంగా నిలిచారు. అందుకే ఇప్పటికీ వారి గుణ గానాన్ని చేసి తరిస్తున్నాము.

ఈ విధంగా శ్రీ హనుమ సీతా రాములకు పునర్జీవనాన్ని కల్పించి మహెూపకారం చేసాడు. అందుకే రామాయణంలో మణిపూస అనిపించు కొన్నాడు. తన ఆరాధ్యదైవం శ్రీరాముని కోసం ఎన్నో లోకోపకార కృత్యాలు చేసాడు. సంజీవ పర్వతోద్ధారి హనుమ.

## శ్రీ హనుమ కథానిధి -II

## శ్రీరామునికి హనుమ చేసిన హితబోధ

రావణుడి దురాలోచనలకు విసిగిపోయాడు విభీషణుడు.ఎన్నో హితవు మాటలు చెప్పాడు అన్న రావణునికి. అయినా అతని చెవికి యెక్కలేదు. పైగా కోపించాడు. ఇక లంకలో వుండటం శ్రేయస్కరం కాదని నిర్ణయించుకొన్నాడు విభీషణుడు. రాముడు శరణాగత రక్షకుడు అనితెలుసు, అంతే కాదు తాను మొదటి నుంచి విష్ణు భక్తుడు కూడా. అందుకు లంకను, అన్నను వదిలి శ్రీరాముని దగ్గరకు చేరి శరణాగతి కోరాడు. సుగ్రీవుడు మొదలైన వారంతా విభీషణుడి దగ్గరకు చేర్చ వద్దు అని రామునికి సలహా చెప్పాడు.

అప్పుడు చిరునవ్వు నవ్వి రామచంద్రుడు మతి వంతుడైన హనుమను సలహా చెప్పమని కోరాడు. హనుమ సాకల్యం గా అన్నీ ఆలోచించాడు. కాగల కార్యం గంధర్వులే తీర్చినట్లుంది పరిస్థితి. సరిఅయిన నిర్ణయం రాముడే తీసుకోగలడు. కాని అందరి అభిప్రాయాలు తెలుసుకోగోరాడు రాముడు. అది రాజ లక్షణం.సమస్యను అన్ని కోణాలనుంచీ ఆలోచించాలి. తాత్కాలిక ఉద్రేకంతో, ఆవేశంతో నిర్ణయాలు తీసుకొంటే మొదటికే మోసం.

ఆసంగతి రామునికి తెలియక కాదు .మనస్తత్వాలను పరీక్షించటం ఆయన పద్ధతి.అందుకే సమస్యను అందరి ముందు ఉంచారు.అందరి స్పందన విని చివరగా హనుమను తన మనసులోని మాటను తెలియ జేయమన్నాడు. హనుమంతుడు ప్రభువైన రామునికి ఇలా తెలియజేసాడు " ప్రభూ ! రామచంద్రా! నీకు తెలియక కాదు నన్ను అడిగింది, ప్రజాస్వామ్య పద్ధతికి, ప్రజల మనోభీస్టాలను తెలుసుకొని నిర్ణయం తీసుకోవటానికే నీవు ప్రాదాన్యత నిస్తావు. నువ్వు శరణాగతరక్షకుడివి అని పేరు పొందావు. నీ మంత్రులు చెప్పిన వాటిలో నాకు నిజం కనిపించటంలేదు. విభీషణుడు మన రహస్యాలను తెలుసుకోవటానికి వచ్చాడని వీళ్ళు అందరు అంటున్నారు.

అలా అయితె వేషం మార్చుకొని వస్తాడు కాని నిజరూపంలో వస్తాడా, ఆలోచించు. లోపల ఉన్న భావాన్ని ఎవరైనా దాచగలరా. ముఖంలో ఆభావం ప్రత్యక్షమవుతూనే వుంటుంది.రావణుని తమ్మునికి నువ్వు శరణు ఇచ్చావంటే నీకు అంతకంటే గొప్ప ప్రతిష్ట ఏముంది ? శరణు అన్న వాడు శత్రువు ఎలా అవుతాడు ? అయినా శత్రువుకు కూడా నీవు శరణం ఇస్తానని ప్రతిజ్ఞ చేసిన వాడివి కదా.

అంతే కాదు యితడు మనం లంకలో ప్రవేశించిన తర్వాత నీ దగ్గరకు శరణు అని వస్తే, అది శత్రు దేశం కనుక అనుమానించవచ్చు.అతను దేశం వదిలి మనం వున్న చోటికి వచ్చాడు. భయపడాల్సిన పని లేదు. " విభీషణుడు కాలజ్ఞుడు. జరగబోయేది అతనికి తెలుసు. తన మతృభూమి అయిన లంకను కాపాడుకోవాలనే తాపత్రయం అతనిలో కనిపించింది నాకు. వంశ నాశనం రాక్షస నాశనం అతనికి ఇష్టం లేదు. యుద్ధం వల్ల జరిగే అనర్ధం అంతా అతనికి తెలుసు. అందుకని ముందే ఆవినాశనం జరగకుండా నిన్ను శరణు కోరాడు. అతని మటల్లో తేడా ఏమీ లేదు. రావణ సభలో అన్నను ఎదిరించి నా తరపున ధర్మ పక్షపాతంగా మాట్లాడాడు. సుగ్రీవుడు అన్న వాలికి భయపడి పారిపోయి, నిన్ను ఆశ్రయించి నీతో సఖ్యంచేసి, వాలిని నీతో చంపించి కిష్కింధకు రాజైనాడు.



అలానే విభీషణుడు నీప్రాపుకోరి వచ్చాడు. రావణ సంహారం తర్వాత తాను లంకకు రాజు అవ్వాలనే అభిలాష అతనిలో వుంది. ఇది సహజం. అతను మనతో వుంటే లంకలోని రహస్యాలన్నీ మనం తెలుసుకోవచ్చు.అతడు ధర్మ పక్షపాతి. నువ్వూ అంతే. కనుక విభీషణుడు అభయం ఇవ్వటంలో ఏ ప్రమాదము వుండదని నా అభిప్రాయం. నాకు తోచింది చెప్పాను. నువ్వు రాజువి నిర్ణయం తీసుకోవాల్సింది నువ్వే "అని ముగించాడు వివేకవంతుడైన హనుమ. శ్రీ రాముడు హనుమ చెప్పిన విషయాలను సాకల్యంగా విన్నాడు.అతని దూరదృష్టి నీ, రాజనీతిజ్ఞతను మెచ్చాడు."మాకు మొక్కిన వారి చేతులు నరకటం మా సాంప్రదాయం కాదు. అది క్షత్రియోచితం కూడా కాదు. అభయం ఇచ్చాను. కనుక సగౌరవంగా విభీషణునికి స్వాగతం పలకండి రాక్షసరాజుకు" అన్నాడు. రాక్షసరాజు అని రాముడు అన్న మాట హనుమ గ్రహించాడు. అందులోని ఆంతర్యం మతిమంతుడైన హనుమ గ్రహించాడు.రాముని హృదయం హనుమకు హనుమ హృదయం రామునికి తెలుసు. పరేంగి తావగాహన వారిద్దరిది. ఈ విధంగా మంచి సలహానిచ్చి, రామునికి నమ్మిన బంటుగా విభీషణుడిని చేసి చివరికి విభీషణునికి లంకా రాజ్య పట్టాభిషేకం జరగటానికి కారకుడైనాడు మారుతి.

కార్య సాధనకు సమయోచితమైన సలహా చెప్పాలి.బలం ,నీతి బుద్ధి, సరస సంభాషణం, మృదు భావం, సత్యపాలన, వివేకం వున్నవాడు కనుకనే హనుమ రాముని మనసును దోచుకొన్నాడు. విభీషణుడు రాముని దగ్గరకు చేరటంతో లంక పూర్తిగా అధర్మమైపోయింది. ధర్మ చ్యుతి జరగటం వల్ల లంకను జయించటం తేలికయినది. రావణ వధానంతరం రామునికీ అయోధ్య పీఠం దక్కి చక్రవర్తి అయ్యాడు. ఒక గొప్ప సలహాతో రెండు కార్యాలు నిర్విఘ్నంగా నెరవేర్చిన ఘనత సంపాదించాడు వాయుసుత హనుమ.

# శ్రీ హనుమ కథానిధి -12
# ధాన్య మాలికి శాపవిమోచనం

రామ, రావణ యుద్ధం మహా భీకరంగా సాగుతోంది.ఇంద్రజిత్‌ను లక్ష్మణుడు వధించి అందరి ప్రశంశలు పొందాడు. కోపంతో రెచ్చిపోయి రావణుడు లక్ష్మణుని మీదకు శక్తి ఆయుధాన్ని ప్రయోగించాడు. దాని ప్రభావం వల్ల లక్ష్మణుడు మూర్ఛపోయాడు. రాముడు కలవరపడ్డాడు. హనుమను ప్రార్ధించాడు తన తమ్ముని బ్రతికించమని. వెంటనే హనుమ ద్రోణాద్రి మీదకు ప్రయాణం సాగించాడు. అక్కడ ఒక ముని ఆశ్రమం కనిపించింది.చాలా ప్రశాంతంగా వుంది ఆశ్రమం. హనుమ మనసు అటు లాగింది. అక్కడ వున్న తాపసిని దర్శించి, ఆశీర్వచనం పొందాలని భావించాడు. కొంచెం అనుమానమూ వచ్చింది. ఇది వరకు వచ్చినపుడు ఈ ఆశ్రమం లేదు. ఇప్పుడెలా వచ్చింది ? సరే చూద్దాం అని లోనికి ప్రవేశించాడు. సమాధి నిష్ఠలో వున్న ముని కనిపించాడు. దాహం వేసి మంచి నీళ్ళు ఇవ్వమని మునిని అడిగాడు. ఆయన కొంచెం సేపు హనుమను ప్రశ్నలతో కాలహరణం చేసి ప్రక్కనే వున్న జలాశయం దగ్గరకు వెళ్ళమని చెప్పాడు. మంచినీరు తాగుదామని అందులోకి దిగాడు హనుమ. వెంటనే అకస్మాత్తుగా ఒక మొసలి హనుమ కాలు పట్టుకొని నీటిలోకి లాగడం ప్రారంభించింది. భయపడని మారుతి చేతులతో దాని దవడలను చీల్చి పారేశాడు. వెంటనే అది ఒక అందమైన స్త్రీ రూపంగా మారి హనుమకు కనిపించింది. అద్భుత సౌందర్యరాశిగా వుంది ఆ సుందరి. సమ్మోహనం కల్గిస్తోంది. ఆమె ఆంజనేయుని భక్తితో ఇలా ప్రార్ధించింది.

“ జయ సంసార మహాంధ కారాంతరణీ, సౌవర్ణ భూభ్రూద్ద్యునీ
జయ నానాగమ తత్వ భవ్య సరణీ, సద్భక్త చింతామణి
జయ దుష్టాసుర జీవ మారుత ఫణీ, చంచత్ర్పతాపారణీ
జయ సాధూత్తమ చిత్త వారణ సృణీ, శాఖామ్రుగా గ్రామణీ.”



దీని అర్ధం తెలుసుకొందాం.“వో !హనుమ ! సముద్రం దాటి రామ ముద్రను సీతకు ఇచ్చావు. లంకను దహించి రాక్షసుల గర్వం అణిచావు. బుద్ధిశాలివి. ఆర్త జన బాంధవుడవు.నీకు నమస్కారం. మొసలి రూపంతో ఈ బురదలో పొర్లుతున్న నన్ను నీ పాద స్పర్శతో పునీతం చేసావు. నీ మహిమను పొగడటం ఎవరి వల్లా కాదు. నీకు ఒక ఉపాయం సూచిస్తాను. ఇక్కడ నీకు కనిపించిన వాడు దొంగవేషంలో వున్న కాలనేమి అనే రాక్షసుడు. ముని వేషంలో ఉన్నవాడిని చంపి నువ్వు ముందుకు సాగిపో జయం లభిస్తుంది .” ఈ మాటలు విన్న హనుమ హృదయం కరిగి పోయింది. ఇంతకీ ఆమె ఎవరు ? ఎందుకు మొసలి రూపం వచ్చిందో తెలుసుకోవాలని ఆమెనే అడిగాడు. ఆమె వృత్తాంతాన్ని సవివరంగా చెప్పమన్నాడు. ఆమె ఏమి చెప్పిందో తరువాత తెలియజేస్తాను. సర్వ వేదాంత వేద్యాయ – పూర్ణాయ పరమాత్మనే – సచ్చిదానంద రూపాయ – భవిష్యత్ బ్రహ్మణే నమ:

# శ్రీ హనుమ కథానిధి -13
# ధాన్య మాలి వృత్తాంతం

మొసలి రూపం నుండి విముక్తి పొందింది,అద్భుత సుందరిగా మారిన స్త్రీ తన వృత్తాంతాన్ని హనుమకు తెలియజేసింది.తను ఒక దివ్య స్త్రీ నని,తన పేరు ధాన్య మాలిని అని చెప్పింది.“ రంభ, ఊర్వశీ, తిలోత్తమ మున్నగు వారంతా నా ఇష్ట సఖులు. వేదిక క్రతువులలో ధన్యులయిన సోమయాజులు నన్ను కామిస్తారు.యుద్ధంలో వీర స్వర్గం అలంకరించిన శూరులు, వీరులందరూ నాకు పార్శ్య వర్తులు. అంటే సహచారులు. గాంధర్వ విద్యలో నేను మేటిని. ఒక రోజు కైలాసంలో శివుని ముందు అద్భుత నృత్యాన్ని చేసి అందరినీ ఆశ్చర్య పరిచాను. నేను ఆడిన దరువు పేరు “ జక్కిణి ”.

“పరమేశ్వరుడు నా నాట్య విలాసానికి మెచ్చి ఒక దివ్య విమానాన్ని అనుగ్రహించాడు.దాని ని ఎక్కి లోకాలన్నీ తిరిగాను. ఒక రోజు ఈ జలాశయం

లో హాయిగా పాడుకొంటూ, స్నానం చేస్తున్నాను. అప్పుడు నా పాట విన్న శాండిల్యుడు అనే ముని నన్ను చూసి మోహపరవశంతో, నా దగ్గరకు వచ్చాడు.అప్పటిదాకా చేస్తున్న జపాన్ని, తపాన్ని ఒదిలి పెట్టాడు. తనకు మోహపరవశం కలిగించాననీ, ఒక సారి తన వంక చూడమనీ బలవంత పెట్టాడు.ఆయన మాటలు, ప్రవర్తన నాకు ధర్మ విరుద్ధం గా వున్నాయని అనిపించాయి.ఆయన ధర్మ మార్గాన్ని వదిలి ఇలా ప్రవర్తించటం భావ్యం కాదని చెప్పా. మా మోహం యవ్వనం, అందం అంతా అశాశ్వతమైనవేననే, శాశ్వతమైన ముక్తిని కోరే తపస్సంపన్నుడైన ఆయన అలా చేయటం భావ్యం కాదని బతిమిలాడాను. క్షణిక సుఖం కోసం శాశ్వత ఆనందాన్ని దూరం చేసుకో వద్దని, తన లాంటి వారికి ఈ విషయాలు చెప్పాల్సి రావటం బాధాకరం అనీ అన్నాను.

ఇవేవీ ఆయన చెవికి యెక్క లేదు. కామం కళ్ళు కప్పేసింది. మనసు వశం తప్పింది. వినే స్థితిలో లేడు. ఇంక తాను తాళ లేననీ, కనికరించమనీ, ఆలస్యం చేయవద్దని, కాళ్ళా వేళ్ళాపడి బ్రతిమి లాడాడు. తన కోర్కె తీర్చాల్సిందేనని పట్టు బట్టాడు. నేను కొంచెం ఆలోచించాను. నేను అశుచిగా ఉన్నాననీ, శుచి నై వస్తాననీ నమ్మకంగా చెప్పాను. ఆ కామ మోహి, నమ్మి త్వరలో రమ్మని, విరహాగ్ని తో కాలి పోతున్నాననీ వేడుకొన్నాడు. నేను వెంటనే గంధ మదన పర్వతం చేరుకొన్నాను. అక్కడ హాయిగావీణా నాదం తో పరవశనై పాడుకొంటున్నాను. చంద్రోదయ కాలమ్ అది. పండు వెన్నలతో లోకాన్ని పరవశం చేస్తున్నాడు తారా పతి. నా పాట విని రావణుడు అక్కడికి వచ్చాడు.

అతను కామ మోహంతో నిండి వున్నాడు. తన కోర్కె తీర్చమన్నాడు. నేను యెంత ప్రార్థించినా వినకుండా, అశుచిని అని చెప్పినా నన్ను అనుభవించాడు. నాకు ఒక కొడుకు పుట్టాడు రావణుని వల్ల. ఆ కొడుకును తనతో తీసుకొని వెళ్ళాడు. నేను ఒంటరిగా మిగిలాను. నేను మునికి ఇచ్చిన మాట ప్రకారం శుచినై ఆయన ఆశ్రమం చేరాను. ఆయనకు విపరీతమైన కోపం వచ్చింది. నన్ను తిట్టాడు. నా యవ్వనాన్ని ఎవరికి అప్పగించానో



చెప్పమన్నాడు. నియమంగా వున్న తనను నా అందంతో రెచ్చ గొట్టాననీ, మంచిమాటలు నేను చెప్పినా వినిపించుకోలేక పోయాననీ, తన్ను మన్మథ బాణాగ్నికి గురిచేసి, దారి తప్పేట్లు నేనే చేశానని నిందించాడు. తాను బుద్ధి హీనుడై తప్పు దోవ పట్టానని ఇప్పుడు తెలుసుకొన్నానని అన్నాడు. అందుకే మన్మథుని ధ్వజమైన మొసలి రూపం పొంది ఈ సరోవరంలో పడివుండమని శపించాడు. నేను ఇందులో నా తప్పు ఏమీ లేదని, అంతా ఆయన స్వయం కృతాపరాధమేననీ, కుటిలుడైన రావణుని బలాత్కారమే నన్ను ముంచిందనీ శాప విమోచనం తెలుపమనీ వేడు కొన్నాను. నా కన్నీరుకు కరిగిన ముని చంద్రుడు దయార్ద్ర హృదయం తో పరోపకార పారీణుడు, సకల జన శోకాలను నివారించే వాడు, శ్రీరాముని బంటు అయిన శ్రీ ఆంజనేయ స్వామి వల్ల నా శాప విమోచనం జరుగు తుందని తెలియ జేశాడు. శాండిల్య ముని అనుగ్రహం వల్ల నీ సందర్శనం లభించి నాకు శాప విమోచనం కలిగింది. నన్ను ధన్యురాలిని చేశావు.నీ మేలు మరువ లేను. నన్ను కనికరించండి. ”

అని కృతజ్ఞతా భావంతో దాన్యమాలి హనుమకు నమస్కరించి, విమానం ఎక్కి దేవ లోకానికి వెళ్ళి పోయింది. ఇంతటి శాపానుగ్రహ కారకుడు మన హనుమ.ఆయన దివ్య చరితం వింటున్న కొద్దీ మహదానందంగా వుంటూనే వుంటుంది.

## శ్రీ హనుమ థానిధి -14
## కాలనేమి ని వధించిన హనుమ

ధాన్య మాలికి శాప విమోచనం కల్పించి హనుమంతుడు ,ఆమె చెప్పినట్లే కపట ముని గా ఆశ్రమంలో రావణుని కుటిలం తో కూర్చున్న కాలనేమి అనే రాక్షసుడిని ఒక్క దెబ్బకు సంహరించాడు.వెంటనే ద్రోణాద్రి మీదకు చేరాడు అతివేగంగా లక్ష్మణుడిని కాపాడాలనే తొందరలో, ఆ కొండ రత్న, మాణి, మాణిక్య, గిరిక మొదలైన ఓషదులతో వెలిగి పోతోంది. తనకు, అవసరమైన,

లక్ష్మణుని ప్రాణరక్షణ చేసే ఔషదాన్ని కనిపించేట్లు చెయ్యమని ఆ గిరిని ప్రార్థించాడు. అదేమీ విని పించుకోలేదు.హనుమకు ఆగ్రహం వచ్చి " రావణుని శక్తి ఆయుధానికి లక్ష్మణ స్వామికి మూర్ఛ వచ్చింది. దాన్ని చూడలేక శ్రీ రాముడు తల్లడిల్లు తున్నాడు. రామానుజుణ్ణి పునర్జీవింపజేయటానికి తగిన ఓషధిని చూపించమంటే నువ్వు చూపించట్లేదు. నిన్ను క్షమించను." అని ఆకొండకు చెప్పి భీకరంగా సింహంలా గర్జించాడు. ఆద్రోణాద్రి మీద వున్న సకల ప్రాణి కోటి గజగజ వణికిపోయింది. భయంతో పరుగులుతీశాయి. అందరు, "రక్షించండి రక్షించండి " అంటూ గగ్గోలు పెడుతున్నారు. కోపంతో హనుమ ద్రోణాద్రిని తన తోకకు చుట్టిదాన్ని పెకలించటానికి ప్రయత్నం చేస్తున్నాడు. అప్పుడు ఆ గిరి మీద వున్న పదమూడు కోట్ల గంధర్వులు మహాక్రోధంతో ఆంజనేయుడి తో తలపడటానికి సిద్ధమయ్యారు. హనుమ రెచ్చిపోయాడు." వీళ్ళా నన్ను ఎదిరించేది " ? అనుకొని తోకతో వాళ్ళ గొంతుకల్నీ బిగించి, ఆకాశంలోకి వారిని అందర్నీ ఎగరేశాడు. కాళ్ళు చేతులు విరిగి కుయ్యో, మొర్రో అంటూ ఆర్త నాదాలతో వాళ్ళు కకావికలం అయ్యారు. బుద్ధివచ్చి, చెంపలేసుకొని, తమ తప్పును కాయమని కాళ్ళా వేళ్ళాపడ్డారు. క్షమించమని ప్రాధేయ పడ్డారు. బుద్ధి గడ్డి తిన్నదని ఒప్పుకొన్నారు. కనికరించిన హనుమ వాళ్ళందరినీ మళ్ళీ ఆ కొండశిఖరం మీదకు చేర్చాడు. బతుకు జీవుడా అంటూ వాళ్ళు ఊపిరి పీల్చుకొన్నారు. హనుమను అడ్డగించాలి అనే నెపంతో రావణుడు మాల్యవంతుడు అనే క్రూర రాక్షసుడిని పంపాడు సైన్యం తోడు ఇచ్చి. వాడు హనుమతో "ఏ మయ్యా ! నీకేమీ పనీ పాటు లేదా. ఎన్ని సార్లు వచ్చి ఈ ద్రోణాద్రి మీద వున్న మందుల్ని పెకలించుకు తీసుకొని వెళతావు. నాముందు ఈశ్వరుడు కాని, విష్ణువు కాని నిలువలేరు.

నువ్వో లెక్కా ? ఆ కొండను కాదురా నిన్ను సముద్రం లోకి విసురుతా చూడు అని బెదిరించాడు. హనుమకు తీవ్ర కోపం వచ్చింది. " ఒరే రాక్షసా ! కొండను కాదురా నిన్ను సముద్రంలోకి విసురుతా చూడు " అన్నాడు. వాడు రాక్షస వీరుల్ని అందర్నీ రెచ్చగొట్టి మారుతి మీదకు వుసి గొలిపాడు. వాళ్ళందరినీ



ఒక్కడు కూడా మిగలకుండా చంపేశాడు హనుమ. మాల్యవంతుడు యుద్ధానికి దిగాడు. హనుమంతుని ముందు కుప్పి గంతులా ? వాణ్ణి తోకతో చుట్టి గిర గిరా తిప్పి సముద్రంలోకి విసిరి పారేశాడు. ఆకాశంలోని దేవతలందరూ పూల వర్షం కురిపించారు. ఆంజనేయుని బల, పరాక్రమాలను స్తుతించారు. సమయానికి మందుల మొక్కలతో వచ్చి లక్ష్మణుని ప్రాణాలు కాపాడాడు శ్రీహనుమ. శ్రీ రాముడు సంతోషం పట్టలేక కృతజ్ఞతతో ఆలింగన సౌఖ్యం కలిగిస్తూ " నాయనా హనుమా లక్ష్మణ మూర్ఛ చేత రఘువంశం అనే పైరు తాత్కాలికంగా ఎండిపోయింది. దానికి నువ్వు మేఘం లాగా వర్షించి, మళ్ళీ వృద్ధి చెందిన్చావు. నీకు నేనేమీ ప్రత్యుపకారం చేయలేను". అని ఆప్యాయంగా కౌగిలించుకున్నాడు. హనుమంతుని దివ్య శక్తులను పొగడటం ఎవరివల్లా కాదు. అతని మైత్రీబంధం, శక్తి, యుక్తి, కార్య దీక్ష, స్వామి భక్తి మాటలతో వర్ణించ లేనివి. అతని తోక ఒక్కటి చాలు లంకను పిండి బొమ్మలా సముద్రంలో పడ వెయ్యటానికి. అతనికి అసాధ్యమైనది ఏమీ లేదు ...
ఈ సారి మైరావణ వృత్తాంతాన్ని తెలియ జేస్తాను.

# శ్రీ హనుమ కథానిధి -15

# మైరావణ వధ

రామ, ఆంజనేయ పరాక్రమానికి రావణుడు భయపడి పోయాడు. వెంటనే నాగ లోకాధిపతి రావణునికి తక్షణమే రమ్మని కబురు చేశాడు.అతను రాగానే తనభయాన్ని చెప్పుకొని, ఉపాయం చెప్పమన్నాడు.వాడు నవ్వి, భయపడాల్సిన అవసరం లేదనీ, వానరులందర్నీ పాతాళంలో అమ్మ వారికి బలి ఇస్తాననీ ధైర్యం చెప్పి మళ్ళీ తన లోకానికి వెళ్ళి పోయాడు.అతని భార్య కు విషయం తెలియజేశాడు. ఆమె "హనుమ వంటి మేధావి, రామునికి మంత్రిగా, నమ్మినబంటుగా వుండగా, రాముని జయించటం కష్టం. కాలనేమిని, మాల్యవంతుని, అక్ష, ధూమ్రాక్ష, దానవ సంహారం చేసిన సంగతి గుర్తు లేదా ? హనుమ పై భక్తి కలిగి వుండటం మంచిది." అని హితవు చెప్పింది.

ఆమె మాటలను పెడ చెవిని పెట్టి మైరావణుడు తన ప్రయత్నంలో వున్నాడు.మైరావణుని దుష్ట పన్నాగాన్ని తెలుసు కొన్న విభీషణుని భార్య తన భర్త విభీషణునికి ఈ విషయం తెలియ జేసింది. అతను వెంటనే హనుమ కు చెప్పాడు.రాక్షస మాయ చాలా భయంకరం గా ఉంటుందనీ , వారి మాయను తెలుసు కోవటం కష్టమని, వివేకం తో కపిసేనను, తనను, రామ లక్ష్మణులను కాపాడే బాధ్యత హనుమదే నని స్పష్టం గా చెప్పాడు. అప్పుడు హనుమ "కాలవ్యాలము" అనే పేరు గల తన తోకను పెంచి, కపిసేన చుట్టూ కట్టి దానిపైకి ఎక్కి కూర్చున్నాడు. మైరావణుడు దొంగ వేషంలో వచ్చాడు. హనుమ తోక కోటను గురించి వేగుల వారి ద్వారా విని, వారితో నేలను రహస్యం తవ్వించి,ఆను పానులన్నీ వారి ద్వారా తెలుసుకొని విభీషణుడి వేషం లో అక్కడికి చేరాడు. నమ్మకం గా హనుమతో మాట్లాడి " తోక కోట " లోకి రామ లక్ష్మణులను పరామర్శించే నెపంతో ప్రవేశించాడు.

అక్కడ తన మాయాజాలంతో రామలక్ష్మణులను ఎత్తుకొని పోయి భద్రకాళి ఆలయంలో ఉంచాడు. ప్రమాదాన్ని పసిగట్టిన విభీషణుడు వెంటనే హనుమకు విషయం చేరవేశాడు. హనుమ క్షణం కూడా ఆలస్యం చేయకుండా తన కుమారుడైన మత్స్య వల్లభుని సాయంతో పాతాళ లంకకు చేరాడు. అక్కడ " దుర్దండి " అనే రాక్షసి ని మచ్చిక చేసుకొని, అక్కడి రహస్యాలన్నీ తెలుసు కొన్నాడు. అక్కడ మైరావణుని సేనను సర్వ నాశనం  చేశాడు. మైరావణుడిని సంహరించాడు పుత్ర, పౌత్రులతో సహా, రామలక్ష్మణులను సురక్షితంగా లంకకు చేర్చాడు. తనకు సహాయ పడిన దుర్దండి కొడుకుకు పాతాళ లంకా పట్టాభిషేకం చేశాడు, కృతజ్ఞతగా. ఇది తెలుసుకొన్న రావణుడు " ఖడ్గ రాముడు " అనే రాక్షసుణ్ణి ఉసి కొల్పి పంపాడు. ఆంజనేయుడు వాడిని మెడ నులిమి మట్టు పెట్టాడు.

ఇలా ధైర్యంతో, వివేకంతో ఉపాయంతో శ్రీ రాముడినీ రామానుజుడినీ, కపి సైన్యాన్ని దుష్ట రాక్షసుల నుండి రక్షించి తన మంత్రిత్వానికి, స్వామి భక్తికి నిదర్శనంగా నిలిచాడు వాయు పుత్ర హనుమ.



# శ్రీ హనుమ కథానిధి - 16
# గంధ మాదన కథ

రావణ వధ జరిగిన తర్వాత శ్రీ రాముడు అందర్నీ పుష్పక విమానం లో అయోధ్యకు తన పట్టాభిషేక సంరంభాన్ని  వారు చూడాలని విన్నవించు కొంటె తేసుకొని వెళ్ళాడు. అందరు విమానం ఎక్కి కూర్చున్నారు. కాని గంధమాదనుడు అనే వానరుడు అందులో యెక్కలేదని తెలుసు కొన్నారు. శ్రీ రాముడు హనుమను పిలిచి అతడు ఎక్కడ ఉన్నాడో వెతికి తీసుకొని రావలసినది గా కోరాడు. అప్పుడు విభీషణుడు గంధ మదనుడు కుంభకర్ణునితో జరిగిన పోరాటంలో చనిపోయాడని తెలియ జేశాడు. శ్రీ రాముడు అంతకు ముందే దేవతలన్దర్నీ  ప్రసన్నం చేసుకొని  యుద్ధంలో వీరమరణం చెందిన తన సైన్యాన్ని అంతటినీ పునరుజ్జీవితులయ్యేట్లు చేసుకొన్నాడు. గంధ మాదనుడి విషయం ఎవరికి గుర్తులేదు. ఈ విషయం తెలిసిన శ్రీ రాముడు దుఖంతో తల్లడిల్లాడు. అపుడు జాంబవంతుడు హనుమ ఈ పని చేయ గలడు అని చెప్పాడు. అప్పుడు రాముడు హనుమను పంపటం జరిగింది.

హనుమ ఒక్కసారిగా తన శరీరాన్ని విశ్వ మంతటా విస్తరించాడు. తోకను పెంచాడు. భూమి దద్దరిల్లేట్లు ప్రణవం చేశాడు. తన తోకను నుదిటికి తాకించి కుండలినీ శక్తిని ప్రజ్వలించి, ఆజ్ఞా చక్రాన్ని ఛేదించి, సహస్రారాన్ని తాకి ఒక యోగిలాగా సర్వాంతర్యామిగా ఎదిగి పోయాడు.ఆకాశానికి  ఎగిరాడు. లోకాలన్నీ భయంతో గడ గడ వణికాయి. అదే వేగంతో యమలోకానికి చేరాడు. ద్వారం దగ్గర నిలబడి సింహ గర్జన చేశాడు. యముని సింహాసనం తుళ్ళి పడింది. భయంతో కంపిస్తున్న మేనుతో హనుమ ముందుకు చేరి చేతులు జోడించి నమస్కరించి పూజించాడు. విషయం వివరించాడు హనుమ. అప్పుడు యముడు గంధమాదనుడు తన యమపురి లో లేడని బ్రహ్మలోకంలో ఉ న్నాడని తెలియ జేశాడు.

యమునికి నమస్కారాలు తెలియజేసి బ్రహ్మలోకం చేరాడు వాయుపుత్రుడు,...అక్కడి దేవతలు, మునీశ్వరులు, నారద ముని అందరూ హనుమకు స్వాగతం పలికారు. హనుమ బ్రహ్మ దేవుడికి నమస్కరించి

తాను వచ్చిన పని చెప్పాడు. అప్పుడు బ్రహ్మ దేవుడు " హనుమా ! రామ కార్యం కోసం గంధ మాదనుడు శరీరత్యాగం చేసి అమరుడయ్యాడు, మళ్ళీ అతను భూలోకానికి రాకూడదు. అయినా ప్రతిజ్ఞ చేసి వచ్చావు కనుక నీకోసం అతన్ని బ్రతికిస్తాను " అన్నాడు. వెంటనే అతను అక్కడ ప్రత్యక్ష మయ్యాడు. అతన్ని ప్రేమాభిమానాలతో అక్కున చేర్చుకొన్నాడు హనుమ. వాణిపతి అనుజ్ఞ తీసుకొని అతనితో శ్రీ రామ సన్నిధి చేరాడు. గంధమాదనుడిని శ్రీ రాముడు కుశల ప్రశ్నలతో ఆప్యాయంగా కౌగిలించు కొన్నాడు. వానరులంతా అతని శరీరాన్ని తాకి పాత విషయాలన్నీ గుర్తు కు తెచ్చు కొన్నారు.హనుమతో రాముడు " హనుమా ! నువ్వు సాక్షాత్తు బ్రహ్మవే. లేకపోతే చనిపోయిన వాడిని మళ్ళీ బ్రతికించటం ఎవరి వల్ల సాధ్యం ?" అని మెచ్చుకొన్నాడు. మాట నిలబెట్టు కోవటం హనుమకే సాధ్యం. దాని కోసం ఎవరినైనా ఒప్పించగలడు, మెప్పించగలడు. అవసరమైతే నోపించగలడు. అదీ హనుమ పని తీరు. లోకోప కారి, స్వామిభక్తి పరాయణుడు, కార్యశూరుడు మన అంజనీ పుత్రుడు హనుమ.

# శ్రీ హనుమ కథానిధి - 17
# రామేశ్వర శివలింగ ప్రతిష్ట

ఒక రోజు శ్రీ రాముడు తన దగ్గరకు వచ్చిన ముని శ్రేష్టులతో " మహాత్ములారా ! వేద వేదాంగ పారంగతుడు, పులస్త్య బ్రహ్మ కుమారుడు బ్రాహ్మణుడు అయిన రావణాసురున్ని సంహరించాను.అది బ్రహ్మహత్యా పాతకం అని నా మనసు చెబుతోంది. నేను ఆ పాపాన్ని నివారించు కోవాలి అంటే ఏమి చెయ్యాలో శెలవివ్వండి."అని ప్రార్ధించాడు. దానికి ముని సత్తములు అంజలి ఘటించి " శ్రీ రామా ! నువ్వు పరమాత్మవు. నీకు దోషం అంటదు. లోకాన్ని



అనుగ్రహించటానికే మమ్మల్ని ఈ ప్రశ్న అడిగావు. ఇక్కడే ఈ గంధమదన పర్వతం దగ్గరే శివలింగ ప్రతిష్ట చెయ్యి. దోషాలు నివారింప బడుతాయి. కాశీ విశ్వనాధుని దర్శనం కంటే ఇప్పుడు నీవు చేయ బోయే శివలింగ ప్రతిష్ట అనేక రెట్లు పుణ్యఫలం లభింప జేసి గొప్ప క్షేత్రంగా వర్ధిల్లు తుంది" అని విన్న వించారు. అప్పుడు రామచంద్రమూర్తి మారుతి వైపు తిరిగి " హనుమా ! కైలాస పర్వతం చేరి శివలింగాన్ని ఒక నాలుగు ఘడియలలో తీసుకొని రావాలి తేగలవా ? "అని ప్రశ్నించాడు. దానికి సమీర తనయుడు " మీరు ఆజ్ఞా పిస్తే అదెంత పని స్వామీ ! " అన్నాడు. అనుజ్ఞ ఇచ్చి పంపాడు రాఘవుడు. ఒక్క సారిగా ఆకాశానికి కుప్పించి ఎగిరాడు. భూమి కంపించింది. కైలాసం చేరాడు. అక్కడి వారంతా భయ కంపితులయేట్లు వుంది అతని రూపం. శివలింగం కోసం వెతికితే ఎక్కడా కనిపించ లేదు. బలం పనికి రాదు. తపస్సు చేతనే లింగ దర్శనం అవుతుందని భావించాడు. కాలి బొటనవ్రేలు మీద మాత్రమే నిలబడి తపస్సు చేశాడు. ఊపిరి బిగ పట్టాడు. సూర్యునిపై చూపు నిలిపాడు. విశ్వాసం అణువణువునా నిండిన మనస్సుతో తీవ్ర తపం సలిపాడు. శివుడు మెచ్చి వెంటనే ప్రత్యక్షమయ్యాడు." కోరిక ఏమిటి ?"

అని శంకరుడు ప్రశ్నించాడు " శంకర ప్రభూ ! భూలోకంలో నీ మిత్రుడు, సోదరుడు శ్రీ రామచంద్రుడు శివలింగ ప్రతిష్ట చేసి బ్రహ్మహత్యా పాతకాన్ని తొలగించుకోవాలని తలచాడు. నన్ను నీ దగ్గరకు పంపి మీ అవ్యయ లింగాన్ని నాలుగు ఘడియల లోపల తెమ్మని ఆజ్ఞాపించాడు" అని మనవి చేశాడు. పరమశవుడు తక్షణమే రెండు లింగాలను అనుగ్రహించి అంతర్ధాన మయాడు. ఇక్కడ భూలోకంలో మునులందరూ ముహూర్త సమయం దాటిపోతోందని భాధ పడుతున్నారు. రామునితో వాళ్ళందరూ " శ్రీ రామ ! హనుమ ఆలశ్యం చేశాడు. ముహూర్త సమయం మించి పోకముందే సీతాదేవితో ఇసుకతో లింగాన్ని చేయించి ముహూర్త సమయానికి ప్రతిష్ట చెయ్యి" అని సూచించారు. సరేనని తన అంగీకారం తెలిపాడు. సముద్రస్నానం చేసారు. సీతారాములు జ్యేష్టమాసంలో

శుక్లపక్షంలో దశమి, బుధవారంనాడు హస్తా నక్షత్రంలో వ్యతీపాత యోగంలో, సూర్యుడు వృషభంలో, చంద్రుడు కన్యలో వుండగా మహాపుణ్య దశాయోగంలో గంధమాదన పర్వతం వద్ద సేతు మధ్యమంలో ఆపుణ్య దంపతులు సైకత లింగ ప్రతిష్ట చేసి మహర్షుల దివ్య ఆశీర్వాదాలు అందుకొన్నారు.

మహేశ్వర ధాన్యంతో నమక, చమకాదులతో పురుషసూక్త విధానముగా పంచామృత స్నానం చేయించి సకల పుణ్య నదీజలాలతో అభిషేకం జరిపి నూతన వస్త్ర, ఆభరణాదులు సమర్పించి శివ సహస్రనామాలతో పూజించి ప్రదక్షిణ నమస్కారాలను అధిక భక్తిశ్రద్ధలతో చేసి వివిధ స్తోత్రాలతో మహేశ్వరుడిని స్తుతించారు. అందులో నాగబంధం అనే ఛందస్సులో శ్రీ రాముడు చేసిన శివస్తోత్రం దివ్య విభూతి కల్గిస్తుంది.

" జయ జయ సామగేయ – హర – సారసగర్భ శిరోహరపురం జయ – విమలా భిదేయ – మృగ సంగత హస్త

– మఖాతిభంగాధ భయ – దాహనాగనేయ – భవభావజ గర్వ భిదా – అమోహా – అవ్యయ మతిదా – శివా – అసుర

వారక పుణ్యదా – రామలింగమా"శివుడు పరమానంద భరితుడై ప్రత్యక్షమయ్యాడు. ఈ రామేశ్వర లింగం సకలజన దోషహరమనీ, సకల పుణ్యదము అని చెప్పి శివుడు అంతర్ధానమయ్యాడు. రామేశ్వరుని నిత్యాభిషేకానికి శ్రీ రాముడు తనబాణములతో ఒక నుయ్యి త్రవ్వాడు. అదే నేడు " కోటి తీర్థం " గా పిలువ బడుతోంది. ఆజలాలలో స్నానం చేస్తే శివ సాయుజ్యం లభిస్తుందని శ్రీ రాముడు అందరికీ తెలియజేశాడు. ఆ కోటి తీర్థాన్ని దేవతలు, మహర్షులు, సిద్ధులు, సాధ్యులు పూజించి ఆ జలంతో రామేశ్వరునికి పుణ్యాభిషేకం చేసి ధన్యులయ్యారు.



# శ్రీ హనుమ కథానిధి -18
# శ్రీకైలాసలింగ ప్రతిష్ట

హనుమ మనస్సులో మధనపడుతున్నాడు. తాను ఆలస్యం చేసానేమోనని, ఇక్కడ జరగరానిది జరిగిందేమోనని అనుకొంటూ కిందికి దిగాడు. అక్కడి దేవతలు, మునులు, యక్ష, కిన్నెర, కింపురుషులు, గంధర్వాదులందరూ సంరంభంగా సైకతలింగాన్ని అర్చించటం గమనించి దు:ఖితుడైనాడు. శ్రీ రాముని సమీపించి " రామా ! నాలాంటి కొడుకు ఏతల్లికి పుట్టకూడదు. అనుకున్న పనిని అనుకున్న సమయంలో చేయలేకపోయాను. నాకు మరణమే శరణ్యం ; " అన్నాడు. హనుమను ఓదార్చటానికి శ్రీ రాముడు అద్వైతబోధ చేసాడు.

" హనుమా ! నేను వేరు, నీవు వేరు అనుకోవటం వల్ల నీకు ఈ దు:ఖం వచ్చింది. అద్వైత సిద్ధి కలిగితే ఇది నశిస్తుంది. నువ్వు చిత్‌స్వరూపుడవు. శరీరమే నేను అనే అహంకారం పోతేనే తత్వ సిద్ధికి అహంకారం కల్గుతుంది.

ఆత్మ స్తితిలో నిశ్చలత్వం పొందాలి. మంచి గురువు లభిస్తేనే జ్ఞానం కలుగుతుంది. కోరికవల్లనే కర్మ, కర్మనుబట్టి సుఖదు:ఖాలు కలుగుతాయి. వివిధ జన్మలకు ఇదే కారణం. ముందుగా " దేహి – దేహి " భేదాన్ని తెలుసుకోవాలి. దేహాభిమానం నశించిన తరువాత అంతా ఆనందమే.మాయ వల్ల ఈ జగత్తు వున్నట్లు అనిపిస్తుంది. కాని శాశ్వతమైన ఉనికి దానికి లేదు. పురుష ప్రయత్నం వల్లనే పనులు నెరవేరుతాయి. పరమాత్మ నిత్యం. ప్రపంచం మిధ్య. ప్రపంచం నిజంగా బయటలేదు. మనలోపలే వుంది. పంచభూతాలకు, పది ఇంద్రియాలకు, విషయాలకు, చిత్తవృత్తులకు తెలియబడకుండా, తానే తెలివియై అన్నిటిని తెలుసుకొంటున్న తెలివి అనేది ఏదైతే వుందో, దాన్ని తెలుసుకో. లోకం అంతా జ్ఞాత్రు,జ్ఞేయ, జ్ఞానం అనే త్రిపుటీ మీద ఆధారపడి వుంది. ఈ త్రిపుటి నశిస్తే అసలుజ్ఞానం అఖండమైన అద్వైత చైతన్యమే.త్రిగుణాలను బయటకు నెట్టి, విశాల బుద్ధితో ఆలోచిస్తే " తత్వమసి " బోధ పడుతుంది. జ్ఞానంతో ఆత్మనే చింతించు.

అప్పుడు భవ రోగాలు నశిస్తాయి. "నువ్వు చేసిన పని – నేను చేశిన పని " అనే భేదభావం వదిలించుకో. ముహూర్తం మించి పోతోందని మహర్షులు హెచ్చరించటంతో సీత సైకతలింగాన్ని చేస్తే దాన్ని ప్రతిష్టించాం. నువ్వు తెచ్చిన లింగాన్నినీ చేతులతో ప్రతిష్ట చెయ్యి. అది నీ పేర పిలువబడుతుంది. జనం ముందుగా నీవు ప్రతిష్టించిన కైలాస లింగాన్ని పూజించి, తరువాతే సైకతలింగాన్ని పూజిస్తారు, నువ్వు కూడా చాలామంది బ్రహ్మ రాక్షసులను సంహరించావు కదా. ఆ పాప పరిహారం అవుతుంది. అంతేకాదు మేము చేసింది ఇసుక లింగమేకదా. దీనిని తీసేసి నువ్వు తెచ్చిన లింగాన్నే ప్రతిష్టించుదాం అని నీకు అనిపించవచ్చు. కాని దాన్ని పెకలించటం అసాధ్యం.సైకత లింగం సప్త పాతాళాలను దాటి ఆక్రమించుకొని వుంది. నీకు చేతనైతే పీకేసి నువ్వు తెచ్చిన లింగాన్ని ప్రతిష్టించు." అని హిత బోధ చేశాడు.

స్వామి అనుజ్ఞ అయింది కదా నన్న సంతోషం తో, ఇసుక లింగాన్ని తోకతో చుట్టి పీకే ప్రయత్నం చేశాడు హనుమ. రాముడు చెప్పినా హనుమ ఎందుకు ప్రయత్నం చేశాడు. అని మనకు సందేహం వస్తుంది. శ్రీ రామనాథేశ్వర లింగం కేవలం ఇసుక లింగం కాదు, అది పరమాద్భుతమైన, మహిమాన్వితమైన లింగం అనిలోకానికి చాటటమే. రాముని మహిమ అంతటిది అని తెలియ జేపట్టటమే. హనుమ ప్రయత్నం ఫలించలేదు. లక్ష్మణుడు వద్దని వారించాడు. " రాముని బ్రహ్మాస్త్రం కంటే ఈ లింగం చాలా గొప్పది. ప్రయత్నం మానుకో " అని చెప్పాడు విభీషణుడు. అయిన పెడచెవిని పెట్టి,తన బల శౌర్య పరాక్రమాలన్నీ ఒడ్డి ప్రయత్నించాడు హనుమ. ఇక శక్తి అంతా ఖర్చు అయి పోగా, హనుమ మూర్ఛపోయాడు. సీతా రామలక్ష్మణులు దు:ఖించారు. సైన్యం అంతా దు:ఖసాగరంలో మునిగిపోయింది. కొంతసేపటికి శ్రీ రాముడు హనుమ శరీరాన్ని స్పృశించాడు. అప్పుడు మూర్ఛ నుంచి తేరుకొన్నాడు. తన తప్పు తెలుసుకొని మన్నించమని వేడుకొన్నాడు. సీతా దేవి మారుతి తో " ఆంజనేయా ! రాముడు సకల జ్ఞానకళానిధి. ఆయన ఏది చేసినా లోకోపకారానికే. ఒక పరమ



ప్రయోజనం కోసమే సైకత లింగాన్ని ప్రతిష్టించారు స్వామి.దాన్ని తేలిగ్గా తీసుకొని భంగపడ్డావు. ఇలాంటి కాని పనులు ఇక ముందు చేయకు. జరిగింది మర్చిపో. నీ మనుస్సుద్ధి దాశరథికి తెలుసు " అని అనునయించింది. తరువాత హనుమకు సీతా దేవి తన అవతార రహస్యాన్ని బోధించింది. దానిని తరువాత గ్రహిద్దాం.

## శ్రీ హనుమ కథానిధి -19
## తన అవతార తత్వాన్ని సీతా దేవి హనుమకు వివరించటం

తన అవతార తత్వాన్ని సీతా దేవి హనుమకు వివరించటం హనుమకు సీతా సాధ్వి తన అవతార రహస్యాన్ని వివరిస్తుంది." హనుమా ! నా యదార్ధ స్వరూపాన్ని వివరిస్తాను విను. ఈ సృష్టికి కారణమైన ఒక మహాశక్తి విశ్వ వ్యాపితం అయివుంది.అదే చిత్‌శక్తి. అది అనాది. స్వతంత్రమైంది. అది నేనే. మొదట పురుషుని ఉత్పత్తికి కారణం ఆ శక్తే. ఆ పురుషునిలో పుట్టిన సృష్టి చేయాలి అనిపించింది ఆ మహా శక్తి యే. అదే తపశ్శక్తి.ఆయన కూ, ఆ తపశ్శక్తికీ తేడా లేదు. ఆయన్నే సదాశివుడని, ఆ తపసితి కే " హైమావతి " అనీ పేర్లు. లోకానుగ్రహం కోసం వారు శివ పార్వతులుగా లీలా రూపాలను ధరించారు. అదే ఆది దైవిక రూపం. ఆ శివ, శక్తి స్వరూపాలు రెండు, మానవ శరీరంలో కుడలినీ శక్తిరూపంలో వుండి జీవ వ్యాపారానికి ఆధారంగా వున్నాయి. అదే ఆధ్యాత్మరూపం.

ఈ విశ్వానికి కేంద్రం ఆ సత్య పురుషుడే. ఆయన చుట్టూ ఆయన తపశ్శక్తి వ్యాపించి వుంటుంది. అదే తపోలోకం. ఈ రెండిటిని శివ,శక్తి అంటారు. ఈ రెండిటికీ భేదం లేదు. ఆ మహాపురుషుని శక్తి ఆవరణం నుంచి, ఇంకొక శక్తి ఆవరణం ఏర్పడింది. అదే జనోలోకం. ఈ మూడింటినీ సత్, చిత్, ఆనందం అంటారు. ఈ జనోలోకానికి వ్యోమము, అంతరిక్షము, గగనము అని పేర్లు.

ఈశ్వరుని కళా రూపమైన ఆ తపశ్శక్తికి దాక్షాయిని,సతి, హైమవతి, శివ, భవాని, ఉమా, కామేశ్వరి, శివ కామిని, గిరిజ, పార్వతి, అనే నామాలున్నాయి. ఆ శక్తి కి ఆశ్రయభూతుడు " సత్ " అయితే ఆమె " సతి " అవుతుంది. ఆయన భవుడు అయితే ఆమె భవాని. ఆమెనే ప్రాణము అనీ పిలుస్తారు.

ప్రమోద, కళావాదులు " ఆనంద రూపిణి " అంటారు. వీరినే రస వాదులు అంటారు వీరికి వేదం లోని " రాసోవై సహ" అనేది ప్రమాణం. ప్రాచీనులైన పూర్వమీ మాంసా వాదులు మంత్రాలతో అగ్ని హొత్రంలో ఆహుతులను సమర్పించి ఆశక్తిని ఉపాశిస్తున్నారు. తాంత్రికులు శ్రీ విద్యోపాసనతో ఆరాధిస్తున్నారు. దేవాలయాలలో అర్చనా మూర్తులను పూజించటం ఇందులోని భాగమే.యోగులు కుండలినీ శక్తి ఉల్లాసాన్ని పొంది అమృత సిద్ధి పొందుతునారు. ఇంకా సంగీత, సాహిత్య,నాట్యాలతో రసవాదులు " నాద రూపిణి" గా ఆరాధిస్తారు. ఇన్ని భేదాలతో ఆరాధించినా, వారంతా ఆరాధించేది ఒకే శక్తినే అని మరువరాదు. ఆంజనేయా ! నువ్వు నీ తనువు, మనస్సు ప్రాణాలతో మా ఇద్దరినీ కొలుస్తున్నావు. శ్రీ రామచంద్రుడు అంటే ఆ సత్య పురుషుని అవతారమే. ఆయనే ఈ సృష్టికి కేంద్రం. ఆయనే సదాశివుడు. సర్వరాసాశ్రయుడు ఆయనే ధార్మికుడు. ఆయన శక్తి నేనే. మా ఇద్దరికీ ఆ భేదమే. నేను చిన్మయ రూపిని. నేనే సావిత్రి, గాయత్రి, నేనే సతిని. సతీత్వం అంటే పురుషునితో నిరంతర సహచర్యమే నయ్యా. ఈ శక్తినే " సంహిత " అంటారు. సీతారాములుగా పిలవబడే మేమే " సంహితా స్వరూపులం ". నేను వేదమాతను. సరస్వతిని. నేనే " శ్రీ " ని. అందరికీ నయనానందాన్నిచ్చే సూర్య, చంద్ర, విద్యుత్, అగ్ని, పుష్ప, పాలవ, మణి మౌక్తిక, సువర్ణాదుల కాంతినే "శ్రీ " అంటారు నాయనా ! ఆశోభను నేనే. మేమిద్దరం అవతారమూర్తులం అన్న రహస్యం తెలుసుకో "అని సీతా మాత మారుతికి ఎరుక కలిగించింది. ఆ తరువాత అవతారం అంటే ఏమిటో వివరించింది.



# శ్రీ హనుమ కథానిధి - 20
# అవతారం అంటే ఏమిటి ?

సీతా సాధ్వి హనుమకు అవతార తత్వం గురించి వివరిస్తుంది. "హనుమా ! అవతరణం అంటే క్రిందికి దిగటం లోకానికి అనుగ్రహం కలిగించటానికి ఒక దేవత కాని, ముక్త పురుషుడు కానీ అవతరిస్తుంటారు. జనుల నిష్కమ కర్మల వల్ల అవతారాలు కలుగుతాయి.నిష్కామ కర్మ చరణం అంటే ఏమిటో చెబుతాను విను. భూమిమీద జ్ఞానులు, ఋషులు, మునులు, తాపసులు, యోగులు, నిస్సంగులు, భక్తులు, సత్పురుషులు మొదలైన వారు స్వార్ధం లేకుండా, లోక క్షేమం కోసం అభ్యుదయం కోసం సుఖశాంతుల వృద్ధి కోసం ఆ పరమాత్మను ప్రార్ధిన్చటమే.

అందరూ ఫలాపేక్ష తో కర్మ చేస్తే, వీరు ఫలాపేక్ష లేకుండా చేస్తారు.అది తేడా. భగవంతుని భౌతిక వాంఛల కోసం దగ్గరకు వెళ్ళ రాదు. సర్వలోకహితమే ధ్యేయంగా చేరితే అది లోకోపకారం అవుతుంది. మనిషికి కావలసినవన్నీ భగవంతుడు సృష్టిస్తూనే వున్నాడు. కనుక వీటి కోసం ప్రార్ధిన్చనక్కరలేదు. ఈతి బాధలు వుంటే తానే పరిష్కరించుకోవాలి. సమస్యలను మనిషే సృష్టించుకొని, భగవంతుణి పరిష్కరించమనటం న్యాయం కాదు.

" నిష్కామ కర్మమే యజ్ఞం అంది వేదం.యజ్ఞంఅంటే పరిపూర్ణ త్యాగం. సృష్టి, మానవునికి త్యాగ గుణాన్ని బోధిస్తుంది. జ్ఞాని దాన్ని తెలుసుకొని ముక్తుడు అవుతున్నాడు. అజ్ఞాని ప్రకృతి మాయలోపడి బంధితుడవుతున్నాడు. ఈ సృష్టిలో నాలుగు రకాలయిన జీవులు వున్నాయి. ఉద్భిజములు, స్వేదజములు, అండజములు, జరాయుజములు. అవి ఒకదాని కంటే ఇంకోటి ఉత్తమంగా వుంటాయి. కొండలు జడ ప్రాయంగా భావిస్తారు. వాటికి ప్రాణం వుంది అయితే ఆ ప్రాణం సుషుప్తి అవస్థలో వుంది. వాటిలోని ప్రాణాన్ని ఆశ్రయించుకొని వాటిపై అడవి పెరుగుతుంది. దాన్ని ఆశ్రయించుకొని పశుపక్ష్యాదులు జీవిస్తాయి.

ప్రాణవికాసం ఊర్ధ్వగతిలోనే వుంటుంది. ప్రాణం, పరమాత్మను చేరుకొనే గతిలో, క్రింది తరగతి సృష్టి, పైతరగతి కోసం ఎప్పుడు ఆహుతి అవుతూనే వుంటుంది. ఇదే యజ్ఞం. ఇది నిరంతరం జరుగుతూనే వుంటుంది. ఇదే స్థితికారకుడైన విష్ణు కథలయొక్క అంతరార్ధం. " శుద్ధ సత్వరూపుడైన సత్య పురుషుని నుంచి వ్యక్తమైన ఈ సృష్టి, తమోగుణ, రజోగుణాలను వదిలించుకొని, శుద్ధ సత్వాన్ని సంతరించుకోవటంతో సృష్టి చక్రం పూర్తి అవుతుంది. ఈ తమో గుణ, రజోగుణ ఆధిక్యం గల సృష్టి అంతా సత్వగుణ రూపుడైన పరమేశ్వరుని ముందు ఆహుతి కావాల్సిందే. ధర్మం జయించి, అధర్మం నాశనం అవుతుంది. తపస్సు చేసినా, ఎన్ని వరాలు పొందినా రావణాసురుడు, శుద్ధ సత్వ సంపన్నుడైన రాముని చేతిలో ఓడిపోయాడు.

అదే విధి విక్యం అంటే. జీవులు అంతా ఏదోఒక నాటికి ముక్తులు కావలసిందే. కనుక మానవులు నిష్కామ కర్మతో, సత్వ గుణాన్ని పొంది ప్రకృతి యజ్ఞాన్ని చేస్తూ, అందులో భాగస్వాములై శాంతి సౌభాగ్యాలతో జరా మృత్యువులను జయించి, జీవన్ముక్తులు కావాలి. " అని చాలా వివరంగా హనుమకు అవతార రహస్యాన్ని వివరించింది సీతా దేవి.

ఆ తరువాత తమ అవతార రహశ్యాన్ని తెలియజేశింది. ఆ వివరాలు తరువాత తెలుసుకొందాం.

## శ్రీ హనుమ కథానిధి - 21
## సీతా రాముల అవతార రహస్యం

హనుమకు సీతాదేవి తమ అవతార రహస్యాన్ని వివరిస్తోంది. "హనుమా విను. భూమి మీద సత్పురుషులు పరమేశ్వరార్పణంగా చేసే నిష్కమ కర్మలనే యజ్ఞాలు అంటారు. యజ్ఞమే విష్ణువు. విష్ణువే లోక స్థితి కారకుడు. కేవలం ఋషుల, మునుల, జ్ఞానుల, యోగుల నిష్కామ కర్మ రూపంలోని శక్తి మాత్రమే ఈ సృష్టి నిలబడటానికి కారణం. తమో గుణం నిద్ర లేవటానికి రజోగుణమే



పనిచేస్తుంది. సత్వ గుణం రజో గుణాన్ని సంహరిస్తుంది. లేకపోతే లోకంలో శాంతి వుండదు. ఇది అంతా ప్రకృతి సిద్ధం. సహజం. ఇదే శాంతిరసం. ఇది సహజ స్థితిని పోగొట్టుకొన్నపుడు శృంగార, హాస్య, కరుణ, రౌద్ర, వీర భయానక, భీభత్స అధ్భుత రసాలు చెలరేగి పోతాయి. ఇదే సృష్టి నియమం. దీన్ని ఎవరు అతిక్రమించలేరు. రక్తపాతం జరిగిందని ఏడిస్తే అది అజ్ఞానమే. జ్ఞానులు శోకించరు. కారణం వాళ్ళు ఎప్పుడూ వెలుగులోనే వుంటారు.

మనిషి కర్మాచరణ వల్ల సంసారి అవుతాడు. సత్పురుషుల నిష్కామ కర్మ వల్ల అవతార పురుషుడు ఏర్పడుతాడని ఇది వరకే చెప్పాను. మానవులు ఆ అవతార పురుషుని వెలుగులో చాలాకాలం ప్రయాణం చేస్తారు. రాముని బుద్ధి వలన బాధలు అనుభవించిన దేవతలు, మునులు, యోగుల నిష్కామ కర్మ వల్ల మేము అవతారం దాల్చాము. శ్రీ రాముడు యజ్ఞ పురుషుడు. నేను అయోనిజను. భూ పుత్రికను. వీర్య శుల్కను వీరారాధ్యను. అవతార పురుషుని భాగానికి అవసరం అయిన సమస్తం ముందే నిర్మించి వుంటుంది. దాని కొరకు ఒక దేవత వుంటుంది. ఆమెనే లక్ష్మీ లేక శ్రీ అంటారు. అది నేనే. ఆయన కొరకే అవతారం దాల్చాను. లోకంలో ప్రాణుల పుట్టుక పంచాహుతి రూపంలో వుంటుంది. వాటిని వివరిస్తాను విను. మొదటి ఆహుతి – సూర్యుడు

కిరణాలతో జలాన్ని గ్రహిచటం వల్ల సోముడు జన్మిస్థాడు. జలములకు సూర్యుడు మొదటి ఆహుతి. రెండవ ఆహుతి – సోముడు పర్జన్యునిలో ఆహుతి అవుతాడు. అప్పుడు వర్షం పడుతుంది. కనుక సోమునికి పర్జన్యునిలో ద్వితీయ ఆహుతి. మూడవ ఆహుతి – వర్షం భూమి మీద ఆహుతి అవుతుంది. దాని వలన ఓషధులు అన్నం పుడుతున్నాయి. వర్షానికి భూమి యందు తృతీయాహుతి. నాల్గవ ఆహుతి – అన్నం ప్రాణుల్లో ఆహుతి అవుతోంది. దాని వల్ల వీర్యం పుడుతుంది. ఇదే అన్నానికి పురుషునిలో చతుర్ధ ఆహుతి. అయిదవ ఆహుతి– వీర్యం స్త్రీ గర్భంలో ఆహుతి అవుతుంది. దాని నుంచి జీవుడు జన్మిస్తాడు. కనుక వీర్యానికి స్త్రీ గర్భంలో పంచామాహుతి అవుతోంది. దీనినే పంచాహుతి క్రమం అంటారు.

" నేను తృతీయాహుతిలో అంటే వర్షం భూమి మీద పడినప్పుడు ఆ వుదకాలనుండి జన్మించాడు. ఈ సృష్టి అంతా పంచ భూతాత్మకం. పంచ భూతాలమీద నాదే ఆధిపత్యం. హనుమా ! చంద్రునిలోని వెన్నెల రూపమైన సోమ కళను నేనే. మెరుపు లోని ఐంద్రీయ శక్తిని నేనే. ఇంద్రుని వజ్రంలో, అగ్నికి జ్వాలలో, సూర్యుని కాంతిలో, చంద్రుని వెన్నెలలో, జీవుడికి నేత్రంలో వున్నవినాజ్యోతిర్విషేష వైభవాలే. జాగ్రత్ అవస్త లో బుద్ధిగా స్త్రీ లలో వృద్ధి రూపంలో, ధీరుల్లో నిష్టగా, సాధకులలో ప్రేరణ శక్తి గా నేను వుంటాను. యోగుల అమృత సిద్ధికి కారణం అయిన శిరసు లోని చంద్రకళ నేనే. ద్వైతులకు భయంకర రూపిణిగా జీవ బ్రహ్మైక్యం పొందేచిన్మాత్ర స్వరూప, శాంతి స్వరూపునిగా గోచరించేది నేనే. సకల దేవతలు నన్నే స్తుతిస్తారు.

అందుకే నేను లోక మాతను. మారుతీ ! నువ్వు చేసిన అఘాయిత్యం వల్ల నీ రక్తం భూమి మీద పడి ఈ ప్రదేశం అంతా రక్త కాసారం అయ్యింది. దీన్ని ఇక నుంచి " హనుమ త్కుండం " అని పిలుస్తారు. ఇది పాపాలను పోగొట్టే వరదాయిని అవుతుంది. ఈ తటాకంలో స్నానం చేస్తే సర్వ శుభాలు లభిస్తాయి. ఆరోగ్యం, గురు కటాక్షం లభిస్తాయి. మానసిక తాపాలు పోతాయి. ఇది జగజ్జన జీవనం. అమృత ప్రాయం. అన్ని నదిలో స్నానం చేసినవారి కంటే అధిక పుణ్య ఫలదం. ఇక్కడ పితరులకు తిలోదకాలిస్తే వారు శాశ్వత బ్రహ్మ లోకప్రాప్తి పొందుతారు. ఈ విధంగా సీతాదేవి హనుమ శోకాన్ని తగ్గించి జ్ఞానం ప్రసాదించింది. సీతారాముల కోరికపై హనుమ తాను కైలాసం నుంచి తెచ్చిన శివలింగాన్ని హనుమత్కుండంలో ప్రతిష్టించారు. సైకత లింగాన్ని పెకలించి నప్పుడు లింగం మీద తోక గుర్తులు ఇప్పటికీ కనిపించడం విశేషం.

ఈ కథ ను విన్న, చదివిన, చెప్పినా అందరికీ శుభం జరిగి సాయుజ్య ప్రాప్తి లభిస్తుంది. హనుమ కథలు జన్మ రాహిత్యానికి కారణాలు. మిగిలిన విశేషాలు ఇంకో కథలో తెలుసుకుందాం.



# శ్రీ హనుమ కథానిధి-22
# శ్రీ హనుమ విరాట్ స్వరూపం

రావణ సంహారం తర్వాత శ్రీ రాముడు లంకనుంచి అందరితో అయోధ్య చేరి వైభవంగా పట్టాభిషిక్తుడయ్యాడు. అన్నీ తనే అయి హనుమ కార్య క్రమం అంతా దగ్గరుండి నడిపించాడు. శాక ద్వీపం నుంచి ఉత్తర సముద్రపు నీరు క్షణాలలో తెచ్చాడు. శ్రీ రాముడు హనుమంతుని సేవలకు మురిసి పోయాడు. స్వామి అనుమతితో సీతాదేవి మారుతి కంఠసీమకు మణి హారాన్ని అలంకరించింది. ఇద్దరు హనుమను ఆశీర్వ దించారు.

ఆంజనేయుని గుణ గానిన్ని రాముడు సీతకు వినిపించాడు. అప్పుడు ఆమె హనుమ శక్తి సామర్ధ్యాలను పొగుడుతున్నారు కదా " శత కన్ధరుని సంహారానికి " అతని బలాన్ని ఉపయోగించుకో వచ్చుకదా అని గుర్తు చేసింది. సీతా దేవి చెప్పిన దానికి రాముడు సంతోషించి, సర్వ సైన్యాన్ని సిద్ధం చేయించాడు.

ఒక్క సారి హనుమ కేసి సాభిప్రాయంగా చూశాడు జానకీ వల్లభుడు. మారుతి పరేంగితావగాహి, సమయజ్ఞుడు కనుక సాష్టాంగ నమస్కారం చేశాడు సీతా రాములకు. యుద్ధానికి తానూ వస్తానని సీతాదేవి కోరగా సరే నన్నాడు జానకీ జాని. హనుమ తన శరీరాన్ని విశ్వరూపంగా పెంచేశాడు. సప్త సాగరాలు అతని ఒకఅంగకు చాలవు అన్నట్లుగా వున్నాడు హనుమ. గ్రహమండలాలు ఒక ప్రక్కకు కూడా రానట్లుంది. ఆదిశేషుడు, ఆదివరాహం, ఆదికూర్మం అన్నీ కలిసి అతని పద ఘట్టానానికి సరిపోవటం లేదు. అతను పెరిగి పోతుంటే ఊర్ధ్వలోకాలన్నీ కిందికి వచ్చేస్తున్నాయి. బ్రహ్మాండం అంతా ఆక్రమించాడు. బలిచక్రవర్తిని మించిన వైభవంతో విష్ణుమూర్తిలాగ మూడులోకాలు నిండి పోయాడు. అతను అడుగు వేస్తే ఊర్ధ్వ లోకాలన్నీ పొడి పొడి అయిపోయేటట్లుంది. అతను నిలిస్తే బ్రహ్మాండం కుప్పకూలి పోయేటట్లుంది. పాదం కదిపితే ఆది వరాహం అప్పచ్చి అయిపోఏట్లుంది. బిగువు చూపితే దిశా వలయం ఫెటిల్లున

పగిలి పోఏట్లుంది. అతనికి ఆగ్రహం వస్తే లోకాలన్నీ గజ గజ వణికే టట్లున్నాయి. సముద్రానికి చెలియలి కట్టలా వుంది హనుమ తోక. బ్రహ్మాండమంతటి శరీరం, నిప్పులు కక్కే యెర్రని కళ్ళు, అంజలి బంధం, శ్రీ రాముని పాదాలపై అచంచల భక్తి తో హనుమ విరాట్ స్వరూపుడుగా విరాజిల్లు తున్నాడు. అందరు హనుమను స్తోత్రాలతో భక్తిప్రపత్తులతో కీర్తించారు. సాక్షాత్తు విష్ణువే అన్నాడు జాంబవంతుడు. చేతులు జోడించి హనుమకు వినయాంజలి ఘటించాడు. సీతాదేవి కన్నులు మూసుకొన్నది.

కొంచెం సేపటికి దీర్ఘదేహాన్ని భూమి మీదకు వంచాడు. శ్రీ రామ సీతా భరత శత్రుఘ్న లక్ష్మణ సమేతంగా సకల నర వానర సైన్యమూ హనుమ వీపు మీద క్రమశిక్షణతో ఎక్కి కూర్చున్నారు. రాముని అనుమతిని పొంది హనుమ ఆకాశానికి ఒక్క సారి ఎగిరాడు. ఎత్తి పెట్టిన తోక, కాడ లాగ వుంది. బ్రహ్మాండం అంతా సీతారాములకు పట్టిన ముత్యాల గొడుగు లాగా అనిపించింది. ఆకాశమార్గంలో హనుమ పయనిస్తుండగా సీతాదేవికి భూమి మీద వింతలన్నీ వివరించి చెబుతున్నాడు రాముడు.

నాలుగు సముద్రాలు దాటి శత కన్ధరుడున్న " మాయా నగరికి " చేరాడు ససైన్యంగా. ఒక ఉపవనంలో రాముని ఆజ్ఞ మేరకు దిగాడు హనుమ. యుద్ధానికి సన్నద్ధమైన ఆ రాజ్యపు సైన్యం మీదనే దిగాడు. వాళ్ళంతా పప్పు పప్పు అయ్యారు. హనుమ మీద కూర్చున్న సైన్యం అంతా నెమ్మదిగా దిగింది. మయాపురిపై యుద్ధానికి సంనద్ధం చేశాడు రాఘవుడు. మిగిలిన కథ తరువాత తెలుసు కొందాం. " సువర్చలాధిస్టిత వామ భాగం-వీరాసనం కపి బృంద సేవ్యం స్వపాద మూలం శరణం గతానాం-అభీష్ట దం శ్రీ హనుమంత మీళే "



# శ్రీ హనుమ కథానిధి - 23
# శత కంధర వధ

ఉపవనంలో విడిది చేసిన సైన్యానికి మాయా నగరాన్ని ముట్టడించమని శ్రీ రాముడు అనుజ్ఞను ఇచ్చాడు. వానరసైన్యం ఆర్భాటాలు చేస్తూ శత్రువుల మీదకు విరుచుకు పడుతున్నారు. కోట గోడను, గోపురాలను కూల్చేశారు. నగర రక్షకులైన కాలకేయులు ఆశ్చర్య పోయారు. మన ముందు కోతి మూక యెంత అని విర్ర వీగారు. కాలకేయ సైన్యం రామదండు మీద దూకింది. రాక్షసులు కర్కశంగా వానరులను చీల్చి చెండాడుతున్నారు. భయపడి పరుగు లంకిన్చుకొన్నారు కపివీరులు. విభీషణుడు అడ్డుపడి వాళ్ళకు ధైర్యం బోధించాడు. మళ్ళీ భీకరమైన పోరు సాగింది. ఉభయ సైన్యాలు ప్రాణాలు ఒడ్డి పోరాడాయి. విభీషణ సైన్యం, కపిసేన కలిసి కాలకేయ సైన్యాన్ని ఎదిరించి పోరాటంచేశాయి.

శతకన్ధరుడు శివ ధ్యానంలో వున్నాడు. యుద్ధ ధ్వనులు భీకరంగా వినిపించాయి. ద్వార పాలకుడిని పిలిచి విశేషం ఏమిటి అని అడిగాడు. వాడు " మహారాజా ! రెండు నెలల కిందట ఒక మహా కపి వీపు మీద ఎక్కి అనంతమైన సైన్యం మన ఉపవనంలో విడిది చేసి, యుద్ధానికి దిగింది. మన కాలకేయులు ససైన్యంగా, పోరాడుతూనే వున్నారు. కాని ఫలితం తేలటం లేదు''. అని వివరించాడు. రెండు వందల చేతులతో భీకరంగా ఉన్న శతకంధరుడు యుద్ధానికి సిద్ధమయాడు. అతనికి అపశకునాలు కనిపించాయి. అయినా లెక్క చేయక రాఘవ సైన్యం మీదికి లంఘించాడు. వాడిని చూడ గానే ఆశ్చర్య పోయాడు రాముడు. గ్రహించిన హనుమ " స్వామీ వీడో లెక్కా చింత వదిలి శరం సంధించండి " అని కర్తవ్యమ్ బోధించాడు. కాని మొదటి దెబ్బ హనుమంతుడే వేశాడు రాక్షస రాజు మీద. వాడి గుండె మీదకు యెగిరి పడికిలితో బలంగా కొట్టాడు. గిల గిల లాడాడు శత కస్తుడు. వాడు రెచ్చి పోయి శూలంవిడిచాడు హనుమ పైకి. దాన్ని కాలితోనే ముక్కలు చేశాడు. వాడు తన రెండు వందల

చేతులతో ముసల, ముద్గర, తోమర, పరశు, భిండివాల, కరవాల, మొదలైన ఆయుధాలను ప్రయోగించాడు ఒకే మాటు. అన్నిటిని మధ్యలోనే తుంచాడు మారుతి. శ్రీ రాముడు హనుమ పరాక్రమ విక్రమాన్ని చూసి మహదానంద పడ్డాడు. రాముడు క్షణం ఆలస్యం చేయకుండా శర సంధానం చేశాడు. వాడు అన్ని చేతులతో బాణాలు విడిచాడు దీటుగా. వాటిని అతి తేలిగ్గా తుక్కు తుక్కు చేసాడు రాముడు. రామునికి సహాయం గా సుగ్రీవ, విభీషణులు వచ్చారు. మళ్ళీ పోరు రసవత్తరమైంది. వాడు వీల్లిద్దరిని కాలితో లాగి తంతే, వెళ్లి లంకలో పడ్డారు పాపం. ఇది గమనించిన హనుమ తన తోకతో లంక దాకా వారధి కట్టాడు. సిగ్గు పడ్డా విభీషణ, సుగ్రీవులు తలవంచుకొని, ఆ వాలం మీదుగా మళ్ళీ యుద్ధభూమి కి చేరారు. ఆ వాల సేతువును చూసి అందరూ భయపడి పోయారు.

మళ్లీ వీరిద్దరూ ఆ రాక్షస రాజు పై కి విజ్రుమ్భించారు.వాడు అవక్ర పరాక్రమంతో కపి సేనను నుగ్గు నుగ్గు చేసాడు. కపిసేన కాన్దిసీకుల్లా యుద్ధరంగం నుంచి పారి పోయింది. అంగద, నల, నీల, జాంబవంతులు కూడా శతకంధరుని ముందు నిలువ లేక పలాయనం చిత్తగించారు. విభీషణుని సైన్యం కుప్ప కూలింది. దీన స్థితి లో వున్న తమ సైన్యాన్ని చూసి భరతుడు, లక్ష్మణుడు విజ్రుమ్భించి యుద్ధం చేశారు. రాముడు వాళ్ళను వారించి, తాను హనుమ భుజం ఎక్కి ఒంటరిగా వాడితో పోరాడాడు. వాడు " నువ్వేనా రాముడంటే ? రావణున్ని వోడించటం గొప్ప కాదు నన్ను వోడించి నీ పరాక్రమం చూపించు" అని మీదకు లంఘించాడు. దీనికి ప్రతిస్పందనగా రాముడు " వీరుడివి అయితె మాటలతో పని లేదు.ప్రతాపం చూపించు". అన్నాడు. వాడిని, వాడి అనంత సైన్యాన్ని రాముడొక్కడే ఎదుర్కొని భీకరం గా అసహాయశూరుని లా పోరాడాడు. వాడు అనేక కామ రూపాలు ధరిస్తూ సింహగర్జన చేస్తూ యుద్ధం చేశాడు. శ్రీ రాముడు వాడి పై శైవ, బ్రహ్మ, నారాయణాది అస్త్రాలు ప్రయోగించాడు. వాటిని శాంతిపజేసి మళ్ళీ రాముని మీదకే వాడు పంపాడు. వాడి శరీరం తూట్లు తూట్లు పడుతోంది. అందు లోంచి కారే ప్రతి రక్తపు



బొట్టునుంచి శత కోటి శతకంధరులు పుట్టుకొస్తున్నారు. రాముడొక్కడే వాడి పై యుద్ధం చేస్తున్నాడు.

శతకంధరుని మరణ రహశ్యం హనుమకు మాత్రమే తెలుసు.ఇప్పటికే యుద్ధం తో విసిగి పోయారు కదా. మరి ఆ రహస్యం ఏమిటో శతకంధరుని వధ ఎలా జరిగిందో తరువాత తెలుసుకొందాము.

# శ్రీ హనుమ కథానిధి - 24
# శతకన్ధరుని మరణం

శ్రీ రాముని శతకంధరుని చాలా ఇబ్బంది పెడుతున్నాడు. హనుమ సహించలేకపోయాడు. వెంటనే గాలి లోకి యెగిరి వాడి శిరస్సును తన్నాడు. పిడికిలితో గుద్దాడు. పళ్ళు పట పట కొరికి రుద్రావతారం దాల్చాడు. వాడి శరీరం నుంచి నెత్తురు వరదలై కారిపోతోంది. దాన్ని చూసి మరీ విజ్రుమ్భించాడు. ఆ రక్తంలోంచి ఎందరో దశకందరులు పుట్టారు. వాళ్ళందరినీ కాళ్ళతో తొక్కి చంపాడు. ఆకాశం అంతా ఆక్రమించి వీర విహారం చేశాడు వీర హనుమ. పంచముఖ ఆంజనేయుని అవతారం దాల్చి ప్రళయకాల అగ్ని లా రెచ్చిపోయి, దానవసేనను వినాశనం చేసాడు. దేవతలు మహర్షులు జే జే ధ్వానాలు చేసి వుత్సాహ పరిచారు. హనుమ వానర సైన్యానికి సంతోషాన్ని రామునికి సేవక భావాన్ని, సుగ్రీవునికి మిత్ర భావాన్ని ఒకే కాలంలో కల్పించాడు.

శ్రీ రాముడు ఆంజనేయుని అవక్ర పరాక్రమం చూసి తను విజ్రుమ్భించి వీరోచిత యుద్ధం చేసాడు.ఎందరినో మట్టు పెట్టాడు. శ్రీరామ పరాక్రమం చూసి సీతా సాధ్వి సంభ్రమ, ఆశ్చర్యాలను ప్రకటించింది. తన నాధుడి శౌర్యానికి కొంచెం గర్వం కూడా కలిగింది. రాముడు అలసిపోయినట్లు నటించి, తన కోదండాన్ని సీతకు ఇచ్చాడు. ఆమె సిగ్గుపడింది. యుద్ధం చేయాలని వుందని రాముడు గ్రహించి అనుజ్ఞ ఇచ్చాడు.

చిరునవ్వుతో భర్తకు కృతజ్ఞతను చెప్పి ధనుష్టంకారం చేసింది. ఒక వాడి బాణాన్ని సంధించి రక్కసి మీదకు వదిలింది. అది వాడి రొమ్ము చీల్చి రక్త ప్రవాహాన్ని సృష్టించింది. శృంగారం, వీరం ఏక కాలంలో ప్రదర్శించి అందర్నీ నిస్తేజితుల్ని చేసింది. వీర నారి సీత నారితో, శ్రీ రామమాలా మంత్రాన్ని స్మరించి దివ్య బాణాన్ని వదిలింది అది ప్రళయకాలాగ్నిలా బయల్దేరి వాడి నూరు శిరస్సులను ఏకకాలంలో ఖండించింది.దేవతలు పుష్పవృష్టి కురిపించారు. ఋషులు ఆశీర్వదించారు. కిన్నెర కింపురుష, గంధర్వులు నాట్యం, గానం చేసి ఆనందాన్ని ప్రకటించారు. గాలి చల్లగా వీచింది. సముద్రాలూ ప్రశాంతంగా వున్నాయి."లోకం పీడ విరగడ అయ్యిందని" అందరు ఆనందంతో సీతా దేవిని అభినందించారు.

శ్రీ రాముడు తన అర్ధాంగి లోకోపకారమైన పని చేసినందుకు మెచ్చి ఆమెకు మణి హారాన్ని బహూకరించారు. ఆమె కృతజ్ఞత తెలుపుతూ, ఆ మణిహారం అతులితబలధాముడు, సర్వ గర్వాపహారి, అరివీర భయంకరుడు, సాహసమూర్తి, స్వామి భక్తాగ్రేసరుడు అయిన హనుమకే చెందాలి అని వినమ్రంగా చెప్పింది." మీరు ఒక్కరే దశకన్ధరున్ని చంపగలరు. కాని లోకంలో నా కీర్తి వ్యాపింపజేయాలని అవకాశం నాకు ఇచ్చారు. పావని మనకు పుత్ర సమానుడు. మీ కారుణ్య నిదానం అతను. ఈ విజయానికి కారకుడు. మన జీవాలను నిల్పిన ఆపద్బాంధవుడు. అతనే ఈ హారానికి తగిన వ్యక్తి " అని పలికింది. జానకీ మనోహరుడు సీతా సాధ్వి మాటకు సంతోషించి హనుమను దగ్గరకు పిల్చి " హనుమా ! మమ్మల్నిద్దర్నీ తల్లిదండ్రులుగా భావించి సేవిస్తున్నావు. ప్రళయం తరువాత ఈ సృష్టికి కాబోయే బ్రహ్మవు నువ్వే. పూర్వం ఈ హారాన్ని నారాయణుడు సృష్టికి ప్రభువుగా చేసి బ్రహ్మకు ఇచ్చాడు.ఆయన ఇక్ష్వాకు మహారాజు త్యాగానికి మెచ్చి ఆయనకు ఇచ్చాడు. ఇక్ష్వాకు రాజులు తరతరాలుగా దీన్ని పట్టాభిషేక సమయంలో ధరిస్తూ వస్తున్నారు. ఇది సార్వభౌమ చిహ్నం.



దీన్ని ధరించిన వారు ఏరూపం కావాలంటే ఆరూపం పొందగలరు. దీనిని ఇతరులు ధరించటానికి అర్హులుకారు. నువ్వు వాయు కుమారుడివి కనుక నీకు ధరించే అర్హత వుంది .ధరించు అని చెప్పి ప్రేమగా శ్రీహనుమ కంఠసీమకు అలంకరించాడు శ్రీ రాముడు. సీత సంతోషం రెట్టింపు అయింది, భర్త తన మాటను మన్నించినందుకు.

మళ్ళీ అందరు హనుమ భుజం ఎక్కి, కైలాసం చేరి శివుని దర్శించి బహుమతులు పొంది అయోధ్యకు తిరిగి వచ్చారు. అందర్నీ విశ్రాంతి తీసుకోమని చెప్పి శ్రీ రాముడు భార్యతో సహా తల్లుల దర్శనం చేశాడు. ఇది పంచముఖాన్జనేయ పరాక్రమ గాథ. విన్నా, చదివినా, చెప్పినా సకల మనోభీష్టితాలు తీరుతాయి.

# శ్రీ హనుమ కథానిధి - 25

## అయోధ్యలో శ్రీ రాముని విందు

శ్రీ రాముడు హనుమ చేసిన సాయానికి కృతజ్ఞతగా అయోధ్యలో గొప్ప విందు ఏర్పాటు చేసాడు. దగ్గరుండి హనుమను విందుకు తీసుకొని వెళ్ళాడు. ఇద్దరు భోజనశాల చేరారు. ఉన్నతాసనం పై శ్రీ రామునికి భోజనం ఏర్పాటు చేశారు. హనుమ నెమ్మదిగా పక్కకు వెళ్ళి కూర్చోబోయాడు. వెంటనే శ్రీ రాముడు అతని చెయ్యి పట్టుకుని తన ప్రక్కనే కూర్చోబెట్టుకున్నాడు. " ఒక్కడివే ఇంతమందిని మోసుకొని శతకంధరుని రాజ్యానికి చేర్చావు. అలసటగా ఉందా ? ఒంటినొప్పులు తగ్గాయా అని హనుమ ఒళ్ళంతా చేతితో తడిమాడు కృపాళువు రాముడు. అతని కళ్ళల్లోకి చూస్తూ చేసిన సేవలను మెచ్చుకున్నాడు. అందరు భోజనాలకు కూర్చున్నారు. వేద మంత్ర పఠనం వీనుల విందుగా సాగుతోంది.

హనుమలో భయం, వినయం, మూర్తీభవించాయి. శ్రీ రాముని పాదాలపైనే అతని దృష్టి అంతా వుంది. సీతా దేవి అందరికీ స్వయంగా భోజనం వడ్డించింది. ఆమె సూర్య, చంద్ర, విద్యుత్, అగ్ని పుష్ప, పల్లవ మణి, హిరణ్యాదుల

సమాహారమే. అందరు తృప్తిగా భోజనాలు ఆరగిస్తున్నారు. బ్రాహ్మణులకు " సర్వత్రా సుభోజ్యమస్తూ ". అని రాముడు ఆపోశానాన్ని ఇచ్చి ప్రాణాహుతులు అయిన తర్వాత ఆంజనేయుడిని చూసి " కుమారా ! ఆహారం తీసుకో.ఆకలిని చల్లార్చుకో " అని ఆప్యాయంగా పలికాడు. మారుతి మరింత సిగ్గుపడి వినయంగా " స్వామీ ! మీరు భోజనం చేయకుండా నేను తింటానా" ? అన్నాడు. అప్పుడు రాముడు తినటం ప్రారంభించాడు. ప్రతి ముద్దకు" హనుమ తిను " అని రాముడు అనటం, ఆతర్వాత హనుమ " నాభాగ్యం నా భాగ్యం " అనటం చివరికి రాముని భోజనం పూర్తి అయింది కానీ హనుమ ఒక్క ముద్ద కూడా తినలేదు. అప్పుడు శ్రీ రాముడు తిన్న భోజన పాత్రను హనుమ లాక్కొని "స్వామీ మీ భుక్త శేషం నాకు ప్రసాదం. అది తినాలి నేను ముందుగా " అని చెప్పి శ్రీ రాముడు గిన్నెలో విడిచిపెట్టిన ఆహారాన్ని భక్తి తో కళ్ళకు అద్దుకొని ప్రసాదంగా భుజించాడు రామభక్త హనుమాన్.

అప్పుడు శ్రీ రాముడు అందరితో " చూసారా !హనుమయొక్క అహంకార రాహిత్యం. మనసులో అనుకోని దానికి తాను అధికారినో కాదో అనుకొన్నాడు. నా పక్కన కూర్చోమంటే భక్తుడికి ఇదితగదు అనుకొని నిలబడ్డాడు. నేను సంతృప్తిగా భుజించిన తర్వాతే భోజనం చేయాలని భావించాడు.నేను వదిలి పెట్టిన అన్నాన్ని తనకే కాకుండా తన వారందరికీ ప్రసాదంగా ఇవ్వాలని భావించాడు.ఇలాంటి భయము, భక్తి ఎవరికి వుంటాయి ? " అన్నాడు. హనుమ శ్రీ రాముని ఎంగిలి పళ్ళాన్ని చేత్తో పట్టుకుని అక్కడ నుంచి వెళ్ళి ఒక అవిశె చెట్టు మీద కూర్చుని వానరులన్దర్నీ పిలిచి " శ్రీ రామ చంద్రుని పవిత్ర ప్రసాదం తెచ్చాను. మీకు ఇష్టమైతే వచ్చి స్వీకరించండి." అన్నాడు.

వానరులందరూ బిల బిలా అక్కడకు చేరారు.అందరికీ శ్రీ రాముడు వదిలేసిన అన్నాన్ని ప్రసాదంగా పంచాడు. వాళ్ళుఅందరు ఎంతోభక్తి తో కళ్ళకు అద్దుకుని దాన్ని భుజించాడు.ఒక్క మెతుకు కూడా నేలమీద పడకుండా వారంతా దాన్ని స్వీకరించారు.కంచంలో కొద్దిగానే వుంటుంది కదా ఇన్ని వేలమందికి ఎలా సరిపోయింది అని మనకు అనుమానం రావచ్చు. శ్రీ రాముడి దయ వల్ల అది అక్షయ ప్రసాదం అయ్యిందీ. అందరికి సరిపోయింది. వానరులంతా హనుమను శ్లాఘించారు " హనుమా ! శ్రీ రామ ప్రసాదాన్ని అందరికీ సమానం గా పంచావు. మాపాపాలను ప్రక్షాళన చేసావు. మాకు యుద్ధంలో ప్రాణదానం చేసి ఐహిక సుఖాన్ని, ప్రసాదాన్ని అందించి ఆముష్మిక సుఖాన్ని అందజేసావు. మా జన్మలు తరింపజేశావు." అని పొగడ్తలతో మెచ్చారు. వాళ్ళు మళ్ళీ పావనీ ! ఇవాళ ద్వాదశి. ఒకప్పుడు అవిశె చెట్టు ఎక్కి అగస్త్యముని ప్రసాదం అందరికి పంచాలని ప్రయత్నం చేస్తే అది అయి పోయింది.అప్పుడు ఆయన అవిశే ఆకులను ప్రసాదం గా ఇచ్చి సంతృప్తి పరచాడు.

అప్పటి నుంచి ప్రతి ద్వాదశి రోజు అవిశే ఆకుల్ని ప్రసాదంగా తీసుకొనే ఆచారం లోకం లో వచ్చింది.శ్రీ రామ తారకమంత్రాన్ని నిత్యం జపించే అగస్త్య మహర్షి పేరుతో ఈ అవిశె చెట్టు లోకంలో అతి పుణ్యమైన చెట్టుగా పూజింపబడుతోంది. అగస్త్య నక్షత్రం ఉదయించినప్పుడు అవిశె పూలు పూస్తాయి. అవిశెకు " అగస్త్య " అనే పేరు కూడా వుంది. ఈ రహశ్యం నీకు తెలుసు కనుక అవిశె చెట్టు ఎక్కి మాకందరికీ ప్రసాదం పెట్టావు. ఎక్కటానికి ఇక్కడ చాలా చెట్లు వున్నా అవిశె మహత్యం నీకు తెలుసు కనుక ఆ పని చేసావు. ధన్యుడవయ్యావు. మమ్మల్ని ధన్యులను చేసావు." అని జాంబవంతుడు మొదలైన జ్ఞాన వృద్ధులు హనుమ బుద్ధి కుశలతను చక్కగా పొగిడారు. ఈ విధంగా శ్రీరాముడు ఇచ్చిన విందు అందరికి భుక్తాయాసాన్ని చేకూర్చటమే కాకుండా ముక్తికి కారణమూ అయింది. అదీ రాముని మహిమ అని తెలుసుకున్నాడు భక్త హనుమ.

# శ్రీ హనుమ కథానిధి - 26
# రామ రాజ్యంలో హనుమ దిన చర్య

శ్రీ రామ రాజ్యం లో ఆంజనేయుడు యొక్క దిన చర్య ఎలా ఉండేదో తెలుసుకోవాలి మనం. శత కందరుని సంహరించిన తర్వాత ఒక రోజు శ్రీరాముడు కొలువై వుండి, యుద్ధంలో సహకరించిన వారందరికి కృతజ్ఞతలు తెలియజేశాడు. వారంతా అలసిపోయినందుకు విచారం వెలిబుచ్చాడు. అందర్నీ వారి వారి స్థితిని బట్టి సత్కరించాడు. అందర్ని వారి వారి ప్రదేశాలకు వెళ్ళటానికి అనుమతిని ఇచ్చాడు. ఒక హనుమే మిగిలి వున్నాడు. ఒక్క క్షణం కూడా రాముడిని వదిలి వుండేవాడు కాదు. శ్రీ రాముని శయన మందిరం ప్రక్కనే ఉంటూ, ఎప్పుడు రాముడు బయటకు వస్తే అప్పుడే సాష్టాంగ నమస్కారం చేసేవాడు హనుమ.స్నానం, సంధ్యా చేసుకోవటానికి శ్రీ రాముడు సరయూ నదికి భద్ర గజం మీద వెళ్తుంటే ముత్యాల గొడుగు పట్టేవాడు. ఏనుగు దిగేటప్పుడు చేయి పట్టుకునేవాడు. శ్రీ రాముడు కొలువుదీరిన వేళ రామపాదుకల చెంత, కుడి పాదాన్ని పట్టుకుని కూర్చునే వాడు.

కొలువు కూటంలో ఏవైనా ప్రసంగిస్తున్నప్పుడు హనుమ అభిప్రాయాన్ని శ్రీ రాముడు అడిగి తెలుసుకొనే వాడు. తనకు ధర్మం అనిపించింది హనుమ చెప్పేవాడు. రాముడు ధర్మ కార్యాలు చేసేటప్పుడు ఆయన మనసు నెరిగి కర్తవ్యాన్ని నెరవేర్చే వాడు. పీఠాన్ని దిగేటప్పుడు రాముని పాదాలకు పాదుకలు తొడిగేవాడు. కుడిభుజం మీద చెయ్యివేసి నగరంలో సంచారానికి రామునితో పాటు వెళ్ళే వాడు. ఉద్యాన విహారానికీ హనుమను తనతో తీసుకొని వెళ్ళేవాడు. అక్కడ శ్రీరాముడు చెప్పే వేదాంత విషయాలను అత్యంత శ్రద్ధగా, హనుమ విని ఆకళింపు చేసుకొనే వాడు. ఆనందంగా శిరస్సు కంపింపజేస్తూ ఆనందబాష్పాలు రాల్చే వాడు.

హనుమ రచించిన " శ్రీ రామ బిరుదావళి" ని వంది మాగధులు చదివేవారు. హనుమ శిక్షణలో నేర్చుకున్న వీణను అద్భుతంగా వాయించి



వినిపించేవారు హనుమ శిష్యులు. కావ్యాలలోని విశేషాలను కవులు చక్కగా వినిపించేవారు. ఇది నిత్య కృత్యం. హనుమ రాముని చెంతనే వుండేవాడు. రాత్రి వేళల్లో శ్రీ రాముని శయన మందిరం లోకి రాముని కుమారులకు కూడా అనుమతి లేదు. అయితే హనుమకు ఎవరి అనుమతి అక్కరలేదు. రోజూ శ్రీరామునికి ఇష్టమైన పాటను, ఆయన కోరిక మీద పాడి వినిపించేవాడు హనుమ. ఆ పాటకు పరవశుడై రాముడు ఆనందంగా హనుమను కౌగలించుకొనే వాడు.

రాత్రి పూట రహస్యంగా నగరంలో సంచారం చేసి రాముడు ప్రజల కష్ట సుఖాలు తెలుసుకొనే వాడు. హనుమ ఆయన వెంట వెళ్ళేవాడు. రాజు ఏ పరిస్థితులలో నైన ఒంటరిగా తిరుగరాదు అనే రాజ నీతి తెలిసిన వాడు కనుక హనుమ నీడలా వెంట వెళ్ళే వాడు. ఈ విధంగా హనుమ దిన చర్య శ్రీరామునితో అనుసంధానం అయి వుండేది. హనుమ తనకు తోచిన విధంగా చెప్పేవాడు ధర్మ కార్యాలను రాముడు చేసేటప్పుడు ఆయన హృదయం తెలుసుకొని నెరవేర్చే వాడు హనుమ. రాముడు కొలువు చాలించేటప్పుడు శ్రీరాముని పాదాలకు పాదుకలు తొడిగేవాడు.

# శ్రీ హనుమ కథానిధి - 27
# హనుమ గంధ మాదన నివాసము

శ్రీ రాముడు అశ్వమేధ యాగాన్ని చేయాలని నిశ్చయించుకున్నాడు. హనుమతో సంప్రదించాడు. తన యజ్ఞాశ్వాన్ని రక్షిస్తూ వెంట వెళ్ల వలసినది గా హనుమను కోరాడు. సంతోషంగా అంగీకరించాడు మారుతి. యాగాశ్వానికి ముఖం మీద ఒక లేఖ కట్టారు బంగారు రేకుతో. దాని మీద " నిమిషంలో నాలుగు సముద్రాలు దాటినవాడు, తన భుజ బలం చేత శతకంధరున్ని సంహరించిన వాడు హనుమద్దేవుడు శ్రీ రామ భూపాలుని యాగాశ్వానికి రక్షణ గా వున్నాడు. వీరులైన వారు ఈ యాగాశ్వాన్ని పట్టవచ్చు " అని రాయించారు. యాగాశ్వం నానా దేశాలు తిరిగింది. శ్రీ రామ, హనుమ పరాక్రమం

తెలిసినవారంతా అశ్వాన్ని స్వాగతించి పంపారు. తెలియని వాళ్ళు హనుమతో యుద్ధం చేసి ఓడిపోయారు. జంబూ ద్వీపం అంతా కలయ తిరిగి దిగ్విజంగా యాగాశ్వం అయోధ్యకు చేరింది. ఆంజనేయుని సహాయంతో రాజా రాముడు అనేక క్రతువులను నిర్వహించాడు నిర్విఘ్నంగా. ఇలా స్వామి కైంకర్యమే జీవిత పరమావధిగా అనన్య భక్తితో శ్రీ రాముని సేవిస్తున్నాడు హనుమ.

ఒక రోజు శ్రీ రాముడు హనుమను పిలిచి" హనమ ! నీ భక్తి , ప్రపత్తి లకు చాలా సంతోషంగా వుంది. గుణంలో, వివేకంలో నిన్ను మించిన వారు లేరు. వేదాలు వున్నంత వరకూ, సూర్య చంద్రులు ఉన్నంత వరకు లోకంలో నువ్వు " చిరంజీవి " గా ఉంటావు. ఇది నేను నీకు ఇస్తున్న వరం. కింపురుష వర్షం అనే చోట గంధమాదన పర్వతం వుంది. దాని చివర బంగారు అరటిచెట్ల వనం వుంది. ఆ వనంలో కామ రూపంతో పారిజాతవృక్షం మూలంలో నివశించు. అక్కడి వారు అందరు జ్ఞానం కోసం, విజ్ఞానం కోసం, సౌఖ్యం కోసం, మోక్షం కోసం నీ వద్దకు వచ్చి నిన్ను పూజిస్తారు. వాళ్ళకు అధిపతివై వాళ్ళ కోర్కెలు నెరవేరుస్తూ వుండు. ప్రతి యుగంలోనూ మాతో పాటు, నిన్ను, పూజిస్తూంటారు" అని నెమ్మదిగా చెప్పాడు. ఆ మాటలు విన్న హనుమకు ఏమీ తోచలేదు.

" స్వామీ ! నాజీవమే నువ్వు. నిన్ను వదిలి నేను వెళ్ళగలనా ? నీ రూపమే నా మనసులో ఎప్పుడు స్తిరంగా వుండాలని నేను కోరుకుంటున్నాను. అనుగ్రహించు." అన్నాడు. దానికి రాఘవుడు " నీ మనసు లో నేనే కొలువై వుంటాను. అవిచ్ఛిన్నంగా నువ్వు నన్నే తలుస్తూ వుండు. నీ వద్ద విధ్యాధరులు, అప్సరసలు, నారద, తుమ్బురులు నా ఆత్మ కధను అనుక్షణం వినిపిస్తుంటారు. ఎంతో పుణ్యం చేసుకున్న వారికి మాత్రమే నువ్వు వుండే కదళీవనం (అరటి తోట) కనిపిస్తుంది. మిగిలిన వారికి అది కనిపించదు " అని నచ్చ జెప్పాడు. విలువైన బహుమతులను ఆంజనేయునికి సమర్పించి నెమ్మదిగా వీడ్కోల్పాడు.

హనుమ గంధమాదన పర్వతాన్ని చేరుకొని కాంచన (బంగారు) కదళీ వనంలో, పారిజాత తరుమూలంలో నివాసం వున్నాడు. సద్గుణ రాసి అయిన



హనుమ కధలు విన్నా, చెప్పినా, తెలుసుకున్నా, చదివినా నిత్య వైభవం, ఆయుస్సు, ఆరోగ్యం, మోక్షదాయకం ఈ పద్యం " సమీర కుమార (వాయుపుత్రుడైన హనుమ) విజయం " అనే కావ్యంలోనిది " రమణీయ మణి కుండల మరీచి వల్లిక – లంబర న్యగ్రోధ మావ రింప తను కాంతి హరిదంతా దంతి దంతములకు – నికరంపు బంగారు నీరు పూయ కటి కట్టు కొనిన బంగారు పట్టుపంచె పై – ముప్పెట మిసిమి క్రొమ్ముంజి వెలయ మాకు మాకనుచు ఉద్రేకించు కపు లందు – తన చూపు కరుణామృతంబు కురియ ముని మహీరుహ శాఖా గ్రమున ఒకింత – యెరిగి దాకేల పళ్ళెరంబూని రామచంద్రుని ప్రసాదమొసగు ప్రసన్న మూర్తి – మారుతి ఘటించు కోరికల్ మాద్రుశులకును "

# శ్రీ హనుమ కథానిధి - 28

# సకుంభ నికుంభ వధ

కుంభకర్ణునికి శివుని అనుగ్రహం వల్ల సకుమ్భ, నికుమ్భ అనే ఇద్దరు కుమారులు కలిగారు. వాళ్ళిద్దరూ తండ్రి కంటే భయంకరమైన వారు. వాళ్ళంటే లోకాలన్నీ గజ గజ వణుకుతున్నాయి. కుంభకర్ణుడు వీరిద్దరికి సముద్రుని భయపెట్టి, సముద్రం మధ్యలో, జయద్వీపం అనే నగరాన్ని నిర్మించి సకుమ్భుని దానికి రాజుగా చేసాడు. నికుంభుడు, మయో పాయాలలో దిట్ట. వీడిని అన్నకు తోడుగా వుంచాడు. వీరిద్దరూ జయ నగరంలో వుంటూ లోక కంటకులైనారు. ఒక రోజు వీళ్ళిద్దరూ సముద్ర తీరంలో దేవయాని అనే అపురూప సుందరిని చూసి మోహంలో పడ్డారు. తమల్ని వరించ మని వేడుకొన్నారు. ఆమెకు వీళ్ళంటే అసహ్యం వేసింది.

" ఒరే ! నేను రాక్షస గురువు అయిన శుక్రాచార్యుల వారి కుమార్తెను. పేరు దేవయాని. మీ సోదరిలాంటి దానిని. మీరు మదం తో నన్ను వేదించారు కనుక మదగజాలుగా పుట్టండి" అని శపించింది. పశ్చాత్తపంతో వాళ్ళు ఆమె కాళ్ళ మీద పడి అనుగ్రహించమని వేడుకొన్నాడు. కులస్త్యుడనే మహర్షి కరుణవల్ల

శాప విమోచనం అవుతుందని తెలిపి అదృశ్యం అయ్యింది. విభీషణుడు రావణ వధా నంతరం లంకా రాజ్యానికి పట్టాభిషిక్తుడైన సమయంలో వీళ్ళిద్దరూ ఏనుగులుగా వుండటం వల్ల వెళ్ళలేక పోయారు. రాముడి చేత యుద్ధంలో వధింపబడే అవకాశమూ రాలేదు. ఆ తరువాత పులశ్య అనే మహర్షి అనుగ్రహం వల్ల శాపవిమోచనం పొంది మళ్ళీ పూర్వ రూపాలను పొందారు.

అయినా బుద్ధి మారలేదు. మళ్ళీ లోకహింస విపరీతంగా చేయటం ప్రారంభించారు. ఇంద్రాదులకు కంటి మీద కునుకు పట్టకుండా చేస్తున్నారు. ఒకరోజు నారద మహర్షి వీళ్ళ రాజ్యానికి వచ్చారు.ఆయనకూ మర్యాద పూర్వక స్వాగతం ఇచ్చారు. సకుంభ, నికుమ్భులు. సంతసించిన నారదుడు వారిద్దరి వల్ల ఇంద్రుడు ఎంత భయపడుతున్నాడో వివరంగా చెప్పాడు. వీళ్ళిద్దరికీ బల గర్వం పెరిగి విర్రవీగుతూ ముల్లోకాలలో తమను ఎదిరించే మొనగాడు లేడని గర్వంగా అన్నారు. దానికి నారదుడు " మీ బాబాయి విభీషణుడు లంకలో వున్నాడు కదా. అతనొక్కడే మీ శత్రువు ", అన్నాడు ముభావంగా. ఇంకేముంది అగ్ని రాజుకుంది. వెంటనే లంక మీద దండయాత్రకు బయల్దేరారు.

ఒక దూతను విభీషణుడి దగ్గరకు పంపారు.వాడు అక్కడికి వెళ్ళి వారి మాటగా " పులస్త్య బ్రహ్మ వంశం చాలా విశిష్టమైంది.అందులో పుట్టి, ఒక సామాన్య మానవునికి బంటుగా మెలుగుతున్నావు. సిగ్గులేదా ? రాక్షస వంశ నాశనానికి నువ్వే కారణం. నీదీ ఒక బ్రతుకేనా" అని నిందించాడు. విభీషణుడు విపరీతమైన కోపంతో ఊగిపోయాడు. వాళ్ళిద్దరి మీదా యుద్ధానికి సిద్ధమైనాడు. యుద్ధం భీకరంగా సాగింది. ఇరు పక్షాల సైనికులు అనేక మంది చనిపోతున్నారు. విభీషణునికి చింత ఎక్కువైంది. దిక్కు తోచటంలేదు. రాముడే తనకు దిక్కు అనుకున్నాడు. ముందుగా హనుమంతునికి ఈ విషయం తెలియజేయాలి అనుకున్నాడు. వెంటనే గంధ మాదన పర్వతం చేరాడు.

అక్కడ కదళీ వనంలో శశికాంత మణి పీఠంమీద కల్ప వృక్ష తరు మూలంలో వున్న మారుతిని సందర్శించి " స్వామీ రక్షించు " అన్నాను. విభీషణుని



గౌరవంగా ఆహ్వానించి వచ్చిన విషయం ఏమిటి అని అడిగాడు హనుమ." నీ దయ వల్ల, శ్రీ రామ కృప వల్ల లంకా రాజ్యానికి రాజునై హాయిగా వున్నాను. ఇప్పుడు ఒక ప్రమాదం ముంచుకు వచ్చింది.కుంభకర్ణుని కొడుకులు సకుమ్భ, నికుమ్భు లు నామీద దాడి చేసారు. యుద్ధం భయంకరంగా వుంది. నాకు భయం వేస్తుంది. నువ్వే నాకు దిక్కు, శత్రు బాధ లేకుండా చేయి. కనికరించు అని " వేడుకున్నాడు.

హనుమంతుడు దయా దృష్టి తో " రాక్షసరాజా ! విభీషణా ! పరితాపం చెందవద్దు తక్షణం మనం ఇద్దరం అయోధ్యకు వెళ్ళి శ్రీ రామచంద్ర ప్రభు దర్శనం చేద్దాం. ఆయన అండ వుంటే మనకు ఎవరు అడ్డుగా వుండలేరు. అని అభయం ఇచ్చి వెంటనే అయోధ్య చేరారు.రాత్రి వేళ శ్రీరామ దర్శనం చేసారు. వచ్చిన కారణం అడిగి తెలుకొన్నాడు రాముడు.వివరంగా, విభీషణుడు వివరించాడు. విభీషణుడు సకుమ్భ, నికుమ్భుల వృత్తాంతం అంతా పూర్తిగా చెప్పాడు. "మన వీరాన్జనేయుడు వుండగా భయంలేదు. రేపే మేమిద్దరం సకల సేనా సమేతంగా లంకకు చేరుతాం. నువ్వు ఈ లోపు లంక చేరి నీ ప్రయత్నాలలో నువ్వు వుండు." అని చెప్పి పంపాడు విభీషణుడిని. హనుమను పిలిచి సైన్యాన్ని మర్నాటికి సిద్ధం చేయమని ఆజ్ఞాపించాడు. సకుమ్భ నికుమ్భుల వధ ఎలా జరిగిందో తరువాత తెలుసుకొందాం.

# శ్రీ హనుమ కథానిధి -29
# సకుమ్భ నికుమ్భుల వధ

లక్ష్మణ స్వామిని అయోధ్యలో వుంచి, శ్రీ రాముడు, భరత శత్రుఘ్నులతో, సైన్యంతో లంకలో దిగాడు. సకుమ్భ, నికుమ్భు లకు విషయం తెలిసి యుద్ధానికి దిగారు. రామునికి ముందుభరత, శత్రుఘ్నులు నిలబడి రాక్షసులతో భీకరంగా పోరు సాగించారు. కుంభకర్ణుడికి యముడు ఇచ్చిన యమదండాన్ని, రాక్షసులిద్దరూ, ఈ అన్నదమ్ములపై ప్రయోగించారు. ఆ దెబ్బకు భరత శత్రుఘ్నులు

నేలపై పడిపోయారు. తీవ్ర కోపం తెచ్చుకున్న శ్రీ రాముడు రాక్షస సోదరులపై వాయువ్యాస్త్రాన్ని ప్రయోగించాడు. అది వాళ్ళిద్దరినీ సముద్రంలో ముంచేసింది.

భూమి మీద పడివున్న సోదరులను చూసి రాముడు దు:ఖాన్ని ఆపుకోలేక పోయాడు. మంత్రులు ఆయన్ను ఓదార్చారు. హనుమను పంపి సంజీవిని ని తెప్పించమని సలహా ఇచ్చారు. కొంత తేరుకున్న దాశరథి " నాయనా, ఆంజనేయా ! రఘు వంశ రక్షకుడివి నువ్వే. సంజీవిని తెచ్చి నా సోదరులను బ్రతికించు " అని బ్రతిమిలాడారు. " రామ ప్రభూ ! సంజీవినే కాదు, అవసరం వస్తే ఇంద్రునితో పోట్లాడి అయినా అమృతం తెచ్చి నీ కార్యం నెరవేరుస్తాను " అని హామీ ఇచ్చి బయలుదేరివెళ్ళాడు. గగన మార్గాన యెగిరి దివ్య పురి అయిన అమరావతి నగరం చేరాడు. ఇంద్రుడు స్వాగతం పలికి రాకకు కారణం అడిగాడు. విషయం వివరించాడు హనుమ. చాలా ఆనందంతో అమృత కలశాన్ని ఆన్జనేయునికి, దేవేంద్రుడు అందజేశాడు. క్షణం ఆలస్యం చేయకుండా, లంకకు చేరి శ్రీరామునికి అమృత భాండాన్ని అందజేశాడు, హనుమ సాహసానికి రాముడు మెచ్చి హృదయ పూర్వకంగా ఆలింగనం చేసుకొన్నాడు. " అన్నా ! ఆంజనేయా ! ఆనాడు లక్ష్మణున్ని, ఈ రోజూ భరత శత్రుఘ్నులను పునర్జీవితులను చేసి రఘు వంశానికి గొప్ప మేలు చేశావు.

వాళ్ళకే కాదు నాకు కూడా పునర్జన్మ ప్రసాదించావు. వాళ్ళు లేని నేను లేను కదా. నువ్వు మనసు ప్రయాణించే వేగంతో ప్రయాణించగల సమర్థుడివి. క్షణంలో దేవ లోకానికి వెళ్ళి అమృతం తెచ్చావు. నీకు ఇది చాలా తేలికే కాని మాకు అద్భుతం, పరమాద్భుతంగా వుంది ". అని రాముడు హనుమ కార్య శూరతను మెచ్చాడు. మారుతి వినమ్రంగా " స్వామీ ! ఇది నీ ప్రతాపం. నాదేమీ లేదు. నేను నీ బంటును మాత్రమే ." అని సందర్భోచితంగా పలికాడు. హనుమ తెచ్చిన సుధను సోదరులిద్దరికి శ్రీ రాముడు తాగించాడు. వారిద్దరూ నిద్ర నుండి లేచి నట్లు లేచి కూర్చున్నారు. రామాజ్ఞ పై హనుమ మళ్ళీ ఆ సుధా కలశాన్ని ఇంద్ర పురికి తీసుకొని వెళ్ళి దేవేంద్రునికి అప్పగించి ,కృతజ్ఞతలు



తెలియ జేశాడు. తిరిగి లంకకు చేరాడు క్షణం ఆలశ్యం చేయ కుండా. శ్రీరాముడు సకుమ్భ, నికుమ్భుల రాజ్యం అయిన జయ ద్వీపానికి విభీషణుడిని పట్టాభి షిక్తుణ్ణి చేసాడు.

ఈ కథ విన్నా, చదివినా, రాసినా దీర్ఘాయుష్షు, ఆరోగ్యం, శ్రేయస్సు కలుగు తాయని శ్రీరాముడు లోకానికి వరం గా ప్రసాదించాడు.రాబోయే కలి యుగంలో ఇహానికి కిని, పరానికి కాని రక్షించేవాడు హనుమ మాత్రమే. ఆయనే అందరికి శరణ్యం. భక్తి, శ్రద్ధలతో హనుమను కొలిస్తే, అన్ని కోరికలు తీరు తాయి.

## శ్రీ హనుమ కథానిధి - 30
## అగస్త్య మహర్షి శ్రీ రామ సందర్శనం

శ్రీ రాముడు అయోధ్య లో " శ్రీ రామ రాజ్యం " చేస్తుండగా ఒక రోజు అగస్త్య మహర్షి ఆయన సందర్శనానికి విచ్చేశారు.రాముడు " మహర్షీ ! కుశలమా ? " అని ప్రశ్నించాడు. మహర్షి సీతా రామా ! నువ్వు రాజ్యం చేస్తుండగా సాధువు లైన మాకు బాధలు యెందుకుంటాయి ? శత కన్ధరుడు మున్నగు దుష్టరాక్షస సంహారం చేసి లోక ప్రియత్వంగా పాలన చేస్తున్నావు. ఇదంతా నీ కరుణా ప్రియత్వం "అన్నాడు శ్రీ రాముడు వినయం గా " కుంభ సంభవా ! వంద తలకాయలు వున్న రాక్షసుడు శత కంధర వధ లో నా పాత్ర కంటే హనుమ పాత్ర ఎక్కువ. దీని విజయం వెనుక మారుతి మహాత్యం వుంది. బలవాన్ అయిన హనుమాన్ నాకు బంటుగా వుంటే కీర్తి ప్రఖ్యాతులు నాకు ఎలా రాకుండా వుంటాయి ? హనుమ నామ జపమే కార్య సిద్ధికి కారణం. యుద్ధం లో పంచముఖాలతో తన విశ్వరూపం చూపి రాక్షస సంహారానికి గొప్ప సాయం చేశాడు. కుమారస్వామి కూడా శ్రీ హనుమ నామ సంస్మరణ చేసి తారకాసుర సంహారం చేశాడు. " అని హనుమ గొప్ప తనాన్ని వివరించాడు. ఈ మాటలు విన్న మహర్షి ఆశ్చర్యం గా చూసి " రామా ! హనుమ నిజస్వరూపాన్ని

నాకు వివరించి చెప్పు, కార్తి కేయుడు హనుమ నామస్మరణతో తారకాసురుడిని ఎలా జయించాడు ? " హనుమంతుని " మూల మంత్ర " రహశ్యం ఏమిటి ? దాని లక్షణం, ఫలితం నాకు తెలియ జెప్పు.అని కోరాడు.

శ్రీ రాముడు ఆసందం గా " ముని సార్వ భౌమా! ఇది చాలా రహశ్యమైన విద్య.మీరు తప్ప ఇంకెవరికీ దీన్ని వినే అర్హత లేదు. ఈశ్వరుడు అయిదు ముఖాల వాడు. సృష్టి, స్థితి, సంహారము, తిరోభావమూ, అనుగ్రహము అనే అయిదు కార్యాలు చేయటానికి తన అయిదు ముఖాలతో నిర్వహిస్తూ ఉంటాడు. మన హనుమ కూడా సాక్షాత్తు శివ స్వరూపమే. అకార, ఉకార, మకారాలు అనే బీజాక్షర సంయోగమే ప్రణవం అంటే ఓంకార స్వరూపం అయిన హనుమ. విరాగులలో గొప్ప విరాగి. తపస్సు స్వరూపమూర్తిగా తేలిసిన వాడు హనుమ ఒక్కడే. మన్మథ వికారానికి శివుడు లోనైనాడు.కాని హనుమ లోను కాలేదు. తీవ్ర తపోనిష్ఠలో వుంటాడెప్పుడు. శ్రీ వర్ధనుడైన శంకర స్వరూపమే హనుమ. నాకు ఏకాంత భక్తుడు. నేను ఈ అవతారం దాల్చటానికి హనుమ లోకోత్తర భక్తియే కారణం. శరీరాన్ని, అన్తఃకరణాన్ని, ఆత్మను, కర్మలను నాకు సర్వ సమర్పణ చేశాడు. తన స్వాతంత్ర్యాన్ని కూడా నాకు అర్పణ చేసిన త్యాగి." అని పొగిడాడు. నిజ తత్వాన్ని వివరించాడు.

చెప్పే దానిని కొన సాగిస్తూ " మహర్షీ ! నానాత్వం అనే భావం విడిచి పెట్టాలి. అప్పుడే దు:ఖం దూరం అవుతుంది. విడిచి పెట్టటం అంటే. నాది "అనే మమకారాన్ని , విడవటం. సంయోగాలు అన్నీ వియోగం కోసమే అనేదే జ్ఞానం. వియోగం నుంచి తప్పించు కోలేము కాని దు:ఖాన్నించి తప్పించు కోవచ్చు. రాగద్వేషాలను వదిలించుకోవాలి. సృష్టి అంతా ద్వంద్వం, ద్వైతం. సృష్టి కర్త మాత్రం అద్వైత స్వరూపుడు. కర్మ ద్వైతం. జ్ఞానం అద్వైతం. జ్ఞానకర్మ సంయోగం కుదిరేది కాదు. అలా చేస్తే పెరుగులో వడ్లగింజలను వేసుకొని తినటంలాగా వుంటుంది. కర్మకు, భక్తికి లంగరు కుదరదు. పెరుగులో పంచదార వేసుకొన్నట్లే జ్ఞానమార్గం చాలా శ్రేష్ఠమైంది. " మనిషి ద్వంద్వాన్ని తప్పించు



కోలేడు. అందరం కర్తావ్యాన్ని చేయాల్సిందే. శత్రువు విషయంలో ప్రతీకారం, స్నేహితుని విషయంలో సహకారం, సమస్యల విషయంలో పరిష్కారం, సంసారం విషయంలో మమకారం, సంఘం విషయంలో పరోపకారం, తల్లిదండ్రుల విషయంలో ప్రతిజ్ఞాపాలన, సమస్త జీవులపై భూత దయ, మనిషి కర్తవ్యంలో భాగాలే. కర్తవ్యం అంటే అదేదో చాలా గొప్ప పని అనుకోనక్కర లేదు. చలి వేస్తే దుప్పటి కప్పుకొవటం, కాళ్ళు కాలు తుంటే చెప్పులు వేసుకోవటం, రోగానికి ఔషదం, ఆకలికి అన్నం అన్నీ కర్తవ్యం, ప్రతిక్రియ, పరిష్కారం " .

దివ్యర్షీ ! మనిషి దిన చర్య అంతా కర్తవ్యమే. అయితే జాబిలి వంటి మా ఆస్థాన చార్వాకులు అన్నం, దుప్పటి వంటివి అందరికీ లభించాలి కదా అంటారు. అతను నాస్తికుడు కాదు. నైష్టికుడు. మా కొలువు లో నాస్తిక వాదం చేయటానికి మేము నిర్మించు కొన్న ఉద్యోగ ధర్మం అది. ఇక్ష్వాకుల కాలమ్ నుంచి ఇది అమలులో వుంది. పూర్వ పక్షం లేకుండా, సిద్ధాంతానికి బలం వుండదు. కావ్యం లో ప్రతి నాయకుని పరాక్రమం, నాయకుని ధీరో దాత్తతను సమర్ధించటానికే ఉపయోగ పడుతుంది. పూర్వం పక్షం బలం వాపు లాంటిదే. సిద్ధాంతం చిన్నది అయినా అది మందుమాత్ర బలం వంటిది. అందుకే ఉపనిషత్ సిద్ధాంత వాక్యాలు చాలా చిన్నవిగా వున్నా, చాలా సమర్ధవంతంగా వుంటాయి".

" అడవిని నరికితేనే దారి ఏర్పడుతుంది ,కలుపును పీకేస్తేనే పంట బాగా పండుతుంది. ప్రజలకు, ఆహారం వస్త్రాలు, ఇల్లు, విద్యా, వేద్య, జల సౌకర్యాలు కల్పించాల్సిన బాధ్యత రాజుదే. ధన వంతులు దాన ధర్మాలు చేయాలి సప్త సంతాన ప్రతిష్ట చేయాలి. రాజు వీటిని విధిగా నిర్వహించాలి. మా వంశం తరతరాలుగా వీటినన్నిటినీ నెరవేరుస్తోంది. ఇక్ష్వాకుల పాలనలో తలిదండ్రుల బాధ్యత పిల్లలను కనటం వరకే. వారిని పెంచి, పోషించి అవసరాలను తీర్చే బాధ్యత మా వంశం వారు అనాదిగా చేస్తున్న కృషి ."

మహర్షీ ! హనుమ శ్రీ హరి అవతారంగా వైష్ణవులు పూజిస్తారు. పరమేశ్వరస్వరూపునిగా శైవులు ఆరాధిస్తారు. భవిష్యత్ బ్రహ్మగా హిరణ్య గర్భో పాసకులు అర్చిస్తారు. జ్ఞాన ఖని అంటారు వేదాంతులు. తాను ఒక్కడే అయి వుండి కూడా, అనేక రీతుల పూజనీయుడు, సమర్ధుడు, అనవద్యుడు, ఆత్మ హితుడు, అఖిల లోకనుతుడు, అతని కంటే నాకు ఇష్టుడు లేడు. అతని కంటే నాకు ఇష్టమైన వస్తు వేదీ లేదు. అవతారమెత్తిన వానరులలో శ్రేష్టుడే హనుమ. అతను షడ్భావ విదూరుడు. త్రిగుణా తీతుడు. పంచేంద్రియాలను, మనస్సును, బుద్ధిని, అంత:కరణాన్ని, శరీరాన్ని, సమస్తాన్ని నాకు అర్పించి, నా నామం లోనే రమిస్తూ, నన్నే తండ్రిగా, తల్లిగా భావిస్తూ, కొలిచే పరమ " భక్తాగ్రేసరుడు హనుమ" అని శ్రీ రాముడు అగస్త్య మహర్షికి బోధించాడు.

" హనుమ ను నిశ్చల భక్తి తో కొలిస్తే అజేయత్వం, అమర్త్యత్వం, ఇష్ట కామ్యార్ధ సిద్ధి, అమిత వాక్పటుత్వం, సుకవిత్వం, కామ రూపత్వం కాల జ్ఞానం, ఆకాశ గమనం, సర్వజ్ఞత్వం, తత్వ జ్ఞానం, నిగ్రహానుగ్రహం, నిర్మలత్వం, అవ్యయత్వం మొదలైన ప్రభావాలు ఆంజనేయ ఉపాసకులకు కలుగుతాయి. మహర్షీ ! మీరు కూడా సూక్ష్మభావాన్ని భావించి, శ్రీ హనుమదుపాసన చేసి, అభీష్ట సిద్ధిపొందండి." అని రాముడు తెలియజేశాడు. సాకల్యంగా ఈ విషయాలను విన్న అగస్త్యమహర్షి హనుమ సంచముఖత్వాన్ని తెలియజేయ వలసినదిగా కోరారు. ఆ విషయాలు తర్వాత తెలియ జేస్తాను.

## శ్రీ హనుమ కథానిధి - 31
## పంచముఖ ఆంజనేయ వైభవం

ఒక సారి పార్వతీ దేవి శివుడిని సమీపించి " స్వామీ ! శ్రీ హరి లోక రక్షణకు చాలా అవతారాలు ఎత్తాడు కదా, మీరుకూడా ఏమైనా అవతారాలు దాల్చారా. వుంటే వివరించండి " అని అడిగింది. దానికి పరమేశ్వరుడు " దేవీ ! దూర్వాసుడు నా అవతారమే. కాని ఆ అవతారంలో నా లాగే గొప్ప మహత్వాన్ని



పొందలేదు. ఆ లోపం తీర్చటానికి నేను పంచ కృత్య పరాయణుడిని కనుక " పంచముఖ ఆంజనేయ " అవతారం దాల్చి భక్తుల కోర్కెలను తీర్చాను. ఈ అవతారం లో జ్ఞాన, విరక్తి, భక్తి, నయ, సాత్విక, సాహస, శాంతి దాంతి, విద్య, నిపుణత, సత్వ, జవ (శక్తి), ధర్మ, దయ, గుణ, ధైర్య, నిశ్చలత, ధ్యాన, తప:, ప్రభావాలన్నీ రూపు కట్టిన అవతారం అది. దీనికి మించిన అవతారం లేదు. నిశ్చల బ్రహ్మచర్యం ఈ అవతారం విశిష్టత. ఈ అవతార పరమార్ధాన్ని అర్ధంచేసు కొన్న వారికి ఇహ పర సౌఖ్యామే. నా రూపము, పంచాముఖాఙ్జనేయ రూపమూ ఒక్కటే. తేడా ఏమిటంటే ఈ రూపంలో నేను నీతో అర్ధ నారీశ్వరుడిని. ఆ రూపంలో నిత్య నిస్సంగత్వమే.

" పంచముఖత్వంలో వానర, నారసింహ, గరుడ, వరాహల, హయ (గుర్రం) ముఖాలుంటాయి. అనేక అలంకారాలతో అలంకరింప బడి వుంటాను. పదిహేను నేత్రాలుంటాయి. అద్భుత కాంతి మయం. పదిచేతులతో విరాజిల్లు తాను. కత్తి, డాలు, పుస్తకము, అమృత కలశము, అంకుశము, పర్వతము, నాగలి, మంచం కోడు, పాము, చెట్టు అనే పది. ఆయుధాలు ధరించి వుంటాను. నా కపి ముఖం తూర్పు వైపుకు వుంటుంది రమ్యంగా. కోరిన కోర్కేలిస్తుంది. భయంకర కోరలు, ముడిచిన కనుబొమ్మలతో అద్భుత నారసింహ ముఖం దక్షిణ దిశగా వుంటుంది.

తేజస్సుతో, అభయ నివారక మైన బలం, గట్టి ముక్కు తో విషాన్ని హరించే గరుడముఖం పశ్చిమంగా వుంటుంది. అన్ని రోగాలను నివారించే నలుపురంగు కాంతితో వరాహముఖం ఉత్తర దిక్కుగా వుంటుంది గుర్రపుముఖం ఊర్ధ్వముఖంగా వుండి జ్వర నివారణ చేస్తుంది. నా ఆయుధాల పేర్లు స్మరిస్తేనే చాలు దేవతలిచ్చే సకలఫలాలు లభిస్తాయి. అనేక దివ్యాభరణ భూషితుడు పంచముఖస్వామి. యెర్రని చీనాంబరధారి. యెర్రని పుష్పాలు, ధరిస్తాడు. రక్తవర్ణుడు. ఏవేళ కొలిచినా వరధాభాయాలు నిస్తాడు. పంచముఖ హనుమం మంత్రాన్ని బ్రహ్మకుమార స్వామికి ఉపదేశించాడు. ఆయన దాని ప్రభావంతో తారకాసురున్ని సంహరించాడు "

# తారకాసుర సంహారం

" తారకుడనే రాక్షసుడు లోక కంటకంగా వుండేవాడు. కుమారస్వామి చాలా సార్లు వాడితో యుద్ధంచేసిన వాణ్ని జయించలేక పోయాడు. దేవతలంతా ఈ విషయాన్ని బ్రహ్మకు నివేదించారు. ఆయన దేవసేనా పతి, షణ్ముఖుడు అయిన కుమార స్వామికి పంచముఖ ఆంజనేయ మంత్రాన్ని ఉపదేశించి జపించ మని కోరాడు. ఆ మంత్ర ప్రభావం తో స్కందుడు తారకాసుర సంహారం దిగ్విజంగా చేసి దేవతలకు మేలు కలుగజేసాడు."

పార్వతీదేవి హనుమకు ఎన్ని మంత్రాలున్నాయో తెలియజేయమని శివుణ్ణి కోరింది. అప్పుడు శివుడు " అన్ని అక్షరాలూ హనుమ మంత్రాలే. అక్షరాలకు అధి దేవతలందరూ ఆయన స్వరూపాలే. వేద రాశి అనంతం అయినట్లు గానే హనుమ కూడా అనంతుడు."అని బోధించాడు శివుడు. ఈ విషయాలన్నీ అగస్త్యమహర్షికి శ్రీ రాముడు వివరంగా చెప్పాడు. శ్రద్ధగా అన్నీ ఆకళింపు చేసుకొని కృతజ్ఞత తెలుపుతూ, క్రుతార్థుడినయానని సంతోషిస్తూ అగస్త్య మహర్షి స్వస్థానానికి బయలుదేరి వెళ్ళాడు.

# శ్రీ హనుమ కథానిధి - 31
# గరుడ, సత్యభామ, నారద తుంబురుల గర్వ భంగం

విష్ణుమూర్తి వాహనం పక్షిరాజైన గరుత్మంతుడు అతి బలశాలి. ఇంద్రుడు ఒకసారి గరుడిని వజ్రాయుధంతో కొడితే ఒక్క వెంట్రుక మాత్రమే ఊడింది. అంతటి శక్తి సంపన్నుడు. అతని పేరు చెబితే పాములన్నీ వణికి పోతాయి. అంత బలశాలి గరుడినిని హనుమ తన తోక లోని ఒక్క వెంట్రుకతో నేల మీద పడేట్లు చేశాడు. ద్వారకలో శ్రీ కృష్ణ పరమాత్మ ఉన్న రోజులవి. సత్యభామకు



శ్రీ కృష్ణుడు తనను బాగా లాలిస్తున్నాడని గర్వంగా వుంటుంది. ఆ మాట బాహాటంగా చెప్పుకొనేది. నరకాసుర సంహారం, పారిజాత వృత్తాంతం ఆమె గర్వాన్ని మరీ పెంచేశాయి. స్వర్గంలోని పారిజాత వృక్షాన్ని పెకలించి తెచ్చేటప్పుడు గరుడి తో " నువ్వు ఉండ బట్టి ఇంతటి మహత్కార్యం జరిగింది " అన్నాడు స్వామి. దానికి ఉబ్బి తబ్బిబ్బై గర్వం పొడ చూపింది. వీరి అందరి గర్వాన్ని ఎలా అణచాలాఅని ఉపాయం కోసం వెతుకుతున్నాడు కృష్ణుడు.

ఒక సారి కైలాసంలో పార్వతీ పరమేశ్వర సందర్శనం చేసి, నారద తుమ్బురులు నాద ప్రియుడైన ఆయన్ను తమ గాన ప్రావీణ్యంతో మెప్పించారు. వారిద్దరి గాన మాధుర్యానికి శివుడు అభినందించాడు. అది వాళ్ళకు సంతృప్తి కల్గించలేదు. తమరిద్దరిలో ఎవరి గానం గొప్పదో తెలియజేయమన్నారు. బ్రహ్మ వద్ద కు వెళ్ళి తేల్చుకో మన్నాడు పరమేశ్వరుడు. అక్కడికి వెళ్తూ దారిలో ఎవరికి వారు తామే ఎక్కువ అని కలహించుకొన్నారు. సంగీత, సాహిత్యాది దేవత సరస్వతీ దేవి అక్కడే వుంది. విరించి వీరి గర్వం ముదిరిందని తెలిసి ద్వారకలో శ్రీ కృష్ణుడే సరైన న్యాయ నిర్ణేత అక్కడకు వెళ్ళమని సలహా ఇచ్చాడు.

ద్వారకలో సత్యభామ మందిరంలో కృష్ణ సందర్శనం చేశారు. వారిద్దరికీ మర్యాదపూర్వక స్వాగతం పలికాడు. వచ్చిన పని ఏమిటని అడిగాడు. నాద విద్యా హన్కారంతో విర్రవీగే వారిద్దరూ తమలో ఎక్కువ తక్కువలు తేల్చమని కోరారు. అప్పుడు ఆయన " సకల విద్యా రహశ్య వేది, సకల వేద సార గ్రహీత, భవిష్యత్ బ్రహ్మ అయిన హనుమ మాత్రమే దీనికి సమర్థుడు." అని చెప్పి గరుత్మంతుణ్ణి వెళ్ళి వెంటనే హనుమకు విషయం వివరించి తీసుకొని రమ్మన్నాడు. అసలే బలగర్వంలో ఉన్న గరుడుడు "ఒక కోతిని తీసుకురావటానికి నా అంత బలవంతుడు వెళ్ళాలా ? అని చెప్పేటప్పుడు హెచ్చు తగ్గులు చూసి చెప్పాలి. నన్ను తేలికచేసేశారు. అయినా ప్రభు ఆజ్ఞ. వెళ్తున్నాను" అన్నాడు. అప్పుడు సత్యావల్లభుడు " ఇది నీకు అవమానం కాదు. గౌరవమే. సాక్షాత్తు ఈశ్వర భక్తుడు, భవిష్యత్ బ్రహ్మ అయిన హనుమ సందర్శనం సామాన్యం కాదు. గంధమాదనం వద్ద కదళీవనంలో నిరంతర తపోధ్యానంతో ఉంటాడు.

హనుమ. నువ్వే వెళ్ళి తీసుకురాగల సమర్ధుడివి " అన్నాడు. అయినా సందేహిస్తూనే బయల్దేరుతూ " ఆ వానరుణ్ణి పిలుచు కొస్తానని " ఒక వేళ కుదరక పోతే తన బలమేమిటో ప్రదర్శించి వచ్చేట్లు చేస్తానని బీరాలు పలికి వెళ్ళాడు.

తోకను చుట్టగా చిట్టి కోటలాగా ఏర్పరిచి దాని మధ్య కూర్చుని వున్నాడు హనుమ. గరుత్మంతునికి స్వాగతం ఇవ్వలేదు.ధ్యాన నిమగ్నం గా వున్నాడు. మండి పోయాడు. కోతికి మర్యాదలేం తెలుసు అన్నాడు. దిక్కులు వణికేటట్లు రెక్కలను విసిరాడు. ముక్కుతో పొడిచాడు. గోళ్ళతో చీరాడు. హనుమ తోకను కదిలించాలని విశ్వప్రయత్నం చేశాడు. సాధ్యంకాలేదు. తోక కోటలోకి ప్రవేశిద్దామని యెగిరితే సూర్యుని ముందు మిణుగురు పురుగు అనిపించాడు. తనను కోతి అవమానించిందని రగిలి పోయాడు. చివరికి ఓపిక నశించి " కపీంద్రా ! ద్వారకలోని కృష్ణుడు నిన్ను పిలుచుకు రమ్మన్నాడు". అని పొడి పొడి మాటలతో అన్నాడు. రామ భక్తి సామ్రాజ్యంలో లీనమైన హనుమకు ఇదేమీ తెలియదు.

మళ్ళీ గోళ్ళతో, ముక్కుతో గాయాలు చేశాడు. తోకను ఝాడించాడు హనుమ. దానికే కంగుతిని ముచ్చెమటలు పట్టి నేల వ్రాలాడు. తోకదెబ్బతో ఒక్కసారి ఎగిరి వచ్చి ద్వారకలో శ్రీ కృష్ణుని ముందు పడ్డాడు. గరుడ గర్వభంగం తెలుసుకొని ఓదారుస్తూ సపర్యలు చేసాడు గాయాలకు.తేరుకున్న వైనతేయుడు కళ్ళు తెరిచాడు. " వివేకివి అని నిన్ను పంపాను. అక్కడ రామ నామ జపంలో మునిగివున్న హనుమను, నీ బల గర్వంతో రెచ్చగొట్టి, ఫలితం అనుభవిస్తున్నావు కదూ " ? అన్నాడు. సిగ్గుతో తలవాల్చాడు వినతా సుతుడు. " మీ ఉపదేశాన్ని పెడచెవి పెట్టి నందుకు నాకు మంచి శాస్తి జరిగింది" అని ఏడ్చాడు. స్వామి అనునయంగా " యెవరికైనా లోకంలో ఒక్కో సారి బుద్ధి పెడదారి తొక్కుతుంది.

" సీతా రాములు పిలుస్తున్నారు " అని ఈ సారి వెళ్ళి మర్యాదగా పిలువు. పరవశంతో వచ్చి ఇక్కడ వాల్తాడు. అని చెప్పాడు గరుడునికి. శ్రీరామ మంత్రోపదేశం చేసాడు పరమాత్మ శ్రీ కృష్ణ భగవానుడు.



# శ్రీ హనుమ కథానిధి - 32
# సత్యభామ గర్వ భంగం

ఖగరాజు (గరుత్మంతుడు) శ్రీ కృష్ణుని ఆజ్ఞతో వెంటనే గంధమాదన పర్వతం చేరాడు. హనుమ వాలం (తోక) దగ్గర నిలిచాడు. మనసులో ఇంకా భయం పోలేదు ధైర్యం తెచ్చుకొని అత్యంత వినయంగా " ఓ సీతా శోక వినాశకా! శ్రీ రామపాద సేవాదురంధరా ! మహావీరా ! భవిష్యత్ బ్రహ్మ ! అంజనా గర్భ సంభూతా ! సీతా రాములు మిమ్మల్ని పిలుస్తున్నారు. వారిప్పుడు ద్వారకలో వున్నారు". అని విన్నవించాడు.

తన ప్రభువులు మాట చెవిని సోకగానే హనుమ పరవశించి పోయాడు. ఆనందబాష్పాలు కారిపోతున్నాయి. శిరస్సు వంచి అతి దీనంగా " మహాత్మా ! మీ వల్ల నాకు నా సీతారామచంద్రుల వారి పునర్దర్శనం లభింస్తోంది. నా తపస్సు ఫలించింది. నా సంకల్పం నిరవేరింది. మీరు శుభవార్తను తెచ్చారని తెలియక అజ్ఞానంతో మిమ్మల్ని అవమాన పరచాను మన్నించండి''అని పారవశ్యంతో హనుమ చేతులుజోడించి వేడుకొన్నాడు.

హనుమ నిరంతర రామ నామాన్ని విన్న వైనతేయుడు " హనుమా ! మూడులోకాల చేతా సేవిమ్పబడేవాడివి. మహా మహిమాన్వితుడివి. వేదార్ధం చెప్పగల నేర్పరివి. మీరు నన్ను ఇలా గౌరవంగా సంభోధించటం నాకు ఇబ్బందిగా వుంది. నేనే అజ్ఞానం వల్ల, మీ మహిమ తెలియక, పొరబడి నాబల ప్రదర్శన చేసాను. నా గర్వాన్ని ఖర్వం చేసిన పుణ్యాత్ములు " అని నమస్కరించాడు విష్ణు వాహనుడైన వైనతేయుడు. ఆనందంతో హనుమ అతన్ని ఆప్యాయంగా కౌగలించు కొన్నాడు. ఇద్దరూ ఒక్కసారి ఆకాశంలోకి యెగిరి ద్వారకను సమీపించారు. "ద్వారక ఇదే ఇక్కడే సీతారాములుంటారు". అని చెప్పగానే వినయంతో ఆ పట్టణానికి శ్రీకృష్ణ మందిరం చేరి, తాము వచ్చిన విషయం తెలియజేసాడు. నమస్కరించాడు.

సత్యభామ సమీపించి కృష్ణుడు “ నేను రమ్మని కబురు చేయగానే వచ్చాడు హనుమ. మనం ఇలా కనిపిస్తే ఒప్పుకోడు. సీతా రాముల వేషం లోనే దర్శనమివ్వాలి. నేను శ్రీ రామ రూపంలోకి మారుతాను. నువ్వు సీతాసాధ్విగా మారు” అన్నాడు. ఆమె దిమ్మెరపోయింది. అది ఎలాగో అర్ధం కాలేదు. సిగ్గుతో తల దించుకుంది అహంకారం పూర్తిగా నశించింది. ఒక బొమ్మలాగ నిలబడి పోయింది. అప్పుడు స్వామి రుక్మిణీదేవి వైపుకు సాభిప్రాయంగా చూసాడు.

ఏ శ్రీ దేవి మిధిలలో జనకునికి నాగేటిచాలు లో లభించి పెరిగిందో ఏ లక్ష్మీ శివ ధనుర్భంగాన్ని అలఓకగా నెరవేర్చిన శ్రీ రాముని ఇల్లాలు అయ్యిందో, ఏ మాత అహల్యా శాప విమోచనం చేసిన శ్రీ రామ ప్రాణప్రియ అయ్యిందో, ఏ చిత్ శక్తి స్వరూపిణి, పరాశక్తి రావణ సంహారం కోసం సీతా మహాసాధ్విగా అవతరించిందో, ఆ సీతా స్వరూపమే రుక్మిణీ కాంత. కనుక వెంటనే సీతాదేవిగా మళ్ళీ రూపుదాల్చింది. శ్రీ కృష్ణ రుక్మిణి లిప్పుడు సీతా రాములై దర్శనమిస్తున్నారు. రుక్మిణి సీతామాతగా శ్రీ రామరూపంలో వున్న కృష్ణుని ఎడమ అంకం మీద అధివశించి సీతారాములుగా దర్శనమిచ్చారు. హనుమ చేతులు జోడిస్తూ , కన్నీరు ధారాపాతంగా, కారుతుండగా, అత్యంత భక్తితో, శ్రద్ధతో వచ్చి వారిద్దరికీ సాష్టాంగ నమస్కారం చేశాడు. అనేక విధాల వారిని స్తోత్రాలతో అలరించాడు. తన జన్మ సఫలం అయ్యిందని భావించాడు. హనుమను హరి గాఢంగా కౌగలించుకొన్నాడు. “ కుమారా ! మారుతీ ! ఈ నారద తుంబురుల గానంలో వున్న తేడాను సాకల్యంగా పరీక్షించి ఎవరు అధికులో నీవు నిర్ణయించాలి. అందుకే వైనతేయుడు నీకోసం పంపాను ” అన్నాడు . హనుమ చేతులు జోడించి “ గాన్ధర్వేచ భువి శ్రేష్టో బభూవ భరతాగ్రజః ” అని మహర్షి మహాకవి వాల్మీకి చేత స్తుతింపబడిన నీవు గాంధర్వ విద్యా దురంధరుడివే, మీరే నిర్ణయం చేయగలరు. ఆ పని ఈ బంటు మీద పెట్టారు. రామాజ్ఞ శిరసావహిస్తాను. “జగన్నాటక సూత్రధారివి. నీవు ఆడించినట్లు ఆడే బొమ్మలం మేము. సరే కానీండి. ప్రభు ఆజ్ఞ నిరవేర్చాలి కదా. అలానే చేస్తాను మీ అనుగ్రహంతో ” అన్నాడు ఆంజనేయుడు.



# శ్రీ హనుమ కథానిధి - 33
# నారద తుంబుర గర్వ భంగం

హనుమ శ్రీ రాముని పాదాలచెంత చేరి, నారద, తుంబురులను తమ గానాన్ని విన్పించమని కోరాడు. ఇద్దరు వీణేలు సారించారు. గమక యుక్తంగా అలంకారాలు, గీతాలు మధురంగా పలికించారు. స్వర సందర్భం శృతులు, ఆలాపన, గమకాలు, గీతసరణి, ముక్తాయింపు భలేగా, అమోఘంగా వున్నాయని మెచ్చుకున్నాడు. ఇంతటి ఉద్దండ పండితుల గానాన్ని తాను తేల్చి చెప్పటం సాధ్యం కాదేమో అన్నాడు. తాను నేర్చిన కొన్ని గీతాలను సీతా రాములకు వినిపిస్తానని, వారిద్దరిని కూడా వినమని కోరాడు.

వారిద్దరి గానాన్ని మెచ్చిన హనుమ తన గానం వినమనటంలో అర్ధమేమిటో వారికి అర్ధం కాలేదు. “ కోతులు సంగీత సభ చేస్తే కొండ ముచ్చు అగ్రాసనం మీద కూర్చున్నట్లుంది హనుమ గానం ” అనుకొన్నారు. అంత గొప్ప సంగీతాన్ని తాము వినిపిస్తే, ఇంకా హనుమకు ఏం మిగిలింది వినిపించటానికి ? అని విసుక్కున్నారు. తమ గానం ముందు ఇంకెవ్వరి గానమైన బలాదూరే అని వారి గర్వం. ఏమీ చేయలేక తమ వీణలను హనుమకు అందించారు. నారదుని వీణను తీసుకొని హనుమ పలికించటం ప్రారంభించాడు.

ఓంకారం త్రిగునాత్మకము,త్రిమూర్త్యాత్మకము దీనినే ప్రణవం అంటారు. ఇందులో అ, ఉ, మ ఉన్నాయని మనకు తెలుసు.ఆకారం రజోగుణాత్మకం – బ్రహ్మ. ఉ –కారం సత్వగుణాత్మకం –విష్ణువు. మ– కారం తమో గుణాత్మకం – రుద్రుడు. అకారం ఎడమ నాసిక పుట–ఇడ. ఉ కారం కుడి నాసా పుట. పింగళ. మ కారం వాటి మధ్యలో వున్న సుషుమ్న. ఈ విధంగా ఓంకారం మూడు నాడుల సమాహారమే. ఇడా నాడి – చంద్రుడు. పింగళనాడి – సూర్యుడు. సుషుమ్న నాడి యే అగ్ని. ఈ విధంగా ఓంకారం త్రయాగ్నమైంది. ఓంకారంలో దశ విధ నాదాలు జన్మించాయి. నాభి, ఉదర, కంఠ, స్తానానాలు వాటి ఉత్పత్తి

స్థానాలు. ఆ నాదాలే వాయు చలనం వల్ల హృదయ, కంఠ. శిర:స్తానాల నుండి అభివ్యక్తమై, మందర, మధ్యమ, తారకం అనే మూడు స్వర భేదాలు పొందాయి. € dŸ§ \ qT+& »dŸ ] ,>·, eT, | Ÿ <Š " µµఅనే సప్త స్వరాలు క్రమంగా శివుని యొక్క " పరమశివ, ఈశ్వర, సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశాన " అనే ఏడు ముఖాల నుండి, పుట్టి, " షడ్జ, రిషభ, గంధార, మధ్యమ, పంచమ, దైవత, నిషాద " అనబడే పేర్లతో వ్యాప్తి చెందాయి. వాటి జన్మ స్థానాలు క్రమంగా కంఠ, శిర, నాస, హృదయ, ముఖ, నాలుక, పూర్వాంగాలు. మయూర, రిషభ, అజ, సింహ, కోకిల, అశ్వ, మదగజ ధ్వనులే షడ్జం మొదలైన స్వర ధ్వని భేదాలు. షడ్జ స్వరం నుంచి నాలుగు శ్రుతులు, రిషభం నుంచి మూడు, గాంధారం నుండి రెండు, మధ్యమ నుంచి నాలుగు, పంచమం నుండి నాలుగు దైవతం నుంచి మూడు, నిషాదం నుంచి రెండు - సప్త స్వరాల నుండి ఇరవై రెండు శృతి భేదాలు ఏర్పడ్డాయి.

ఈ శ్రుతులకు ఇరవై రెండు శృతి గమకాలు,ఏడు దేశీ గమకాలు వున్నాయి. ఈ స్వర శృతి గమకాలలో ఆరు లక్షణాలు గల గీతాలు, ఆ రాగాలకు " గ్రామ త్రయం ", దాని వల్ల పదిహేను రాగాలు-వాటికి ఆరు జాతులు, వాటికి ముప్పై ఆరు రాగాలు, - వాటికి నాలుగు అంగాలు, వాటికి నూట ఆరు రాగాలు పుట్టి అనంత కోటి రాగాలుగా విస్తరించింది. ఇన్నిటిల్లో ముప్పై రెండు రాగాలు మాత్రమే లోకంలో ప్రసిద్ధమైనవి. వాద్యాలలో తథా, ఆనద్ధ, సుషిర, ఘన అనే నాలుగు వున్నాయి. కాహల, పటహ, శంఖ, భేరి జయ, ఘంటికలు అనేవి అయిదు మహా వాద్యాలు. వీణా మొదలైనవి ఇరవై రెండు రకాలు. త కారం రుద్రుడు. ల కారం పార్వతి. ఆ రెండిటి సంపుటినే తాళం అంటారు. తాళానికి కాల, మార్గ, క్రియ, అంగ, జాతి, గ్రహ కళ, లయ, యతి, ప్రస్తారం అనేవి పది ప్రాణాలు.

హనుమ భరత శాస్త్రంలో కూడా నిష్ణాతుడు .ప్రవర్తకుడు ,దర్శన కారుడు కూడా. భ అంటే భావం. ర అంటే రాగం. త అంటే తాళం. భావ, రాగ, తాళాలు అంటే సాహిత్య, సంగీతా, నాట్య ముల ఉపయోగం ఇందులో వుంది



కనుక " భరతం " అని పేరు వచ్చింది. రసాలు, భావాలు, అభినయాలు, ధర్మలు, వృత్తులు, ప్రవృత్తులు, సిద్ధులు, స్వరాలు, అతోద్యమములు, గానాలు, రంగాలు అనే పదకొండు విషయాల స్వరూపమే " నాట్య వేదం " అలాంటి నాట్య వేదానికి ప్రవర్తకుడు హనుమయే. గాన్ధర్వాన్ని సూర్యున్ని నుంచి హనుమ నేర్చుకొన్నాడు. శ్రీ రాముని కొలువులో తన గాంధర్వ విద్యను మనోధర్మంగా అమోఘంగా ప్రదర్శించాడు హనుమ. ఆ గానానికి హృదయాలు పద్మాల్లా వికశించాయి. చంద్రకాంత శిలలు కరిగాయి. మ్రోడులు చిగిర్చాయి. లోకం సంమోహ మైంది. అతని వల్లకీ (వీణ) వాద్యానికి రాళ్ళే కరిగి పోయాయి. సభ్యులు పరవశించి పోయారు. బొమ్మల్లా అచేతనులైనారు. వీణపై హనుమ " మేఘరంజని" రాగాన్ని సమ్మోహనంగా వినిపించాడు. అతను ప్రదర్శించిన మెలకువలు, ప్రౌఢిమ, రాగాలాపన, గ్రామ స్ఫూర్తి, తారలో అంతర స్ఫురిత నాద ప్రౌఢి, మీటు, కంపితం, అన్దోలితం, మూర్ఛన, శ్రుతులు, డాలు, అనేక మైన తాళ మానాలు విని జనం మైమరచి పోయారు. ఆకాశం మేఘాలతో నిండిపోయింది. కొంగలు బారులు తీరాయి. చాతక పక్షులు నోళ్ళు తెరచి ఆకాశం వైపు చూస్తున్నాయి. నీటి చుక్క కోసం నెమళ్ళు పురి విప్పి నాట్యం చేస్తున్నాయి. పాతాళంలోని పాములు పడగ లెత్తి నర్తించాయి. వర్షం పుష్ప వర్షంగా పడింది. సభ్యుల దివ్య ఆభరణాలన్నీ కరిగి పోయాయి. శశి కాంత వేదికలు కరిగి శ్రవించాయి. విమానం నడిపే వారు గతి తప్పారు. దంతపు బొమ్మలకు ప్రాణాలు వచ్చాయి. హనుమ గానం చేస్తున్నంత సేపు శ్రీ రాముడు మెచ్చి కొలుగా " ఓహ్, ఔరా, భళా, మజ్జారే, బాపురే " అని అభినందిస్తూనే వున్నాడు. హనుమ వీణా నాదానికి దగ్గర లో వున్న పెద్ద రాయి కరిగిపోయింది. సభలోని వారంతా ఆశ్చర్యం లో ముక్కున వేలు వేసుకున్నారు.

నారద, తుంబురుల తాళాపు చిప్పలు తీసుకొని హనుమ " గుండా క్రియ " రాగాన్ని వీణ పై పలికించాడు. మళ్ళీ ఆ రాయి కఠిన శిలగా మారి పోయింది. తన చేతి లోని వీణేను నారదునికి ఇచ్చి ఆ రాయిని మళ్ళీ కరిగించగల వాడే విద్యాధికుడని, ఈ తాళాలను తీసుకోవ టానికి అర్హుడు అని చెప్పాడు.

ఇద్దరు విశ్వ ప్రయత్నం చేసారు. రాయి కరగ లేదు. వీణ లను నేల పై పెట్టి తలలు వంచుకొని అహంకారం పోగొట్టుకొని సిగ్గుతో నిల బడ్డారు. " మీలో ఎవరో ఒకరు రాయిని కరిగించక పోతే ఎవరు అధికులో నిర్ణయించ లేము కదా. తాళాలు కూడా నా దగ్గరే విడిచి పెట్టాల్సి వస్తుంది అది వాగ్గేయకారులైన మీకు అవమానం కదా "అన్నాడు హనుమ .పాపం వారిద్దరూ మరింత సిగ్గు పడి " గాయక సార్వ భౌమా ! హనుమా ! మా గర్వం అణగిపోయింది. మేము మా చేష్టలకు సిగ్గు పడుతున్నాము.మీ ముందు మా గానం ఎంత ? పద్నాలుగు లోకాల్లో మీ వంటి గాయకుడు లేడు. కఠిన శిలను కరిగించే నేర్పు ఎక్కడా మేము చూడలేదు. మా తాళాలు మాకు ఇప్పించి మమ్మల్ని కనికరించండి". అని పశ్చాత్తాపంతో కుంగి విన్న విన్నుచకొన్నారు. నారద తుమ్బురులు ఇద్దరు.

దయా మయుడైన హనుమ వారిద్దరిని శ్రీ రాముని అనుగ్రహంతో క్షమించి, వారివీణలు, తాళాలు తిరిగి ఇచ్చి వేశాడు. హనుమ కీర్తి గాన చేసు కొంటు, వాళ్ళిద్దరూ సెలవు తీసుకొని వెళ్ళి పోయారు. హనుమ సీతారాముల వద్ద సెలవు తీసుకొని గంధ మాదనం చేరాడు. శ్రీ కృష్ణుడు – సత్య భామా, గరుడ, నారద, తుంబురుల గర్వాన్ని ఈ విధంగా అణగించాడు. అందరికీ అహంకారం పోయేట్లు చేసాడు. జ్ఞానం పొందారు వారందరూ.

## శ్రీ హనుమ కథానిధి - 34
## అర్జున గర్వ భంగం

ఒక రోజు కృష్ణార్జునులు సముద్ర తీర విహారానికి వెళ్ళారు.కృష్ణుడు బావ మరిదితో " అర్జునా ! ఈ సముద్రాన్ని చూస్తుంటే దాని ఘోషలో ఏదో బాధ ధ్వనిస్తున్నట్లని పిస్తుంది." అదేమిటి బావా ! ఘోష అంటున్నావు " అన్నాడు అర్జునుడు". ఒక కోతి ( ఆంజనేయుడు ) నన్ను లంఘించింది. ఒక రాజు ( రాముడు) నన్ను బందిస్తానని బెదిరించాడు. ఒక ముని ( అగస్త్యుడు ) నన్ను ఆపోశనం పట్టాడు నా బలం, నా అంతులేని తనం, నా గాంభీర్యం ఈ



విధంగా దూషిత మైనాయి అనే అవమాన భారం తో సముద్రం రోదిస్తున్నట్లు నాకు అనిపిస్తుంది" అన్నాడు కృష్ణుడు. కొంచెం అనుమానం, మరి కొంచెం అహంకారంతో " బావా ! రాముడు గొప్ప విలు విద్యా వేత్త కదా. తన బాణాలతో కాకుండా, రాళ్ళ తో ఎందుకు సేతువుని కట్టించాడు ? సీతా విరహం తో తన ప్రావీణ్యాన్ని మర్చి పోయాడా ?" అని అనుమానం బయట పెట్టాడు.

మాధవుడు నవ్వి " రామునికి శరాలు లేకా, కాదు, ధీశాలి కాకా కాదు. దానికో రహస్యం వుంది. రామసైన్యంలో అతి బలవంతులైన అనేక మంది కపి వీరులున్నారు. వారి పాద ఘట్టనకు కట్టె వంతెన ముక్కలు, చెక్కలు అయి పోతుంది, హనుమ ఒక్కడు దాని మీద నిలబడితేనే అది చీపురు పుల్లల్లా చెల్లా చెదురు అవుతుంది. హనుమ బలంలో మిగతా సైనిక బలం నూరో వంతు కూడా వుండదు ". ఈ మాటలు అర్జునునికి మరింత అహంకారం తెప్పించాయి. " నేను బాణాలతో వంతెన కడతాను. మీ హనుమను కూల్చమను దమ్ముంటే " అన్నాడు. ముసి ముసి నవ్వులు నవ్వుకొన్న ముకుందుడు మనసు లో హనుమ ను తలచాడు.మరుక్షణంలో మారుతి అక్కడ ప్రత్యక్షమై నమస్కరించి వినయంగా నిలబడ్డాడు. " మహా వీరా, అంజనీ కుమారా ! గాండీవంతో సేతువుని నిర్మిస్తాడట. అది నీ పాద ఘట్టనకు ఆగుతుందో లేదో చూసి చెప్పు " అన్నాడు. రామాజ్ఞ శిరసా వహిస్తా నన్నాడు హనుమ . పుంఖాను పుంఖాలుగా శర సంధానం చేసి బాణపు వంతెనను సముద్రం మీద నిర్మించాడు అతి లాఘవంగా, అత్యంత వేగంగా సవ్య సాచి అయిన అర్జునుడు." సేతు నిర్మాణంద్రుఢంగా చేశావా " ? అని అడిగాడు కృష్ణుడు.

" దిగ్గజాలు వచ్చి తొక్కినా కొంచెం కూడా నష్టం కలుగదు " అన్నాడు రెచ్చి పోయిన భీభత్సుడు. సరేనని హనుమను పరీక్షించ మని కోరాడు. ఒక్క సారి అట్టహాసం చేశాడు హనుమ. దిగ్గజాలు వణికి పోయాయి. ఆది శేషుడు అదిరి పడ్డాడు. ఆదిత్యుని రథం లోని కి సప్త స్వరాలు గతి తప్పాయి. బ్రహ్మ ఉలిక్కి పడ్డాడు. కేసరి నందనుడు కేసరి అంటే సింహం లా గా ఒక్క సారి పైకి

యెగిరి ఆ సేతువు మీదకు దూకాడు. అది నుగ్గు నుగ్గయింది. పూచిక పుల్లల్లా కూలి పోయింది. సముద్రపు నురుగు అంతా వ్యాపించేసింది. పాతాళ వాసులు కంపించి పోయారు. అవమానంతో అర్జునుడు ముఖం కిందికి దించు కొన్నాడు. వీరుడు కనుక బింకం గా " కపి శ్రేష్టా ! ఇంకో సారి నిర్మిస్తాను. తప్పక నిలుస్తుంది " అని భీరాలు పోయాడు. నిలవక పోతే గాండీవంతో అగ్ని ప్రవేశం చేస్తానని ప్రతిజ్ఞ చేశాడు". అలా నిలిస్తే రాబోయే యుద్ధంలో నీ జెండా పై కపి రాజునై నీ వెంట వుంటాను. " అన్నాడు. హనుమ రెండవ సారి కిరీటి వారధి నిర్మించాడు. హనుమ కుప్పించి దుమికాడు, దాని పైకి. అది చెక్కు చెదర లేదు, కౌంతేయునికి ఆశ్చర్యం వేసింది. వీరుడైన విజయున్ని వాయు సందనుడు అభినందించి గాఢంగా కౌగలించు కొన్నాడు. యుద్ధంలో కపి ధ్వజమై విజయాన్ని చేకూరుస్తానని చెప్పి, గంధమాదనానికి చేరుకొన్నాడు కపివీరుడైన వీర భక్త హనుమాన్.

ఇంతలో ఒళ్ళంతా రక్తం కారుతూ శ్రీ కృష్ణుడు అక్కడికి చేరు కొన్నాడు. అర్జునుడు దు:ఖంలో మునిగిపోయాడు. కళ్ళ వెంట నీరు కారు తుండగా " కృష్ణా ! ఈ రక్త మేమిటి "? అని గద్గద స్వరం తో అడిగాడు. లోకాల నేలే పరమాత్మ " అర్జునా ! ఆంజనేయుడు అంటే ఎవరను కొన్నావు ? అది రుద్రా వతారం. బాల్యంలోనే ఆదిత్యున్ని పండుఅని భ్రమించి, పట్ట బోయిన పరాక్రమ శాలి. శత కంధర వధ నిమిత్తం, నాలుగు సముద్రాలను అవలీలగా దాటిన వాడు. పూర్వ, పశ్చిమ గిరుల మీద రెండు పాదాలు వుంచి సూర్యుని వద్ద వ్యాకరణం నేర్చి " నవ వ్యాకరణ పారీణుడు " అయ్యాడు. వీర విక్రముడు. అసమాన బలశాలి. ధీరుడు. బ్రహాండాన్ని పండి చేయ గల సమర్ధుడు.

రావణ వధకు అన్ని రకాల సహకారం అందించిన భక్తుడు. అతను నువ్వు కట్టిన శర వారధిపై దూకితే అట్టముక్కల్లా కూలిపోదా ? అందుకని నీ ప్రతిజ్ఞ నెరవేర్చటం కోసం, రాబోయే కురుక్షేత్ర సంగ్రామంలో ఆ అసహాయ శూరుని నైతిక బలం నీకు అందించటం కోసం నేను నువ్వు కట్టిన వంతెన



కింద దూరాను. నా వీపు బద్దలైంది. శరీరం హూనమైంది. ఒళ్ళంతా నుజ్జు నుజ్జు అయ్యింది. కళ్ళు బైర్లు కమ్మాయి. గుండె చెదిరింది. మూర్ఛపోయాను కూడా. అప్పటి పరిస్థితి అది. ఇప్పుడే కొంచెం తేరుకొన్నాను. నేను అడ్డు పడకపోతే నీ పుల్లల వంతెన కుప్పకూలిపోయేది. అభాసుపాలయ్యే వాడివి. హనుమ ఉధృతికి ఏది ఆగదు. అతను తోకతోనే బ్రహ్మాస్త్రాన్ని వమ్ముచేసిన ఘనుడు. నీ మీద ప్రేమతో, నీ ప్రతిజ్ఞ తీరాలనే సంకల్పంతో ఇంత చేయాల్సి వచ్చింది." అని సవివరంగా చెప్తాడు. అర్జునుడు ఆశ్చర్యంతో " ప్రభు, శ్రీ కృష్ణా ! హనుమ ఇంతటి పరాక్రమ బల శాలి అని తెలుసుకోలేక పోయాను. హనుమ దర్శనం చేయించి నాకు జ్ఞానోదయం కల్గించిన పురాణ పురుషుడివి నువ్వు. అతను నా ధ్వజాన్ని అధిరోహిస్తే రా బోయే కురుక్షేత్ర సంగ్రామంలో మనకు దిగ్విజయం తథ్యం." అని ఉప్పొంగిపోయాడు. రామరావణ యుద్ధం లోనే కాదు, కురుపాండవ యుద్ధంలో కూడా పార్ధ ధ్వజాగ్రం పైన వుండి ఉగ్ర రూపంతో, తేజస్సుతో, గర్జనలతో, హుంకారంతో, ఆర్భటులతో, శత్రు సైన్యాన్ని సగ భాగం చంపిన వాడు ఆంజనేయుడే.

అలా కాక పోతే భీష్మ, ద్రోణులను ఎదుర్కోవటం ఎవరికి సాధ్యం ? కృష్ణుడు బోధించిన భగవద్గీత లో పరమాత్మ " పార్ధా ! కౌరవులు ఇంతకు ముందే హతులయారు. నీవు నిమిత్తమాత్రుడివై యుద్ధం చెయ్యి ". అని బోధించిన సంగతి మనం మరువ రాదు. దశ కస్తుడైన రావణ రాక్షసుని కిరీటాన్ని తన్నిన హనుమకు కౌరవులు ఒక లెక్కలోని వారా? హనుమన్నామం జపించితే చాలు కార్య సిద్ధి జరుగ తుంది. అలాంటిది హనుమ చెంతనే వుంటే విజయం నిశ్చయమే కదా.

# శ్రీ హనుమ కథానిధి - 35
# భీమ గర్వ భంగం

ఒక సారి ద్రౌపదీ దేవి " సువర్ణ సౌగంధిక పుష్పం " ను కోరి తెమ్మని భీమ సేనున్ని కోరింది. ఆ సమయంలో హనుమంతుడు భీమునికి యక్షులను, రాక్షసులను జయించే శౌర్యాన్ని ఇచ్చాడు.ఆ విషయాలను తెలుసుకొందాం. పాండవులు అరణ్య వాసం చేస్తున్నారు. భీముడు, ద్రౌపదితో కలిసి గంధ మాదన పర్వతం ప్రాంతంలో వనవిహారం చేస్తున్నాడు. ఆ వనం వివిధ తరు, లతా పుష్ప, ఫలాలతో కన్నులకు విందుగా కనిపించింది.దేవతా స్త్రీలు ఆకాశంలో వికసించిన సౌగంధిక పుష్పాలను కోస్తున్డటం ద్రౌపదీ దేవి చూసింది. అను కోకుండా ఒక పుష్పం, వారి చేతులలో నుంచి జారి, ద్రౌపది దగ్గర పడింది. దాన్ని చేతిలో కి తీసుకొంది. దాని పరి మళానికి అమిత ఆశ్చర్యపడింది. దాని అందానికి, వాసనకు అబ్బురపడి, చాలాసార్లు మెచ్చుకొన్నది. ఆమె మనోభావం తెలుసుకొన్న భీముడు అలాంటి పుష్పాలు ఎక్కడ వున్నా వెతికి ఆమెకు అంద జేస్తానని, బయలు దేరాడు.

కొంతదూరం ప్రయాణించి కనక కదళీవనం చేరాడు. చాలా మనోహరంగా వుంది వనం. జన సంచారం లేదు ఎవరైనా యెక్కడైనా వున్నారేమో నని తెలుసుకోవటానికి శంఖాన్ని పూరించినట్లు, పెద్దకేక పెట్టాడు. అప్పుడు యోగ సమాధిలో వున్న హనుమ, ఆ ధ్వని విని అది భీమసేనునిదిగా తెలుసుకొన్నాడు. ముసలిరూపం, ముడుతలు పడ్డ శరీరం ఆజాను బాహు శరీరం, దారికి అడ్డంగా తోకను పెంచి యోగ నిద్రలో వున్నట్లు నటించాడు. భీముడు దగ్గరకు వచ్చి లేపాలి అనే వుద్దేశంతో భీకర శబ్దం చేశాడు. అప్పుడే మేల్కోన్న వాడి లాగా కళ్ళు నులుపు కొంటు చూశాడు హనుమ.

భీమునితో హనుమ " ముసలి వాడిని, రోగంతో బాధ పడుతున్నాను. నిద్రపోతున్న నాకు నిద్రాభంగం చేశావు. నీకు న్యాయం కాదు. నేను కోతిని. నువ్వు మానవుడివి. సాటి ప్రాణుల మీద సానుభూతి లేదా ? నా మనసు చాలా క్షోభపడింది. ఈ ప్రదేశానికి ఎవ్వరూ రాలేరు. నువ్వు ఎలా వచ్చావు ? ఎందుకు రావలసివచ్చింది ? ఇక్కడి నుంచి పైకి వెళ్ళే దారి కూడా లేదు. ఆకాశ మార్గం లోనే వెళ్ళాలి. ఇక్కడి ఫలాలు అమృతంలాగా మహారుచిగా వుంటాయి. ఆరగించి వెళ్ళిపో. నామాట విను. నీకు మేలు " అన్నాడు. భీముడు క్షత్రియోచితం గా " నేను క్షత్రియుడిని. పాండురాజు కుమారుడిని. వాయుదేవుని వరం చేత కుంతీదేవికి జన్మించాను. పెద్ద లంటే నాకు గౌరవం. ఒక అవసర పని మీద వెళ్తున్నాను. దారి ఇచ్చి నాకు సహాయం చేయి. లేకపోతే సముద్రాన్ని లంఘించిన హనుమలాగా నిన్ను దాటుకు పోతాను." అని అన్నాడు. తనను ప్రశంశించి నందుకు సంతోషపడ్డ మారుతి "నువ్వు హనుమ ప్రశంశ ఏదో చేశావు. అతని చరిత్ర తెలిస్తే నాకు చెప్పు " అన్నాడు. భీముడు సుందరకాండ విశేషాలన్నీ పూస గుచ్చినట్లు చెప్పాడు. "నేను కూడా వాయు వరప్రసాదినే. హనుమ అంతటి వాడిని. నా ప్రతాపం చూపించమంటావా " ? అని సవాలు విసిరాడు. లోపల సంతోషపడుతూ " నేను ముసలిని. కదలలేను. కనీసం తోకను కూడా కదల్చ లేను. దాన్ని ఒక ప్రక్కకు జరిపి నీ దారిన నువ్వువెళ్ళు అన్నాడు.

భీముడు బలగర్వంతో ఎడమచేత్తో తోక కదల్చటానికి ప్రయత్నించాడు, వల్ల కాలేదు. గద పక్కన పెట్టాడు. బట్టలన్నీ బిగించి కట్టుకొన్నాడు. శరీరం లోని బలమంతా ఉపయోగించి, ప్రయత్నించాడు. ఊహూ ! ఏమీ ప్రయోజనం లేక పోయింది. చెమట పట్టింది. నీరస పడ్డాడు. గుండె తల్లడిల్లింది. స్పృహ కోల్పోయాడు. కొంతసేపటికి తెలివివచ్చి చూశాడు. అప్పుడు జ్ఞానోదయ మయింది. భయ భక్తులతో పాదాల మీద పడి " స్వామీ ! నీ మహత్యాన్ని తెలుసు కోలేక అజ్ఞానంతో ప్రవర్తించాను. నేను అతి సామాన్యుడిని. మీరు ఎవరో దయ చేసిచెప్పండి ". అని వేడుకొన్నాడు .

" నేను వాయు పుత్రుడ నైన హనుమను. లోకంలో సీతారాముల కథ ఎంత వరకు వుంటుందో అంతవరకు నేను వుంటాను. నా నివాసం గంధ

మాదన పర్వతంలోని కదళీ ( అరటి ) వనం ". అని వివరించాడు. భీమసేనుడు వెంటనే హనుమ పాదాలపై పడి చేతులు జోడించి, అతి వినయం తో " అమిత ప్రతాపా ! నా పూర్వ జన్మఫలితంగా మీ పుణ్య దర్శనం లభించింది. నేను చేసిన పాపాలన్నీ నీ దర్శనంతో తొలగిపోయాయి. కృతార్థుడను అయ్యాను. ఆనాడు సముద్రాన్ని లంఘించిన మీ విరాట్ రూపాన్ని ఒక్కసారి నాకు దర్శనం చేయించి నన్ను ధన్యుణ్ణి చేయండి " అని ప్రార్థించాడు.

## శ్రీ హనుమ కథానిధి - 36

## హనుమ భీమునికి భోధించిన కాల మహిమ

సముద్రాన్ని దాటిన హనుమ రూపాన్ని చూపించ మని కోరిన భీముడు తో హనుమ " సోదరా ! అప్పటి రూపాన్ని చూప మంటే ఎలా ? కాల భేదం వచ్చింది కదా. త్రిమూర్తులు కూడా కాలానికి బందితులే. కాలస్వరూపాన్ని వివరిస్తాను. తెలుసుకో " అన్నాడు. కాలంలో కాదు (స్మశానం), వీడు (పట్టణం) అవుతుంది. మంచి, చెడు కాలంలోనే కలుగుతాయి. పొద్దున్న ఉన్న పద్మ సౌందర్యం సాయంకాలం వుండదు కదా. రాత్రి వికసించే కలువల సౌరు పగలు మాయమవు తుంది. వర్షా కాలమేఘ గర్జన, శరత్కాలంలో రాదు. పున్నమి నాటి చంద్ర కాంతి, అమావాస్యనాడు ఉండనే వుండదు. వసంత శోభశిశిరంలో రాదు. ఇదంతా " కాలాపేక్ష " అంటారు. అంతా కాలా పేక్షే. శరీరానికి బాల్య కౌమార, యౌవన, వృద్ధాప్యాయాలు అనే నాలుగు దశలున్నాయి. వృద్ధాప్యం వచ్చిన తర్వాత మళ్ళీ బాల్యం రాదు కదా. ఒక్క రోజులోనే ప్రకృతిలో అనేక మార్పులు వస్తాయి. అలాగే యుగ ధర్మాలు మారుతూ వుంటాయి. యుగాలు నాలుగు. యుగ ధర్మాలు వాటిని అనుసరించే వుంటాయి. కాల తత్వాన్ని వివరిస్తాను విను. కాలం ఆది, అంతం లేనిది. సర్వ వ్యాపి. కాలమే పరమాత్మ. స్త్రీలింగ రూపంలో " కాళి " అంటారు. అదే శక్తిరూపం. ఈమె అన్ని లోకాలను రోజు వంట చేస్తూ, ఆరగిస్తూ వుంటుంది. పాచకత్వమే (వంట చేయటమే) కాలస్వరూపం. ఆమె చేత అనేక అన్డాండ, పిండాండ, బ్రహ్మాండాలు సంహరిమ్పబడినాయి. ఆ సంహార శక్తికి చిహ్నంగా ఆమె మెడలో పుర్రెల మాల వుంటుంది. సృష్టి యొక్క ఈ సంహార శక్తినే " నిత్య సంగ్రామకారిణి "అని పిలుస్తాం. కాళీమాత ఉపాసకులు సృష్టి యొక్క విభూతిని స్త్రీ యందే ఆరోపిస్తారు. ఈమె దశ మహావిద్యలలో సృష్టికి కారణభూతుడైన సత్పురుషుడు లేక మహాకాలుని నిత్యతాండవ వైభవమే " కాళి ". ఆ మహాకాలుడు లేక సదా శివుడే మోక్షప్రదుడై, 25 మూర్తులుగా విరాజిల్లుతూ పూజలు అందుకొంటున్నాడు. అందులో " నృత్య విలాసిని " అయిన నట రాజ మూర్తి స్వరూపం ఒకటి. అదే తాండవ మూర్తి. ఆ తాండవం సంధ్యా, కాలిక, విజయ, ఊర్ధ్వ, ఉమా, సంహార, అనే ఏడు రకాల తాండ వాలుగా పిలవ బడుతోంది. ఈ సప్త తాండవాలే కుండలిని విద్యలో సహస్రారంతో కలిసి ఏడు భూమికలుగా చెప్పబడింది .సమస్త జనులలో ఈకుండలిని నిత్య తాండవం చేస్తుంది. ఉపాసకుడు ఆరు చక్రాలు ఛేదించి, సహస్రారంలో ఐక్యభావాన్ని, పొంది, అద్వైతస్థితిలో వున్నప్పుడు మిగిలేరి అఖండ అద్వైతానందమే. ఈ స్థితినే " ఆనంద తాండవం " అంటారు.

చలన క్రియ అంతా తాండవమే. స్పందన ప్రాణశక్తి విలాసమే. సృష్టి, స్థితి, లయము, తాళ బద్ధ మైన చలనంలోనే సాగిపోతాయి. పరిణాయ శక్తి అయిన కాళీ శక్తి కేవలం సంహారానికే కాక, సృష్టికి కూడా కారణభూతం అవుతుంది. " నేను భువన సృష్టిని ప్రారంభించటానికి వాయువు లాగా అన్ని చోట్ల ప్రవహిస్తాను. " అనే వేద మంత్రం వాయువుకు ప్రాధాన్యత నిచ్చింది. సాహిత్య పరంగా వీర, శృంగార అపురూప దర్శనం ఇదే. ఈ వైభవం వల్లే జగత్తుకు పరమ కారణం అయిన శివుడు అయ్యాడు. పరమ శివుడే సదా శివుడు. ఈ సమిష్టి శక్తి అనే ప్రక్రుతి శక్తి అన్ని ప్రాణులు ఆవహించి వుంది. అందు వాల్ల ఆ శక్తే వ్యష్టి శక్తి (వికృతిశక్తి) గా మారుతుంది. సూర్యుని కాంతి చంద్రుని పై పడి, ప్రతి ఫలించి, వెన్నెలగా మారుతోంది. ప్రపంచానికి కారణ మైన సమిష్టి శక్తి, ప్రాణి కోట్లను ఆశ్రయించి, కుండలిని శక్తిగా పిలువబడుతోంది.

# శ్రీ హనుమ కథానిధి - 37
# హనుమ బోధించి కాల మహిమ, కలియుగ లక్షణాలు

" శక్తి పురం అనే దేహంలో శ్రేష్టమైన ప్రాణాన్ని, ఆవేశించి, క్రియా శక్తి అవుతుంది. అది, వ్యక్తి జ్ఞానేంద్రియ, కర్మేంద్రియాల తో కూడి, ప్రాణంగా మారుతోంది. అదే ప్రాణాతీతమైన పరమమైనదిగా, భావించి, శక్తిగా, ఉపాశించి నపుడు, చిత్ శకి గా భావిస్తారు. ఆ చిత్ శక్తినే శ్రీ అంటారు . శ్రీ మొక్క గుణో పాసకులే శ్రీ విద్యోపాసకులు. జీవుని ఉచ్చాస నిస్స్వాసాలు ప్రాణ తరంగాలే కాని ప్రాణం మాత్రం కాదు. సముద్ర తరంగాలు శక్తి కాదు. శక్తి విలాసమే తరంగాలు. వాయువు క్రియా ప్రాణం కాదు. జీవులలో ప్రాణ శక్తి, ఉచ్చాస, నిస్స్వాసాలతో క్షీణిస్తుంది. ఆత్మ శక్తి పెరగాలంటే, కాళీ మాతను ఉపాసించాలి. ఈ విద్య ఇహం లో భోగభాగ్యాలను, చివరికి మోక్షాన్ని ఇస్తుంది.

భీమా ! ఈ విద్యనే వేదం " సంసర్గ విద్య " అంది" ముఖ్య ప్రాణోద్గీత విద్య " గా పేర్కొంది. ఆ ముఖ్య ప్రాణాన్ని నేనే. నన్ను ఉపాశిస్తే, కాలాతీతులౌతారు. త్రికాలజ్ఞులు అవుతారు. జన్మరాహిత్యం పొందుతారు .నువ్వు నా సోదరుడివి కనుక ఈ రహశ్యాలన్నీ నీకు చెప్పాను " అని కాల మహిమను హనుమ భీమసేనునికి బోధించాడు. భీముడు పరమానంద భరితుడయ్యాడు. " అన్నా ఆంజనేయా ! జీవ భ్రాతిలో కొట్టుకొలేకపోతున్న మాలాంటి వారికి కాలతత్వాన్ని, పరమార్ధాన్ని, సవివరంగా బోధించావు. మనుషులు సుఖాలన్నీ తమ ప్రయోజకత్వం అనీ, కష్టాలకు కారణం ఇతరులని చెప్పుకొంటారు. లేక పోతే కాలాన్ని నిందిస్తారు. కాని కాలాన్ని, పరమాత్మ తత్వంగా ఉపాశించటం మరచి పోయారు." అని భీముడు కృతజ్ఞత తెలియజేశాడు.



## హనుమ బోధించిన కలియుగ లక్షణాలు

" భీమ సేనా ! భయంకర మైన కలియుగ లక్షణాలు విను. కృత, త్రేతా, ద్వాపర యుగాలలో ధర్మం ఒక్కొక్క పాదం కోల్పోయింది. కలియుగాన్తానికి ధర్మం ఏమీ మిగలదు. ద్వాపరం నువ్వు చూస్తూనే వున్నావు కదా. కలిలో కాలానుగుణ వర్షాలుండవు. చల్లిన విత్త నాలు పొట్లు పోతాయి. కరువు పీడిస్తుంది. పొట్ట గడవక జనం వలసలు పోతారు. తేలిక పంటలే ఎక్కువ. భూమి నిస్సార మవుతుంది. పువ్వులలో వాసన వుండదు. తినే వాటిలో సారం వుండదు. ప్రజలు దుర్బలులు అవుతారు. రోగాలెక్కువ. మరుగుజ్జులుగా తయారవుతారు. అల్పాయుష్కులు. కలిలో పూర్ణాయుర్దాయం ఇరవై ఏళ్ళు మాత్రమే. ఏడు, ఎనిమిది ఏళ్ళకే స్త్రీలు సంతానం పొందుతారు. వివాహ,దాంపత్య వ్యవస్తలు భ్రష్టం అవుతాయి. సంపాదన వున్న భర్తనే భార్య గౌరవిస్తుంది. స్వేచ్ఛా ప్రవృత్తి అందరి లోను ఎక్కువ. భార్య, భర్తలు, గురుశిష్యులు, వంచనకు గురి అవుతారు. అత్త మామలను కోడళ్ళు లెక్కచేయరు. తలిదండ్రులను పిల్లలు గౌరవించరు. క్రయ, విక్రయాల్లో అంతా కపటమే. దాచుకొన్న సొమ్ము దోపిడీకి గురి అవుతుంది. పుణ్యం, పాపం, స్వర్గ, నరకాలను లెక్కచేయరు. శాస్త్ర పాండిత్యం తక్కువ. వాగాడంబరం ఎక్కువ. వేద నింద చేస్తారు. శాస్త్రం మీద విశ్వాసం వుండదు. ఆత్మ విచారణ చేయరు.

స్త్రీ లకు కేశాలే అలంకారం. ధనవంతున్నే కొలుస్తారు. ఆవుపాలు లభించవు. ఆవు మీద పవిత్రభావం వుండదు. బ్రాహ్మణున్ని లెక్కచేయరు. హింస ఎక్కువ అవుతుంది. అన్నిటికీ ప్రమాణం చేస్తారు, దానికి కట్టు బడరు. స్వార్ధంతో ధర్మాన్ని వదిలి పరధర్మాన్ని అనుసరిస్తారు. స్త్రీలు వ్యభిచరిస్తారు. కులగోత్రాలు పాటించరు. బహు భార్యాత్వం, బహు భర్తృత్వం ఎక్కువ అవుతాయి. వర్ణ వ్యవస్థ కూలి పోతుంది. డబ్బు వున్న వాడే రాజు. అంతా ధనప్రభావమే. దొంగలే రక్షకులు. నటులే ప్రభువులవుతారు. అందరూ కవులే. పాలకులు ప్రజల్ని పట్టించు కోరు. ప్రజల, ధన, మాన, ప్రాణాలకు రక్షణ వుండదు.

దేవాలయాల్లో ధూప దీప నైవేద్యాలు పెట్టే దిక్కుండదు. దేవుడి భూముల ఆక్రమణ ఎక్కువ. దైవ దర్శనానికి డబ్బు గుంజుతారు. నిషిద్ధ వస్తువులనే తింటారు. భక్తి అనేది సంపాదనకు మార్గం అవుతుంది.మాంసా హారులే ఎక్కువ, బ్రాహ్మణులు కుక్కల్ని పెంచుతారు. ప్రజలు అనాధలను, స్త్రీ లను హింసిస్తారు. దొంగలు, నాస్తికులు, పాషండులు పాలకులవుతారు. రక్షకులే భక్షకులవుతారు. కలి కాలం చివరలో రాజ్యాల మధ్య శత్రుత్వం పెరిగిపోతుంది .మహా భయంకర యుద్ధాలు చెలరేగుతాయి. విశ్వ ప్రాణి నాశనం అవుతుంది. కొద్ది మంది మాత్రం వేదం నేరుస్తారు. తిరిగి క్రమంగా ప్రజల్లో ధార్మిక భావం పెరుగుతుంది. వైదిక ధర్మం మళ్ళీ పరమ వైభవ స్తితిలోకి వస్తుంది. రాజులు, ప్రజలు ధర్మబద్ధంగా ప్రవర్తిస్తారు. ఆ ధర్మ చాయలో ప్రజలంతా, శాంతి సౌభాగ్యాలతో హాయిగా, సుఖంగా, ఆనందంగా జీవిస్తారు.“ అని హనుమ, భీమ సేనునికి కలియుగ ధర్మాలను, లక్షణాలను సవివరంగా తెలియజేశాడు. భీముడు పరమానందం పొందాడు.

## శ్రీ హనుమ కథానిధి - 38
## భీమునికి హనుమ చూపిన విశ్వరూపం

కాల లక్షణాలు, కలియుగ లక్షణాలు హనుమ బోధిమ్పగా భీముడు విని, ఆనందంతో “ అన్నా ఆంజనేయా ! భయం కలిగించే ఈ కలి ప్రభావం నుంచి, తప్పించు కొనే ఉపాయం వుంటే బోధించు ” అని దీనంగా అడిగాడు. దానికి మారుతి, కుంతీపుత్రునికి “ సోదరా ! నేనే భవిష్యత్ బ్రహ్మను. నన్ను ఆరాధించి, నా నామ సంస్మరణ చేసిన వారికి కలి దోషాలేవీ అంటవు. నాకు నా భక్తులంటే చాలా ఇష్టం “ ఆంజనేయా ” అని ఒక సారి పిలిస్తే చాలు, వారిని ఆదుకొంటాను. ఆపన్నులను రక్షించే బాధ్యత నేను తీసు కొంటాను ”. అని చెప్పాడు. భీముని భయం తొలగింది. మళ్ళీ “ అన్నా ! ప్రళయం తర్వాత జరిగే సృష్టికి నువ్వే కర్తవు అని తెలిసి ఆనందిస్తున్నాను. కాలా తీతుడివి. జనన



మరణాలు లేని వాడివి. చిరంజీవివి. నీకు ముసలి తనం లేదు. లోకాలను భ్రమింపజేస్తున్నావు అంతే. నువ్వు వానరుడవు కాదు, సాక్షాత్తు పరమేశ్వరుడివి. నేను నీ కిన్కరుడిని. నా మీద దయతో నీ విశ్వరూప సందర్శన భాగ్యం నాకు కల్పించు ” అని వేడు కొన్నాడు. దానికి హనుమ సంతోషించి ఆ దివ్య విభూతిని చూపిస్తున్నాడు.

“ ఆకాశము, దిక్కులు, తానే అయి, తోక నక్షత్రాలను తాకగా, దుర్నిరీక్షుడై గోచరించాడు. భీముని మేను వణికింది. గద్గద స్వరంతో ఎన్నో విధాల స్తుతించాడు.“ చిరంజీవి ! పరమాద్భుతం నీ రూపం. కోటి సూర్యులు ఉదయించి నట్లుంది, నీ తోక కదిలిస్తే నాకు కనిపిస్తోంది. ఇంక చూసే ధైర్యం లేదు. కళ్ళు మిరుమిట్లు గొలుపుతున్నాయి. దయచేసి నీ విశ్వరూపాన్ని ఉపసంహరించు ” అని ప్రార్ధించాడు. ఆంజనేయ స్వామి అనుగ్రహించి మళ్ళీ మామూలు రూపం లోకి వచ్చేశాడు. తేరు కొన్న భీముడు “ లోక బాంధవా ! నక్షత్రాలు నీ మొల పూసలా లేక పాదాల గజ్జలా అన్నట్లున్నాయి. కుల పర్వ తాలు నీకు పూలదండల్లా వున్నాయి. సముద్రం నీకు ఆవుపాదం అంత. రాక్షసులు కీటకాలు. నీ లాంటి వాడు తోడుగా వున్నాడు కనుకే శ్రీ రామునికి దశకన్టుడు అయిన రావణాసురుణ్ణి సంహరించటం తేలిక అయ్యింది ” అని మెచ్చాడు.

దానికి హనుమ “ నా తమ్ముడివి నువ్వు. నన్ను ఇంతగా స్తుతించ కూడదు. నువ్వు వచ్చిన పనేమిటో నాకు తెలుసు. ఆ వనం దేవతల స్వాధీనం లో వుంది. నువ్వు గొప్ప సాహసమే చేశావు. దేవతలు, ధ్యాన, దాన, హోమ, తంత్ర, మంత్ర, తపోవిదాన, భక్తీ, బలి, తర్పణ మొదలైన వాటికే వశం అవుతారు. బల గర్వాలకు వశం కారు. పెద్దల అనుమతి లేకుండా ఏ పనీ చేయరాదు . అలా చేస్తే కష్టాలు చుట్టూ ముట్టు తాయి. దేశ, కాలాలను పరిగణనలోకి తీసుకొని ప్రయత్నించాలి. కేవలం బల ప్రదర్శన చేస్తే భంగ పాటు తప్పదు . నీ కార్యం నిర్విఘ్నంగా నెర వేరుతుంది. నువ్వు అతి ధైర్యశాలి వైనా ఒక వరం నీకు ప్రసాదిస్తున్నాను “ దుర్బుద్ధితో మీ రాజ్య సంపదను లాక్కొన్న దుర్యోదనుడు

మీ రాజ్య భాగం మీకు ఇవ్వడు. మీ సంధి ప్రయత్నాలేవీ ఫలించవు. కురుపాండవ యుద్ధం అనివార్యం అవుతుంది. మిమ్మల్నే విజయ లక్ష్మీ వరిస్తుంది. సాక్షాత్తు భగవాన్ శ్రీ కృష్ణుడే ధర్మ పక్షపాతి కనుక మీ వైపే ఉంటాడు. ఇంక ఆలశ్యం చెయ్యక వెళ్ళు. సౌగంధిక పుష్పాలుండే వనానికి దారి ఇదే " అని భీముణ్ణి గాడంగా ఆలింగనం చేసుకొని, దీవించి, అంతర్ధానమయ్యాడు పవన సుత హనుమాన్. భీమునికి వెయ్యి ఏనుగుల బలం వచ్చింది. యక్ష, రాక్షసాదులను జయించి సౌగంధిక పుష్పాలను తెచ్చి ద్రౌపదీ దేవికి ఇచ్చి, ఆమె ముచ్చట తీర్చటానికి అక్కడి నుండి బయలు దేరాడు. అందరినీ జయించి సౌగంధిక పుష్పాలను తీసుకొని పాండవులను చేరుకొని వాటిని ప్రేమగా ద్రౌపదీ దేవికి ఇచ్చి, ఆమె కోరిక తీర్చి ఆనందింప జేశాడు.

# శ్రీ హనుమ కథానిధి - 39
# భీముడు పురుష మృగాన్ని తేవటం

ధర్మ రాజు అశ్వ మేధ యాగం తల బెట్టాడు. కృష్ణుని తో " కృష్ణా ! యాగ సమయంలో యాగశాలలో నిరంతరం అన్నదాన ప్రక్రియ జరుగుతుంది కనుక నిత్యమూ పరిశుభ్రంగా వుండేటట్లు జాగ్రత్త వహిస్తూ పర్యవేక్షించే బాధ్యత నీకు అప్పగిస్తున్నాను " అని చెప్పాడు. దానికి వాసుదేవుడు " ధర్మ నందనా ! పురుష మృగం అనే ఒక మృగం వుంది. అది పురుషుడుగానూ, మృగంగానూ వుంటుంది. దాని మహాత్యాన్ని మూడు సార్లు పఠిస్తే, దుస్వప్నాలురావు. ఆ మృగం వున్న చోట ఎంత కాలుష్యం వున్నా, తొలగి వాతావరణం పరిశుద్ధ మవుతుంది. ఇది పర్యా వరణాన్ని ఎల్లప్పుడు కాపాడుతుంటూ వుంటుంది. దానికి ధైర్యసాహసాలు ఎక్కువ. యక్ష, రాక్షస, సిద్ధ, విద్యాదరులు దానికి సపర్యలు చేస్తుంటారు. అది పురుషులు లేని దుర్గమ అరణ్యంలో మాత్రమే వుంటుంది. దాన్ని భీముడు మాత్రమే తీసుకొని రాగలడు ". అని చెప్పాడు.





భీముని పిలిచి " వృకోదరా ! నువ్వు హనుమ అనుగ్రహం పొందిన వాడివి. నువ్వు వెళ్ళి ఆంజనేయుడు ఏది చేస్తే అది చేసి ఆ మృగాన్ని సాధించి తీసుకొని రా " అన్నాడు. భీమసేనుడు పురుష మృగం కోసం బయలు దేరాడు. గంధ మాదనం చేరి హనుమకు నమస్కరించి వచ్చిన పని విన్నవించాడు. హనుమ " నువ్వు ఎప్పుడూ ఇలాంటి సాహసాలే చేస్తావు. దేవతలు కూడా ఆ మృగాన్ని సమీపించలేరు. ఒక ఉపాయం చెబుతావిను. అది వున్న చోటకు వెళ్ళి దూరంగా వుండి గర్జించు. అది వెంబడి పడి తరుముతుంది. దాంతో ఎవరు పరిగెత్తలేరు. చంపనూలేరు. నీ గర్జన విని అది నిన్ను తరుముతుంది. బలం కొద్దీ పరిగెత్తు . నేను నా వాల రోమాలను ఇస్తున్నాను. అది నీ దగ్గరకు s ⊳±Hüÿ ¿£s Ãe Ö“ • <‘“ e TF+<$$ &° |™ T⁄అ రోమం దానికి శివలింగంగా కనిపిస్తుంది శివలింగం కనిపిస్తే అది పూజ చేయకుండా వుండదు. నువ్వు ఓపిక కొద్దీ పరిగెత్తు . దాని పూజ అయింతర్వాత అది నీ వెంట మళ్ళీ పడుతుంది. దగ్గరకు రాగానే ఇంకో రోమం విడిచిపెట్టు. అది మళ్ళీ పూజ చేస్తుంది ఇలా హస్తిన వరకూ దాన్ని తీసుకొనివెళ్ళు ." అని చెప్పి కొన్ని రోమాలను భీముని చేతిలో పెట్టాడు హనుమ. వాటిని భక్తిగా కళ్ళకు అద్దుకొని తీసుకొన్నాడు భీముడు. హనుమ చెప్పినట్లే ఆ రోమాలను మృగం సమీపంలో విడిచాడు. అక్కడ ఒక శివాలయం వెలిసింది. ఒక మాయా లింగం సరోవరం, రత్న మాణిక్యాలతో విరాజిల్లింది. మృగం అక్కడ ఆగి, నిష్టతో పూజించింది. అలా మళ్ళీ రోమం విడవటం, అది రావటం, శివాలయం శివుడు కథ మామూలే. చివరికి హస్తినలో వాళ్ళ గృహద్వారం చేరింది. భీముని కాలు పట్టుకొంది దాన్ని చూసి, ధర్మజ, శ్రీ కృష్ణులు అక్కడికి చేరారు. ధర్మ రాజు దానితో " వో మృగశ్రేష్టుడా ! మా శరణు జొచ్చిన వారిని తినటం న్యాయంకాదు. నీకు తెలియని ధర్మాలు లేవు. మా సోదరుడు నీ కంటే ముందుగా మా గృహద్వారం లోకి చేరాడు. క్రూరమృగాలు ఇంట్లోకి రావు కదా. నువ్వు ప్రాజ్ఞుడవు. బైట నీకు దొరికిన కాలును భక్షించటమే నీకు న్యాయం. మిగతా దాని జోలికి పోయే హక్కు నీకు లేదని నీకూ తెలుసుకదా"

అన్నాడు. ధర్మరాజు ధర్మబుద్ధికి మృగం సంతోషించి "నీ సుకృతానికి సంతోషించాను. ఏ వరం కావాలో కోరుకో " అంది. దానికి యుధిష్టరుడు " నా యజ్ఞం పూర్తి అయ్యే వరకూ ఇక్కడే వుండి పరిశుభ్రతను కాపాడి మాకు మేలుచేయి " అని కోరాడు. అతని కోర్కె మేరకు ఆ పురుష మృగం అక్కడే వుండి యాగం పూర్తి అయ్యే వరకు ఉంది, శుభ్రత విషయంలో అత్యంత శ్రద్ధ తీసుకొని అందరి మెప్పు పొందింది. వాతావరణాన్ని బాగా కాపాడి ప్రజలకు మేలుచేసింది. పాండవాగ్రజుని మనోభీష్టం నిరవేరింది.

# శ్రీ హనుమ కథానిధి -40
# గంధ మాదనంలో హనుమ దిన చర్య

కింపురుష వర్షంలో భవిష్యత్ బ్రహ్మ అయిన శ్రీ హనుమ దిన చర్యను గూర్చి తెలుసుకొందాం. అక్కడి జనం మారుతి ముఖాన్ని తప్ప ఇంక దేన్నీ చూడరు. ముందుగా హనుమకు ప్రదక్షిణ చేసి కాని వేరే పనికి పూనుకోరు. ఆయన పవిత్ర చరిత్రను తప్ప వేరు దాన్ని పఠనం చేయరు. సమీర కుమారుని సేవలే తప్ప ఇతర సేవలుండవు. ప్రభంజన సుతుని, సద్గుణాలే కాని, ఇతరగానం వుండదు. అందరూ హనుమద్భక్తులే. ఆయనే వారికి లోకం. ఆయన కృపాకటాక్షాలే వారి సర్వస్వం. అందరు, ఆయన ఆశీర్వాద బలంతో, ఆయుష్షు, ఆరోగ్యం, భోగం, భాగ్యం అనుభవిస్తున్నారు. అక్కడి వారంతా, నిత్య సంత్రుప్తులే. పుత్రపౌత్రాధి వృద్ధిగా జీవితాలను పండించుకొంటున్నవారే. అదొక దివ్యవైభోగం. మాటలతో చెప్ప నలవి కానిది.

హనుమ భార్య సువర్చలాదేవి కొలువు కూటంలో సీతారాముల దివ్య చరితామృత గానం గంధర్వులు నిత్యం చేస్తూంటారు. శ్రీ రామ పవిత్ర చరిత్రను మునులు వివరిస్తూంటారు. అప్సరసలు రాఘవ గాధను నృత్యం చేస్తుంటారు. చారణులు రాఘవునిపై పద్య గద్యాలను చదువుతారు. యక్ష, కిన్నెర, సిద్ధ సాద్ధ్యులు, విద్యాధరులు, సకల దేవతా సంఘాలు కైవారం చేస్తుంటారు. ఇంద్రాది



దిక్పాలకులు, పంచభూతాలు, సమస్త దేవ ఋషి, గణాలు, అష్ట వసువులు, 11 లక్షల దేవతా గణం పరివేష్టించి, హనుమను నిత్యం కొలువగా, భవిష్యత్ బ్రహ్మ అయిన హనుమ శ్రవణ, కీర్తన, స్మరణ పాదసేవన, అర్చన, వందన, దాశ్య, సఖ్య, ఆత్మ నివేదనా పూర్వక నవ విధ భక్తి మార్గతత్పరుడై, " అంతా రామమయం – ఈ జగమంతా రామమయం " అని పాడుకొంటు, రామభక్తి తత్పరుడై, తన్మయుడై, మైమరచి ఉంటున్నాడు హనుమ.

**ఋషి గణానికి హనుమ తత్వోపదేశం**

ఒక రోజున, సనకసనంద నాది భక్తులు, ఋషిగణం, మునిగణం హనుమను సమీపించి ఆంజనేయ ! నువ్వు ఈశ్వరాంశ సంభూతుడివి, సర్వజ్ఞుడివి. భవిష్యత్ బ్రహ్మవు నీవే. శాస్త్రాలన్నీ చదివిన, మాకు సందేహాలు తీరటం లేదు. వాటిని నువ్వే తీర్చాలి. కర్మ, భక్తి, జ్ఞానాలలో ఏది శ్రేష్టం ? జన్మకు కారణం ఏమిటి ? జన్మ రాహిత్యానికి ఉపాయం ఏమిటి? మోక్షానికి మార్గం ఏమిటి? " అని ప్రశ్నించారు. హనుమ చాలా సంతోషించి, మనసులో శ్రీ రామ చంద్రుని ధ్యానించి, మేఘగంభీర పవనంతో "ఆత్మ స్వరూపులారా! మీరు అడిగిన ప్రశ్నలకు సమాధానాలు తర్కంతో, బుద్ధిబలంతో నిర్ణయింప బడేవి కావు. వేద వాక్యాల వల్లే తెలియదగినవి. సంసారంలోపడి మానవులు, ఈ ప్రశ్నలను గురించి ఆలోచించరు. జిజ్ఞాసువులకు దారి చూపే వారే లేరు. శాస్త్రం చదువుకొని, దాని మర్మాన్ని తెలుసు కొనేవారు కోటికి ఒక్కడు కూడా వుండరు. శాస్త్రం వేదం మీద ఆధారపడి వుంది. మహా వాక్యాలు నాలుగు . వాటి తాత్పర్యం తెలిస్తేనే జ్ఞానం కలుగుతుంది. జ్ఞానమార్గమే శ్రేష్టం జన్మకు కారణం, జన్మరాహిత్యానికి ఉపాయం రెండు ఒకటే. వెలుగును సృష్టించటానికి, చీకటి పోగొట్టటానికి ప్రయత్నం ఒకటే. అద్వైతమే అందరికి సరైన మార్గం .

మోక్షం అంటే జీవ బ్రాహ్మైక్యమే. ఇలా వేదం వరకు వెళ్ళగలిగేవారు చాలాతక్కువ. గురువు చేతిలో దీపమే శిష్యునికి మార్గ దర్శనం చేస్తుంది. సర్వజ్ఞుడు అయిన ఈశ్వరుడు దక్షిణామూర్తి అవతారంలో చిన్ముద్ర చేత జీవ బ్రహ్మైక్యాన్ని మౌనంగా బోధించాడు కదా ? నిజమైన జ్ఞాని పిపీలికాది, బ్రహ్మ పర్యంతం

చైతన్యం స్వరూపంగా భావించి ఆ వైభవాన్ని దర్శించి, ఆత్మానందం అనుభవిస్తుంటాడు. ఆ బ్రాహ్మీ భూత స్థితి నుంచి, క్షణం కూడా విడిచి వుండడు. గురు శిష్య సంబంధం "సంహితా స్వరూపం " అణువు నుంచి, మహత్తు వరకూ, అంటే పదార్థంలోని అణువుల నుంచి, గ్రహాలు, నక్షత్రాలు, తారామండలం, అనేక లోకాలతో కూడి వున్న అనంత విశ్వాన్ని, నిరంతరం, సహచర్యతో, విడదీయ రానిదిగా కలిపి ఉంచే శక్తి చైతన్యంను " సంహిత " అంటారు. ఇది అనాది. సహజం. ప్రకృతి సిద్ధం అయిన శక్తి. అదే పరమాత్మ స్వరూపం. దానినే "సత్ " అంటారు. పురుష వాచకంగా చెబితే " సత్య పురుషుడు" అంటాం. స్త్రీ వాచకంగా చెప్పాలంటే " సతి " అంటారు. సతి ఎప్పుడు, సత్య పురుషుని విడిచి పెట్టకుండా ఉండటమే " సతీత్వ ధర్మం "ఇదే సంహితా లక్షణం. శివశక్తులు, లక్ష్మీ నారాయణులు, వాణీ బ్రహ్మలు, సీతా రాములు, వీరందరూ సంహితా స్వరూపులే. ఒకర్ని ఒకరు విడిచి వుండరు. ఈ లక్షణాన్నే పురాణాలు " అర్ధనారీశ్వరం " అన్నాయి. లక్ష్మీ దేవిని " అనపాయిని " అనీ, సరస్వతీ దేవి బ్రహ్మముఖంలో వుంటుందని అన్నాయి. సంహితలో నాలుగు భాగాలు వున్నాయి. ఒక్కటి – పూర్వ రూపం. రెండవది – ఉత్తర రూపం. మూడవది – సంధి, నాల్గవది – సంధానం. వేదం కూడా మంత్రము, బ్రహ్మణము, ఆరణ్యకము, ఉపనిషత్తు అనే నాలుగు అవయవాలు కలిగి వుంది. కొందరు మంత్ర భాగాన్నే అంగీకరిస్తారు. అప్పుడు వేదానికి సంహితా లక్షణం వుండదు. గురుశిష్య సంహితా స్వరూపాలు ఈ విధంగా వున్నాయి. మొదటిది– ఆచార్యుడు అంటే గురువు – పూర్వ రూపం. రెండవది – అంతే వాసి అంటే శిష్య రూపం. మూడవది – విద్య అంటే వారిద్దరిని కలిపేది నాలుగు – ప్రవచనం – విద్య చెప్పటం అదే సంధానం. విద్య అంటే వేదమే. ఈ విధంగా గురుశిష్యులు సంహితా స్వరూపులు అవుతారు. అని శ్రీ హనుమ వారందరి సంశయాలను నివృత్తి చేశాడు. వారందరూ చీకటి లోంచి వెలుగు లోకి వచ్చిన భావం పొంది, మారుతిని అనేక విధాల స్తుతించారు. కలికాలంలో శ్రీ రామ, శ్రీ కృష్ణ, శ్రీహనుమ అవతారాలను గురించి తర్వాత తెలుసుకొందాం.



# శ్రీ హనుమ కథానిధి -41

## కలిలో రామ, కృష్ణ, ఆంజనేయ అవతారాలు

శ్రీ రామునిది ఇచ్ఛా శక్తి. ఆన్జనేయుడిది క్రియా శక్తి. కృష్ణుడిది ఇచ్ఛా శక్తి. అర్జునుడిది క్రియా శక్తి. కలియుగంలో శ్రీ రామ, శ్రీ కృష్ణ అవతారాలు రెండు కలిసిన అవతారం ఏర్పడుతుంది. అది తన ఇచ్ఛా శక్తి చేత ప్రపంచాన్ని నడిపిస్తుంది. ఆంజనేయుడు క్రియా శక్తి చేత ప్రపంచాన్ని నడిపిస్తాడు. కలిలో ఆవిర్భావం అయ్యే అవతారం మహా శివుడైన మహాకాలుడి అవతారం. శివుడు, శక్తి పరస్పర ఉపాసకులు. అలాగే, మహాకాల, మహాకాళి పరస్పరోపాసకులు. కలిలో ఈ అవతార రహస్యాలను కొద్దిమంది జ్ఞానులే తెలుసుకోగలరు. మిగిలిన వారు మాయలో పడి తెలుసుకోలేరు.

ఆంజనేయుడు మహర్షులకు కొంత జ్ఞానబోధ చేశాడు." భక్తీ, జ్ఞాన, కర్మ మార్గాలలో కర్మ కంటే భక్తీ, భక్తీ కంటే జ్ఞానం శ్రేష్టమైనవి. తాత్విక చింతన ఉత్తమం. జపం మాధ్యమం. శాస్త్ర చింత అధమం.లోకచింత అధమాధం. " కర్మ మార్గం – చెట్టు మొదట్లో వున్న చీమ, చెట్టు చివరి కొమ్మ వరకు పాకి, పండును ఆస్వాదించి నట్లు గా చాలా కాలానికి ఫలిస్తుంది." భక్తి మార్గం – కోతి ఒక కొమ్మ నుండి, మరొక కొమ్మ మీదికి దూకి పండును పట్టుకొన్నట్లు గా వుంటుంది. " జ్ఞాన మార్గం – పక్షి యెగిరి పండును పట్టుకొన్నట్లుగా వుంటుంది. " అంత మాత్రం చేత, కర్మ, భక్తీ మార్గాలు నింద్యమైనవి కావు. జ్ఞాని అయినట్లుగా భావించుకొని కర్మను, భక్తిని వదిలితే నరకమే. చెట్టు పండు దశలో పుష్పాన్ని ఒదిలి ఎదుతుంది. అదీ తత్వజ్ఞాని స్థితి. " పొట్టు వుంటే ధాన్యం అంటాం. పోట్టు తీసేస్తే బియ్యం. ధాన్యం చల్లితే మొలకలెత్తుతుంది . బియ్యం చల్లితే మొలవదు. కోరికలే బంధాలైతే, పునర్జన్మ లభిస్తుంది. పొట్టులో సారం ఏమీ లేక పోయినా, అదే పునరుత్పత్తికి కారణం అవుతుంది. అలాగే, అసంగతం, అజ్ఞాన విలసితం, నిష్ఫలం, నిస్సారమైన కోరికలే పునర్జన్మకు

కారణం. పొట్టును తీసేసినట్లు, అజ్ఞానాన్ని వదిలేస్తే అంటే కోరికలను వది లేస్తే, నిస్సంగు డైతే, జన్మ రాహిత్యాన్ని పొందుతాడు. చాలామంది తీరని కోరికల్ తో కాలి దహిచుకుపోతారు. మనం నిజంగా దహించాల్సింది కోర్కెలను. తీరని కోర్కెలతో మనం దహించుకు పోవటం కాదు. వేయించిన విత్తనాలు మొలవ్వు. విపరీతా చరణంతో కోర్కెలలో చిక్కుకొని, విషవలయంలో చిక్కుకొని, చావు పుట్టుకల చక్రభ్రమణంలో పరిభ్రమిస్తూంటారు మానవులు.

# శ్రీ హనుమ కథానిధి -42
# శ్రీ సువర్చలాంజనేయ కల్యాణం

సువర్చలా దేవి, త్రిమూర్త్యాత్మకుడు, కర్మ సాక్షి అయిన సూర్య భగవానుని కుమార్తె. అయోనిజ. సూర్యుడు ఒకప్పుడు అధిక కాంతితో మిరుమిట్లు గొలుపు తుండేవాడు. ఆ తేజస్సుకు లోకాలే కాదు భార్య సంజనాదేవి కూడా భయపడింది. ఆ వేడి తట్టు కోలేకపోయింది. ఆమె దేవతా శిల్పి అయిన విశ్వకర్మ కుమార్తె. సూర్యుడు తన తేజస్సును తగ్గించుకోవటానికి సిద్ధపడ్డాడు. విశ్వకర్మ, సాన పట్టాడు సూర్యుడిని. ఆ రజను అంతా అమిత తేజంతో ఉదయాద్రి మీద కుప్పగా ఏర్పడింది. అందులోంచి అతి వర్చస్సుకల కన్య ఉద్భవించింది. ఆమె ఏ సువర్చలా దేవి.

అప్పుడు దేవతలు, సువర్చలకు తగిన వరుడు అంజనా సుతుడైన ఆంజనేయుడు అని తెలియజేశారు. ఆ సువర్చల దినదిన ప్రవర్ధమానంగా పెరిగింది. సకల కళాప్రపూర్ణ అయింది. అప్పుడే హనుమంతుడు సూర్యుని వద్దకు విద్యాభ్యాసం కోసం వచ్చాడు. అధిక తేజో విరాజితుడైన హనుమను చూసి సువర్చల, ఆయనపై మరులు కొన్నది. హనుమ విద్యాభ్యాసం నిరంత రాయంగా సాగింది. చెలులు ద్వారా, తన మనోభావాన్ని చెలికత్తెల ద్వారా తలిదండ్రులకు తెలియజేసింది. సూర్యుడు, సంధ్యాదేవి ఎంతో సంతోషించి, ఆమెతో " హనుమ ఈశ్వరాంశ సంభూతుడు. అవతార పురుషుడు. మహిమాన్వితుడు. ఆజన్మ బ్రహ్మచారి. అంటి వానితో నువ్వు సంసారసుఖం పొందలేవు. బాగా ఆలోచించుకో " అని నచ్చ చెప్పారు. సువర్చల " నాకు భౌతిక విషయాలపై ఆసక్తి లేదు. నిత్య బ్రహ్మచారిణిగా వుంటాను. నా తపస్సు కొనసాగిస్తాను. మా యిద్దరి జన్మరహశ్యాలు మీకు తెలుసు కనుక నా కోర్కెను తీర్చండి " అని చెప్పింది.

హనుమ విద్యాభ్యాసం పూర్తి అయింది. ఒక రోజు గురువైన సూర్యుని సమీపించి " గురు దేవా ! మీ కృపతో నా విద్య పూర్తి చేయించారు. గురు దక్షిణ గా ఏమి కావాలో ఆదేశించండి " అని వినయంగా అర్ధించాడు. దానికి పరమానంద పడ్డా సూర్యుడు " నాయనా ! చాలా శ్రద్ధగా విద్య నేర్చావు. విద్య తో బాటు గొప్ప వినయము అబ్బింది. నా కూతురు సువర్చలను అర్ధాంగిగా స్వీకరించటమే నేను నిన్ను కోరే గురుదక్షిణ. ఆమె మనసు లోని మాటే నీకు తెలియజేస్తున్నాను. సకల గుణసమేత. నీకు అన్నివిధాలా తగినది. సహకరిస్తుంది. నీ బ్రహ్మచర్య దీక్షకు భంగం కల్గించదు. త్రిమూర్తులు కూడా గృహస్తాశ్రమ ధర్మం స్వీకరిచినవారే. సందేహిచకు. వివాహం కాకపోతే జీవితానికి పరిపూర్ణత లేదు " అని నచ్చజెప్పాడు. హనుమకు వచ్చిన సందేహాలన్నిటినీ నివృత్తి చేశాడు. ఎట్టకేలకు హనుమ అంగీకరించాడు.

ఆంజనేయుడు కిష్కింధకు చేరి తన వివాహ విషయాన్ని, తల్లి దండ్రులకు, మేన మామలకు, బంధుజనానికి తెలియజేసి, అందరి అనుమతి పొందాడు. జ్యేష్ట శుద్ధదశమి బుధవారం ఉత్తరానక్షత్ర యుక్త సింహలగ్న పుష్క రాంశ యందు వివాహానికి అత్యంత యోగ్యమైన ముహూర్తంగా బృహస్పతి నిర్ణయంచేశారు. సూర్యపుత్రిక, సువర్చలా, వాయుపుత్రుడు ఆంజనేయుల వివాహం అత్యంత వైభవంగా జరిగింది. 32 కోట్ల దేవతలు, ఇంద్రాది అష్ట దిక్పాటకులు, కోట్లాది వానరసైన్యం వివాహవేడుక చూడటానికి వేంచేశారు. సముద్రాలన్నీ పోటెత్తాయా అన్నట్లుంది వివాహవేదిక వద్ద విష్ణుమూర్తి స్వయం గా బెత్తం ధరించి, పెళ్ళి వారందరినీ ఆహ్వానించి మర్యాదచేశాడు. పరమేశ్వరుడు

పార్వతీసమేతంగా, ప్రమధగణ పరివృతంగా విచ్చేసి విష్ణుమూర్తి చూపించిన ఉచితాసనంపై ఆసీనుడయ్యాడు. అందరికీ లక్ష్మీదేవి పద్మాపు గొడుగుపట్టింది. సరస్వతీ దేవి సమయానికి తగిన గద్య పద్యాలతో సభను ఆనందింపజేశింది. నారద, తుమ్బురులు వీణాగానంతో మైమరపించారు. అమరలోక నాట్యకత్తెలైన రంభ, ఊర్వసి, తిలోత్తమ మొదలైన వారంతా, కమనీయ నృత్యాలు చేసి విందు చేశారు. గంధర్వులు తమ విద్యా కౌశలం చూపి అందరి మన్న నలు పొందారు. గంగా, యమునాది నదులు వింజామరలు వీచాయి. సముద్రుడు వజ్ర, వైదూర్య, పరవాల, పద్మరాగ, అనర్ఘ రత్నరాశులను కానుకగా సమర్పించారు. చతుర్ముఖుడైన బ్రహ్మదేవుడు పౌరోహిత్యం నిర్వహించాడు. సప్తఋషులు, అరుంధతీ సహితులై మహాదాశీర్వాచనం చేశారు. సంజ్ఞాదేవి అమరలోక జలాలను ఆంజనేయుని పాదాలపై పోస్తుంటే సూర్య భగవానుడు మారుతి పాదపంకజాలను కడిగి జలాన్ని నెత్తిన చల్లుకొన్నాడు. దివ్యవైభవంగా ఆ ప్రాంతం విరాజిల్లింది. కన్నుల పండువుగా శ్రీ సువర్చలాంజనేయ కల్యాణం, కమనీయంగా, రంగ, రంగ వైభంవంగా జరిగింది. గాన విద్యలో హనుమ పెట్టిన భిక్షతో తలెత్తుకు తిరిగే వారు తుంబుర, నారదులు. భరతశాస్త్రంలో సహస్రాంశం కూడా నేర్వని వారు రంభాది అప్సరసలు. హనుమ మహిమలో అణుమాత్రం కూడా తెలియని వారు దిక్పాలకులు. తాను ఉపదేశించిన వాక్యాల, తాత్పర్యాలతో ముక్తులైన వారు అత్రి మొదలైన ఋషి వరేన్యులు. హనుమ దర్శనంతో పులకించని దేవతలు కాని, గీర్వాణుడు కాని, బృందారకుడు కాని లేరు.

## శ్రీ హనుమ కథా శ్రవణ ఫలం

నిశ్చల భక్తితో, హర్ష పులకిత గాత్రంతో, చేతులు జోడించి " ఆంజనేయా ! హనుమా ! మారుతీ ! సువర్చలా ప్రియా ! రామ భక్తా ! " అంటే చాలు హనుమ వచ్చి, మన ముందు చేరి రక్షిస్తాడు. కోరి అవతరించిన అవతారం ఆఞ్జనేయునిది. హనుమద్భక్తులు ఈ లోకంలో ధర్మార్ధ కామాలు సాధించి, మరుసటి జన్మలో కింపురుష వర్షంలో జన్మించి, నిరంతరం హనుమద్దర్శనాన్ని పొంది, ఆ పైన నిరతి శాయానంద, అద్వైత సిద్ధిని పొందుతారు. ఇది నిశ్చయం. హనుమ చరిత్రను ఎవరు భక్తి, శ్రద్ధలతో వింటారో చదువుతారో గానం చేస్తారో, ఆయన చరిత్రను ముద్రించి, బంధువులకు, స్నేహితులకు ఉచితంగా పంచుతారో వారందరికీ శ్రీ హనుమ ఆశీర్వాదం ఎల్లవేళలా వుంటుంది. అనుగ్రహ సిద్ధి కలుగుతుంది. ఇహంలోనూ పరంలోనూ సుఖసంతోషాలతో వర్ధిల్లుతారు.

" సువర్చలా ధిష్టిత వామ భాగం వీరాసనస్తం, కపి బృంద సేవ్యం
స్వపాద మూలం, శరణం గతానాం అభీష్టదం, శ్రీ హనుమంత మీళే "

" బ్బుద్ధిర్బలం, యశో ధైర్యం, – నిర్భయత్వ మరోగతా
అజాడ్యం, వాక్పటుత్వం చ, – హనూమత్ స్మరణాత్, భవేత్ "

" మాతా సువర్చలా దేవీ , – పితామే వాయు నందన:
బాంధవా, హనుయద్భక్తః –స్వదేశో, భువన త్రయం

" సువర్చలా కళత్రాయ – చతుర్భుజ ధరాయచ
ఉష్ట్రా రూఢాయ వీరాయ – మంగళం శ్రీ హనూమతే "

" స్వస్తి ప్రజాభ్యః పరి పాలయంతాం – న్యాయేన మార్గేన మహీం మహీశాః
గో బ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం – లోకా స్సమస్తా సుఖినో భవంతు.

" కాలే వర్షతు పర్జన్యః – పృధివీ సస్య శాలినీ
దేశోయం క్షోభ రహితో – బ్రాహ్మణాస్సంతు నిర్భయః

" శ్రీ సువర్చలా సమేత సుందర హనుమత్ప్రసాదేనా – సర్వే జనాః సుఖినో భవంతు – సమస్త సన్మంగళాని భవంతు "

ఓం శాంతి శ్శాంతి శ్శాంతి:

# శ్రీ హనుమ కథానిధి సర్వం సంపూర్ణం

ఈ కథలన్నీ వశిష్టమహర్షి, గౌతమమహర్షి కుమారుడైన శతానందునికి ఉపదేశించి చెప్పాడు.

ఈ రచనకు ఆధారం – పుష్ప గిరి తిమ్మన రచించి " సమీర కుమార విజయం " అనే పద్య కావ్యం

శ్రీ సువర్చలాంజనేయ స్వామివార్ల అనుగ్రహ ప్రాప్తి మనందరికీ కలగాలని ఆకాంక్షిస్తూ

మీ

**గబ్బిట దుర్గా ప్రసాద్**